

# విషయానుక్రమణిక

## నవంబరు,



నూతన రాష్ట్రపతి శ్రీ డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్య



నవంబరు, 1948

సంపుటము 25 సర్వధారి ఆశ్వయుజ, కార్తికములు సంచిక 11

# సానుభూతి

శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి

తరుణము వేచి నీ మృదుపదమ్ముల దాపున వ్రాలిపోవ ము
మ్మరమగు కాంక్షతో పయనమైతిని, నాదగు రాచబాటలో
పరచిన దోయి లోకము నవప్రభ లొల్కఁగ పుష్పమాలికో
త్కరములు స్వామి! నా హృదయతాపము సైఁని సానుభూతితోన్.

తరుణము వేచి నీ మృదుపదమ్ముల దాపున వ్రాలిపోవ ము
మ్మరమగు కాంక్షతో పయనమైతి, విషాదవిశీర్ణపత్రముల్
బిరబిర రాల్చి నాహృదయవీథుల నవ్యవసంతమాధురీ
భరము వెలార్చి వీచె, తొలివాయువు లత్యనుకూలరీతులన్.

తరుణము వేచి నీ మృదుపదమ్ముల దాపున వ్రాలిపోవ ము
మ్మరమగు కాంక్షతో పయనమైతిని, నాహృదయమ్ములో వ్యథా
భరము సహింపనోపని కృపామయి కోకిలబాల పంచమ
స్వరమున నాలపించినది చల్లని పాటల నాదస్రోవలోన్.

---

# శరజ్జ్యోత్స్న

●

శ్రీ బులుసు వెంకటేశ్వర్లు

౧

వెండికొండను గరఁగించి విశ్వకర్మ
నైపుణి మెసంగఁ జంద్రమండలములోన
మూఁడు పాళ్లించి శేషము భూమిమీఁదఁ
జల్లె ననఁబోలు నీ శరచ్చంద్రికఁ గన.

౨

విపులసకలప్రపంచదుర్భిక్షువేళఁ
గనికరముతోడ లోకముల్ గన్నతల్లి
పిండివంటలతో విందువెట్టఁ బ్రజకు
ఆరఁబోసిన పిండి నా నలరు జ్యోత్స్న.

౩

అప్సరోభామినీదివ్యహాసశోభఁ
బుణికి పుచ్చుకొని శశాంకపూతజీవి
భూప్రజానీకకృతపురాపుణ్యమునకుఁ
జంద్రికారూపమునఁ జూపు సరణి తోఁచు.

౪

మల్లికాకుసుమజాలంపుఁ దెల్లఁదనము
క్రముకలహంసికాపక్షకాంతిజాల
మమల నీహారరుచియు సౌమ్యప్రదీప్తి
దాఁచుకొనఁబోలు నీజ్యోత్స్నఁ దమశిరములు

౫

విరహిరోగులపట్టున వెజ్జతనము
యోగులయెడాటమున మహాయోగగురుత
సర్వజనములపట్టులఁ జల్లఁదనముఁ
జూపి వెలుఁగొందు నీ శరజ్జ్యోత్స్న ప్రియత.

---

# ఆంధ్రులు - సంగీతనాట్యాలు

శ్రీ వావిలాల సోమయాజులు

'దేవానా మిద మామనంతి మునయః
కాన్తం క్రతుం చాక్షుషమ్.'
—మాళవికాగ్నిమిత్రము.

**'Music is a moral law; it gives a soul to the Universe, wings to the mind, flight to the imagination, a charm to sadness, gaiety and life to everything.'**
**—Plato.**

భారతజాతివలెనే దాని సంగీతనాట్యకళలూ అతిప్రాచీనాలు. వేదకాలంనాటికే మనకు సంగీతనాట్యాలతో నిరుపమానమైన పరిచయం ఉన్నట్లు స్పష్టమౌతున్నది. నేటి పురాతత్వవేత్తల మొహంజోదారో, హరప్పాలలోని చరిత్రాత్మకపరిశోధనల మూలంగా ఈ రెండు కళలూ ప్రాగ్వైదికయుగంలోనే భారతదేశంలో విశేషవ్యాప్తి పొందినట్లు వ్యక్తమౌతున్నది. వేదవాఙ్మయంలోని యమయమీ ఊర్వశీపురూరవాది సంభాషణలు ప్రాచీనభారతీయ వాకోవాక్యసంపత్తికి (Dialogue) ప్రబలనిదర్శనాలు. శిష్టస్మృతులలో కొందరు దేవతలను ఆరాధించేటప్పుడు గృహస్థు కులపురోహితుడితోనూ, భార్యతోనూ కలిసి కొన్ని గేయాలు పాడవలెననీ, కొన్ని నాట్యాలు చేయవలెననీ నియమాలు కనిపిస్తున్నవి. గృహస్థూ, పురోహితుడూ పాడుతుంటే యజమానురాలు వీణాతంత్రులు మేళవిస్తూ శ్రుతి కలపవలెనట! అటువంటి వీణను 'పిఛోళీ' అని వ్యవహరించేవారట. దీనికే 'ఔదుంబరవీణ' అనే నామంకూడా కనిపిస్తున్నది. ఇది జంత్రవాద్యాల ప్రాథమికస్థితి అని చెప్పవచ్చును.

సామవేదంలోని 'కృష్ట'లలోనే సంగీతశాస్త్రంలోని స్వరాలను మనం గుర్తించవచ్చును. నేటి శాస్త్రాన్ని కంతటికీ మూలరూపాలని అనిపించుకోతగిన శుద్ధ, భిన్న, గౌడ, వేసర, సాధారణాలు అనే అయిదు గీతాలూ సామవేదంలోని ప్రస్వర, ఉద్గీత, ప్రతీహార, ఉపద్రవ, నిధానాలలోనుంచి వచ్చినవేనని సంగీతశాస్త్రపరిశోధకుల అభిప్రాయం. ప్రస్తారం చేసి చూస్తే తదుపరి వ్యాప్తిలో ఉన్న సమస్త రాగాలూ ఈ అయిదింటిలో దేనికో ఒకదానికి చెందుతవి. సామలను స్తోభ లంటారు. వాటిని ఉదాత్త, అనుదాత్త, స్వరితాది విభేదాలతో గానం చెయ్యటం మనకందరికీ తెలిసిన విషయమే. సంగీతంతోటిపాటిదే నాట్యంకూడాను. దేవతాప్రీతికోసం సామగానం చేసేటప్పుడు నృత్య, గీత, వాద్యాలు మూడూ కలిసి ఏర్పడే తౌర్యత్రికము (Symphony—Union of Song, Dance, and Instrumental music) కలిగితేగాని రసనిష్పత్తి కలగదని ప్రాచీనుల అభిప్రాయము.

భరతశాస్త్రంమీద వ్యాఖ్యానం వ్రాసిన తిక్కాకర, అభినవగుప్తపాదు లిద్దరూ భరతాచార్యుల వారికి పూర్వమే భరతశాస్త్రాన్ని గురించి కాశ్యప విశాఖాది ఆచార్యులు ప్రవచించినట్లు వ్రాసి ఉన్నారు. వారి గ్రంథాలు కాలగర్భంలో కలిసిపోవటం కారణంగా భరతర్షి ఈ శాస్త్రాన్ని నిబంధించి క్రమమార్గంలో లోకంలో ప్రచారం చేయవలసి వచ్చింది.

భరతాచార్యులవారినాటికే ఆంధ్రులు గాంధర్వ విద్యాప్రవీణులనీ, నాట్యశాస్త్రకోవిదులనీ తెలుస్తున్నది. ఈ ఆచార్యమహాశయుడు ౧౩ వ అధ్యాయంలో (౧) అవంతీ (౨) దాక్షిణాత్య (౩) పాంచాలీ

(౪) మాగధీరీతు లని నాట్యాన్ని విభజించి దక్షిణదేశానికి ఎల్లలు చెపుతూ 'దక్షిణసముద్ర వింధ్యమధ్య దేశమ్' అన్నాడు. ఆయనమతంలో కోసలులు, కళింగులు, ద్రావిడులు, ఆంధ్రులు, మహారాష్ట్రులు దాక్షిణాత్యులు. వీరు బహునృత్యగీతాభిమానులట! చతురమధురలలితాంగాభినయులట!

ఆంధ్రజాతి ఏకచ్ఛత్రాధిపత్యంక్రిందకు వచ్చి కళాప్రియంభావుకమైనది ప్రప్రథమంలో శాతవాహన రాజుల కాలంలోనే. ఈ రాజవంశంకంటే ప్రాచీనము లనిపించుకున్న జగ్గయ్యపేట, భట్టిప్రోలు మొదలైన కొన్ని ప్రదేశాల్లోని శిల్పఖండాలను పరిశీలిస్తే ఆనాటికే ఆంధ్రులు సంగీతనాట్యశాస్త్రాలలో అందె వేసిన చేతు లని అవగతమౌతుంది. శాతవాహన రాజులలో మూడవవాడు కృష్ణుడు. జగత్ప్రశస్తిగన్న సాంచీ స్తూపస్తంభంమీద ఇతని ప్రాకృతశాసనం ఒకటి కనిపిస్తున్నది. సాంచీశిల్పాలలో కొన్ని ఆంధ్రులవి. వాటిలోని నాట్యభంగిమలూ, జంత్రవాద్యసమ్మేళనాచిత్రములూ శాతవాహనులనాటి ప్రాథమిక స్థితిలోని ఆంధ్రుల సంగీతనాట్యవైభవాన్ని ఊహించటానికి చక్కని ఉదాహరణాలు. కొంతకాలానికి సాతవాహనరాజులు యావద్భారతాన్నీ కైవసంచేసుకొని మగధ రాజధానిగా రాజ్యపాలనం చేశారు. వారిలో ప్రసిద్ధుడు హాలమహారాజు—గాథాసప్తశతీసంగ్రథిత, 'బృహత్కథ' కర్త గుణాఢ్యపండితుడు, కామసూత్రకర్త వాత్స్యాయన మహర్షి ఈ కాలంవారు. గాథాసప్తశతిలో అనేకగాథలు ఆనాటి ఆంధ్రుల సంగీత, నాట్య, చిత్రలేఖనాదికళాప్రియత్వాన్ని వెల్లడి చేస్తున్నవి. మహర్షి వాత్స్యాయనుడు కామసూత్రాలలో అనేకసందర్భాలలో సంగీతనాట్యాలకు సంబంధించినసూత్రాలు వ్రాసినాడు. ఆయన విద్యాసముద్దేశంలోని నాగరకవృత్తంలో నాగరకులు యక్షరాత్రి, సువసంతక, మదనోత్సవాది గోష్ఠులు జరుపవలె నని నాడు. వీటిలోని సువసంతక, మదనోత్సములు కేవలము నృత్యగీతవాద్యప్రాయాలైన వని కామసూత్ర వ్యాఖ్యాత జయమంగళుడు 'సువసంతో మదనోత్సవః, తత్ర నృత్తగీతవాద్యప్రాయః' (౧-౪-౪౨) అని వ్యాఖ్యానించినాడు. 'పక్షస్య మాసస్యవా ప్రజ్ఞాతేఽహని సరస్వత్యా భవనే నియుక్తానాం నిత్యసమాజః, కుశీలవాశ్చాగంతుకాః ప్రేక్షణకమేషాం దద్యుః, ద్వితీయేఽహని తేభ్యః పూజానియతం లభేరయన్, తతో యథా శ్రద్ధ మేషాం దర్శన ముత్సర్గోవా. ఆగంతుకానాం చ కృతసమవాయానాం పూజన మభ్యుపపత్తి శ్చేతి గణధర్మః' (౨౭-౨౮) మొదలైన మూల సూత్రాలలో మహర్షి వాత్స్యాయనుడు 'ప్రఖ్యాతమైన పండుగ దినాల్లో నగరానికివచ్చేనటులూ, సంగీతజ్ఞులూ, మొదటిదినం సమస్తప్రదర్శనాలల్లో పాల్గొని, మూడవ దినం క్లిష్టదానం అవుతుంది కనుక రెండవదినమే వారి కోసం ఏర్పాటైన ప్రేక్షకమూల్యంలోనుంచి కొంత ధనాన్ని బహుమానంగా పుచ్చుకోవలసిందనీ, దానికి ఇష్టంలేని సందర్భంలో ప్రేమపూర్వకంగా నాగరకులు ఇచ్చిన వస్త్రాభరణాలతో తృప్తిపొంది జరిగిన నాటక ప్రదర్శనాన్ని ప్రేక్షకులు తిరిగి కోరినట్లయితే ప్రదర్శించవలసిందనీ, నగరాల్లో ఉండే కుశీలవులకూ, నాగరకులకూ, పరిషత్తులకూ ఆగంతుకులుగా వచ్చిన నటగాయకాది కళాభిజ్ఞులను గౌరవించడం ధర్మ'మనీ శాసించినాడు. దీనినిబట్టి క్రీ. శ. పూర్వమే ఆంధ్రజాతి సంగీతనాట్యాదికళాభిజ్ఞత సంపాదించి కట్టుబాట్లతో వాటిని పోషించుకున్నదని వ్యక్తమౌతుంది. అంతకు ఎంతోపూర్వమే భారతదేశంలోని సమస్తప్రాంతాలలోనూ స్త్రీపురుషనాటకసంఘాలు ఉన్నట్లు వాల్మీకిమహర్షి రామాయణంలోని 'నరాజకే జనపదే ప్రభూత నటనర్తకాః, ఉత్సవాశ్చ సమాజాశ్చ వర్ధంతే రాష్ట్రవర్ధనాః' ఇత్యాది అభిభాషణాలవల్ల తెలుస్తూనే ఉన్నది. మహర్షి శయనోపచారికాలలోనూ, చతుష్షష్టినిరూపణములోను వైశికమునను మరికొన్ని సూత్రాలు వ్రాసినాడు. ఆనాడు ఉదకవాద్యములు, భాండనృత్యములు నున్నట్లు తెలియుచున్నది. హాలమహారాజు నాటిదనే చెప్పదగ్గ కౌముదీమహోత్సవ నాటకంలో మరికొన్ని సంగీతనాట్యప్రశంసలు కనిపిస్తున్నవి. హాలమహారాజుతదనంతరం సాతవాహన రాజులలో గౌతమీపుత్ర, వాసిష్ఠీ పుత్రులు ప్రసిద్ధికెక్కిన రాజన్యులు. వీరు ధాన్యకటకము రాజధానిగా ఆంధ్రదేశాన్ని పాలించి అమరావతి, రామిరెడ్డిపల్లి,

గుంటుపల్లి, గోలీ, బుద్ధాం, సమాధానపురం, మంచికల్లు మొదలైన అనేకప్రదేశాలల్లో బౌద్ధక్షేత్రనిర్మాణానికి కారణభూతులై అనేకయజ్ఞయాగాదిక్రతువు లొనర్చి పూర్వరాజన్యప్రశస్తి పొందినవారు. పైన చెప్పిన యజ్ఞయాగాదిక్రతులక్షణాలను పరిశీలించినప్పుడు దేశంలో సంగీతనాట్యాలు అత్యుత్తమస్థితిని పొందినవని చెప్పవలసివస్తుంది. పూర్వోక్తాలైన బౌద్ధక్షేత్రాలలోని శిల్పఖండాలను పరిశీలించినప్పుడు ఈ అభిప్రాయం దృఢమౌతుంది. ఆలీఢప్రత్యాలీఢాది పాదవిన్యాసాలూ, పతాకాదిముద్రలూ, కోమలకరణాంగహారాలూ వాటిలో శిల్పితాలైనవి. జంత్ర, చర్మ, వాంశికాది వాద్యాలతో ఆనాటి ఆంధ్రులకు పరిచయమున్నట్లు స్పష్టమౌతుంది. వేయితీగలుగల 'గెయిటర్'ను పోలిన ఒకవాద్యవిశేషశిల్పం ఒకటి అమరావతిస్తూపచిత్రాలలో కనిపిస్తున్నది. సాతవాహనరాజులనాటి సంగీతనాట్యాలనూ, శాస్త్రవిస్తృతినీ స్మరించటానికి శిల్పఖండాలు తప్ప మరొక ఆధారం ఏమీ కనిపించటంలేదు.

సాతవాహనరాజులకు తరువాత ఆంధ్రదేశాన్ని, ఇక్ష్వాకులు, పల్లవులు, సాలంకాయనులు మొదలైన ఆంధ్రభృత్యులు పరిపాలించారు. శాతవాహనరాజులు చేతికిచ్చిన కళాసంపత్తిని వ్యర్థం చేయకుండా వన్నెలు చిన్నెలు దిద్దుకుంటూ, పూర్వప్రభుమార్గాన్ని అనుసరించి పోషించారు—ఈ రాజవంశాలలో జన్మించిన ప్రభువులు. మాధ్యమికబౌద్ధవాదానికి పట్టుగొమ్మ అయిన నాగార్జునాచార్యుడు ఇక్ష్వాకువంశమూలపురుషుడు—శాంతిమూలుని సమకాలికుడని చరిత్రజ్ఞుల అభిప్రాయము. ఇది సత్యమైనట్లైతే ఆ మహావిజ్ఞాని వ్రాసిన సంగీతశాస్త్రం ఏ టిబెత్తు భాషలోనుంచో బయటపడినప్పుడు ప్రాచీనాంధ్ర సంగీతవిద్యావిశేషాలు మరికొన్ని బయటపడవచ్చును. నాగార్జునకొండశిల్పాలలో కొన్ని ఖండాలను పరికించినప్పుడు ఆనాటి సంగీతనాట్యాలను గురించి కొంత ఊహాగానం చెయ్యటానికి అవకాశం ఉంటుంది.

సాతవాహనపతనానంతరం ఇక్ష్వాకులతో పాటు పల్లవులుకూడా ఆంధ్రదేశంలో కొంతభాగాన్ని పాలించారు. వీరు పశ్చిమంనుంచి చాళుక్యరాజు రెండవ పులకేశి వచ్చి దక్షిణానికి తరిమివేసేటంత వరకూ దేశాన్ని పాలించి సంగీతనాట్యాలకు దోహద మిచ్చారు. పల్లవమహేంద్రవిక్రముడు దక్షిణానికి వెళ్ళిపోయేటప్పుడు అనేకకవిగాయక శిల్పివర్గాలను ఆంధ్రదేశంనుంచి ఆయనవెంట తీసుకొని వెళ్ళినాడు. వారిలో సుప్రసిద్ధుడు మేధావిరుద్రు డనే నామాంతరమున్న రుద్రాచార్యులు. ఈ మహానుభావుడు తన కాలంలో ఉన్న తానాలను సరిదిద్ది నిబంధిస్తే ప్రభువు మహేంద్రవర్మ 'కుడిమియమలై' అనేచోట శాసనస్థం చేయించాడు—శిలాస్తంభాలమీద. ఇక్ష్వాకుల పతనానంతరం ఆంధ్రదేశం విష్ణుకుండినుల హస్తగతమైంది. ఉండవల్లిగుహలు వీరు తొలిపించినవే నని శ్రీ భావరాజు కృష్ణరావుగారి అభిప్రాయము. అందులోని వీణాదివాద్యజంత్రాలనూ, నాట్యభంగిమలలో నున్న స్త్రీవేషాలనూ పరికిస్తే ఆనాడుకూడా సంగీతనాట్యాలు రెండూ ఆంధ్రులకు ఆదరణపాత్రాలైన కళలుగా ఉన్నవని వ్యక్తమౌతుంది.

'అందీ అందని భావరేఖల ప్రసన్నాగారతఙ్ లేత పూతఙ్ తీపారగ తీర్చి దిద్దిన అజంతాగహ్వరశ్రేణులు' నా కటకరాజులనాటివి. కానీ శిల్పులాంధ్రులు. ఎల్లోరా, కైలాసము, అజంతా శిల్పఖండాలనూ, భిత్తిచిత్రాలనూ పరిశీలిస్తే సంగీతనాట్యాలకు ఆనాటి రాజన్యులెంత ప్రాధాన్యము నిచ్చారో వ్యక్తమౌతుంది. శివతాండవాదిదేవతానాట్యభంగిమలను నిరూపణ చేసే సందర్భంలో శిల్పులు ఉపయోగించిన వీణలనూ, సంగీతవస్తువులనూ గమనిస్తే అజంతాశిల్పసామ్రాట్టులకు సంగీతనాట్యశాస్త్రాలలో ఉన్న పరిచయం ద్యోతిత మౌతుంది.

క్రీ. శ. ౬౧౦ లో రెండవ పులకేశి పూర్వదిగ్విజయయాత్ర బయలుదేరి ప్రాగాంధ్రాన్ని జయించి తమ్ముడు కుబ్జవిష్ణువర్ధనుని నూతనరాజ్యాధిపతిని చేసి తిరిగి వెళ్ళిపోయినాడు. అతని వంశస్థులు కొంతకాలం అంతఃకలహాలతో కాలం వెళ్ళబుచ్చి తరువాత కళాపోషణకు పూనుకున్నారు. వీరితోబాటు పశ్చిమాన రాజ్యంచేస్తున్న బిల్హణమహాకవిశిష్యుడు

సోమేశ్వరుడు నాట్యశాస్త్రాభిమాని. మహారాష్ట్రం నుంచి వచ్చిన ఒక గోండుకన్యకకు స్వయంగా 'చరణచారణము' చెయ్యటానికి సింహాసనం దిగివచ్చేవాడు. ఆ మహారాజు నేర్పిన నాట్యభంగిమయే తరువాతకాలంలో 'గోండ్లి' అనే ప్రసిద్ధనామాన్ని పొందింది. నృత్తరత్నావళిలో జాయపసేనాపతి ఈ విషయాన్నే—

"కల్యాణకటకే పూర్వం భూతమాతృమహోత్సవే
సోమేశః కౌతుకే కాంచిన్ ఖేల్ల వేష ముపేయుషీమ్
నృత్యంతీ మథ గాయంతీం స్వయం పాహ్యమనోహరమ్
ప్రీతో నిర్మితవాన్ చిత్రగాండినీ మిత్యయమ్
స్వతో ఖేల్లీ మహారాష్ట్రగాండినీ త్యభిధీయతే"

అని పలికినాడు.

పశ్చిమచాళుక్యులలోని సోమేశ్వరాదికళారాధకులను చూచి కీర్తిస్పర్ధతో కొందరు పూర్వచాళుక్యులు నాట్యసంగీతశాస్త్రాలకు చేయూత నిచ్చి పోషించారు. అందు మొదటివాడు మొదటి చాళుక్య భీముడు. అతని మనుమడు రెండవ అమ్మరాజు. చాళుక్యభీమునికి (క్రీ. శ. ౮౯౦-౯౧౮) 'గాంధర్వ విద్యాప్రవీణ' బిరుద మున్నది. ఇతడు చెల్లవ అనే నట్టువరాలికి అత్తిలివిషయంలో రెండు ప్రదేశాలను దానం చేసినట్లు అత్తిలి శాసనంవల్ల (Attili C. P. grant 14 of MER 1917-18) తెలుస్తున్నది. అందులో చెల్లవ 'నట్టువరాం డ్రనే కలువలకు సూర్య కాంతి'అని వర్ణిత ఐనది. రెండవ అమ్మరాజు (క్రీ. శ. ౯౪౫-౯౭౦) 'కవిగాయకకల్పతరు' బిరుదనాముడు. ఇతని కీర్తిని కవిచక్రవర్తి, పోతన భట్టు అనే ఇద్దరు కవులు గానం చేసినట్లు చరిత్రజ్ఞులు తెలుపుతున్నారు. ఇతడు పట్టవర్ధనికులసంజాతనూ, సంగీతనాట్యశాస్త్రాలలో నిష్ణాత అయిన చామెకాంబను పోషించినట్లు తెలుస్తున్నది. (Kaluchambarru grant in E. I. Vol. VII, PP, 117-192) క్రీ. శ. ౧౧ వ శతాబ్దాదిలోనే నన్నయ మహాకవి భారతకృత్యాదిన కవిగాయకసమితులకు నమస్కరించాడు. రాజరాజనరేంద్రుని కుమారుడు కులోత్తుంగచోళదేవుడు మాతామహరాజ్యాన్ని పాలించటానికి పితృరాజ్యాన్ని వదలి దక్షిణానికి వెళ్లిన తరువాత వెల్లూరుచోళులు, నతవాడిప్రభువులు, పొత్తపి చోళులు, కోటవంశీయులు, కాకతీయులు స్వతంత్రించి ఆంధ్రదేశాన్ని భిన్నభిన్నప్రదేశాలలో ముఖ్యపట్టణాలు ఏర్పరుచుకొని పాలించటం ప్రారంభించారు. తరువాతికాలంలో కాకతీయులు ప్రముఖులై మహాసామ్రాజ్యాన్ని స్థాపించారు.

కాకతీయులలో మొదటి ప్రతాపరుద్రుని కాలమునాటికి వీరశైవము ఆంధ్రదేశంలో విశేషప్రచారాన్ని పొందింది. వీరశైవభక్తులు పరమేశ్వరసన్నిధానాన్ని పొందటానికి సంగీతనాట్యాలను సహాయకారులుగా స్వీకరించారు. కాకతీయులనాటి సంగీతనాట్యాల స్థితిగతులను తెలుసుకోటానికి పండితారాధ్యచరిత్ర, బసవపురాణము, తిక్కనభారతప్రయోగములు, క్రీడాభిరామము, పల్నాటివీరచరిత్ర ముఖ్యమైన సాహిత్యాధారాలు.

పాల్కురికి సోమన పండితారాధ్యచరిత్రములో ఒకచోట విపులమైన నాట్యప్రసంగము చేసినాడు. అందులో మార్గ, దేశివిభాగాలను పేర్కొని లాగు, వంజళము, ఢాళము, వళి, తివురు, బాగు, వాహిణి, సాళి ఇత్యాదిదేశభేదములను చెప్పినాడు. గతులలో అడ్డము, తివుటము, సన్నవమిలి, భ్రమరము, జలచరము, కోతి, గజ, సింహ, భుజంగములనూ, బంధములలో వారణ, దొర్తు, ద్రుక్కరము, మలపము, జల్లణము, బొల్లావణి, జోనాళి మొదలైనవాని నెన్నో ఉటంకించినాడు. వీణోత్తమము, బ్రహ్మవీణ, సారంగవీణ, రావణవీణ, గౌణవీణ, కాశ్యపువీణ, భుజంగవీణ, భోజవీణ, త్రిసరవీణ, సరస్వతీవీణ, రావణహస్తవీణ మొదలైన మార్గవీణలనూ, దివిరి, సకిన, వళి, విట, సాగరిక, విపంచిక, సర, మల్లరి, గోలాష్ఠి, పాపావతి మొదలైన దేశీవీణలనూ, జాతివాస, విజాతివాస, పశువాస, రుద్రవాస, నిధివాస, ఋషివాస, కార్తికవాస, ఘోరవాస, త్రిపురవాసాది వాంశికాలనూ, అవజము, కాహళము, రుండము, రోలు తప్పటము, తారుమద్దెలలు మొదలైన వాద్యాలనూ పేర్కొనినాడు.

వీరశైవులు భక్తిరసోన్మాదావస్థకు సాధనంగా సంగీతనృత్యాదులను గ్రహించిన విధానం బసవపురాణంలోని క్రిందిపంక్తులవల్ల గోచరిస్తుంది:
(బసవ పురా. పే. ౭౨)

"అక్క మహాదేవి! అల్లమద్దెలలు
జక్కొల్పి వేగంబ సంధించు కొనుడు;
సర్వమానమున బసవ ప్రమథవ్వ!
కర మర్థి పట్టుడు కాహళలోలి
సకలవ్వ! నీవును సంగళవ్వయును
నొకరీతి నిలువుడు సుకరమ్ముగాను,
బాలరుద్రమ! ఎత్తుపట్టగ వాళ
గ్రోలు వాయింపుము గుడ్డవ్వ! నీవు
సట్టన నృత్యంబు సరసం బెరింగి
సంగు దాసమ! మహేశ్వరి! వీరభద్ర
లింగవ్వ! మీరు కేళికలు సేయుండు;
రమణదుకూలాంబరమును గంచుకము
నమరించుకొని చల్లడము బిగియించి
ఏతెమ్మ నీవు పురాతమ్మ! శీఘ్ర
మాతతమ్ముగ నృత్య మాడుడు గాని;
తాళముల్ పట్టుడు తాళగింపుండు
నాళతి వేళకు నందరు ననుచు,
నవిరళంబుగ నంత నార్భటం బిచ్చి
జవనిక రప్పించి సరసమై నిలచి,
పాలపగు ముఖరసంబును సౌష్ఠవమ్ము,
లలియు, భావంబు, ఘూకళియు, ఝుంకళియును
ఝరియు శేవయు, విభ్రమమును రేఖయును
నెరయంగ నీరీతి నృత్యంబు సలుప".

బసవపురాణంలో సకలేశ్వర మాదిరాజయ్య కథలోనూ, నాట్యనమిత్తిండికథలోనూ ఇట్లే మరికొంత విపులముగా గాంధర్వప్రశంస కనిపిస్తున్నది. భక్తులు శ్రీశైలపర్వతారోహణం చేసేటప్పుడు, తుమ్మెదపదములు, ప్రభాతశంకరాదిపదములు పాడుకొంటూ ఆరభటీవృత్తిలో అంగలు వేస్తూ వెళ్లేవారని సోమన చెప్పినాడు. ఆనాటికే యక్షగాననాటకాలూ, తోలుబొమ్మలాటలూ తెలుగుదేశంలో ప్రసిద్ధంగా ఉన్నట్లు సోమన రచనలవల్ల తెలుస్తున్నది. "శతకంబు, శివతత్వసారంబు, దీపకళిక, మహానాటకము నుదాహరణములు, రుద్రమహిమయు, ముక్తకామములు, ప్రమథేశపురాతనపటుచరిత్రములు, క్రమమొంద బహునాటకము లాడువారు, భారతాదికథల చీరమరుగుల నారంగబొమ్మల నాడించువారు' అన్నవి ఆయన మాటలు. మహాకవి శ్రీనాథుడు కాకతీయప్రథమప్రతాపుని సమకాలికుడైన నలగామరాజు పలనాటిని పాలిస్తూ సింహాసనం ఎక్కేటప్పుడు ఒకానొక నర్తకి వచ్చి నాట్యంచేసిన విధానాన్ని కంటికి కట్టేటట్లు—

"ఘనవైభవంబున కామవిభుడు
నవ్వుచు సెల విచ్చె నాట్యంబు సేయ,
పరమృదంగము లెస్స వాయించు మేటి
కుడిభాగమందున గుదురుగా నిలచె,
దాళమానజ్ఞులు దాపటి దిశను
నిలచి యుత్సాహంబు నేరుపుమీర,
ముఖవీణ వాయించు ముఖ్యు డొక్కండు
రాగ మాలాపించు రమణు లిద్దరును,
నిండువేడుకతోడ నిలచిరి వెనుక
గంజలోచనయును ఘనమైన పాత్ర
మదనుపట్టపుదంతి మంజులవాణి
...నిలచి నాట్యమునకు నేర్పరియైన
వేత్రపాణికి తన వినయంబు సూపి,
అత డొసంగిన గజ్జె లతిభక్తితోడ
బాదములం గట్టి, పంచవర్ణముల
కాసె గట్టిగ గట్టి కడు జపం బదర
మద్దెల తాళాల మధ్య నిలుచుండి
యోరజూపున రాజు నొయ్యన జూచి
సమపాదయుక్తమైన స్థానకస్థితిని
ధాత్పర్యమున దేవతలకును మ్రొక్కి
పుష్పాంజలి యొసంగి పూని నాట్యంబు
సమకట్టి నాదంబు సభయెల్ల గ్రమ్మ
గైకోలు విడుదలల్ ఘనకళాకేళి
కై ముడి కట్నముల్ కనుపింప జేసి
వెలయంగ దొమ్మిది విధము లైనట్టి
భూచారి నాట్యంబు పొందుగా సల్పి

పదునారు విధములై పరగిన యట్టి
యాకాశచారులు నమరంగనాడి,
గతిచారి భేదముల్ కనుపడునట్లు
భ్రమణసంయుతిదీప్తపటిమ మీరంగ
బాణిభేదములను బాటించి చూపి
స్థానకపంచయసంయుక్త మమర
ప్రేరణి దేశిని ప్రేంఖణ శుద్ధ
దండికా కుండలి తగు బాహుచారి
సప్తతాండవములు సల్ప చిత్రముగ..."

అని వర్ణించినాడు. ఇంత విపులంగా నాట్యోపక్రమోపసంహారాలను విశదీకరించిన పట్టు ఆంధ్ర సాహిత్యంలో మరొకటి కనిపించటం లేదు. కాకతీయుల కాలంలో ఏకవీరాదేవిజాతరలు జరిగేవి. అందులో జనసామాన్యానందానుభవంకోసం ద్విపద ప్రబంధాలను పాడేవారని వినుకొండ వల్లభామాత్యుడు క్రీడాభిరామంలో—

"ద్రుతతాళంబున వీరగుంఫితకథల్
ధుంధుం కిటత్కారసం
గతి వాయింపుచు సాంతరాళికయతి
గ్రామాభిరామంబుగా
యతిగూడన్ ద్విపదప్రబంధమున వీ
రానీకముల్ బాడె నా
కృత ప్రత్యక్షరముల్ గుమారకులు ఫీ
ట్కారంబునన్ దూలగన్"

ఒక కోమలి వీరగాథలు పాడుతూంటే జనం పొంగి పరవశులై పోతూ ఉండేవారని వల్లభరాయడు—

"గర్జించి యరపి జంఘాకాండయుగళంబు
వీరసం బెట క్రోల వ్రేయు నొకడు,
యాలీఢపాదవిన్యాస మొప్పగ వ్రాలి
కుంతాభినయము గైకొను నొకండు
బిగువు కన్నుల కుబ్బు బెదరు చూపులతోడ
ఫీట్కార మొనరించు పెలుచ నొకడు,
పటుభుజాస్తంభపరిపాటి ఘటియిల్ల
ధరణి యాస్ఫోటించి దాటు నొకడు,
యుద్ది ప్రకటింప నొక్కరుం డోలనాడు
బయలు గుర్రంబు భంజళ్లు పరుపు నొకడు
కొడుము దాటింపుచును పెద్ద కొలువులోన
బహుతి పల్నాటివీరుల బాడునపుడు"

అన్నాడు. గుర్రపు భంజళ్లు మహాకవి పింగళి సూరనార్యుని విశేషంగా ఆకర్షించినవి. అందువల్ల ఉదాత్తనాయకుడైన ప్రద్యుమ్నునిచేత ప్రభావతీప్రద్యుమ్నంలో ఆయన గుర్రపుభంజళ్లు త్రొక్కించాడు. దేశీయనాట్యమూ, సంగీతమూ విస్తారంగా ఆ దినాల్లో ప్రచారంలో ఉండటంచేతనే కవిబ్రహ్మ తిక్కనామాత్యుని దృష్టి వాటిమీద నిలిచింది. ఆయన అర్జునుణ్ణి విరాటరాజు కొలువులో ప్రవేశపెట్టేటప్పుడు 'ఒండు పనులకు సెలవు లేకునికిజేసి యభ్యసించితి శైశవ మాదిగాగ, దండలాసకవిధమును గుండలియును, బెక్కణంబు తెరంగును ప్రేరణంబు' అని ఆ వీరుడినోట పలికించాడు. ఈ కవిబ్రహ్మ తన నాటి తోలుబొమ్మలనుంచి ఎన్నో ఉపమానాలు గ్రహించాడు. 'కీలుకా డెడలింప గడసిన బొమ్మలకైవడిఁ బటుతురంగవ్రజంబు గూలెఁ' (ద్రోణపర్వము—ఆ. 3) 'చలమున దుస్ససేనుడును సౌబలుడున్ మిము బట్టి యార్వ బొమ్మలక్రియ నాడుచుండుదురు మానక నీవు సుయోధనుండు' (ఉద్యోగపర్వము).

[సశేషము]



# ప్రాక్-పాణిని

శ్రీ శివశంకరశాస్త్రి

## చాక్రవర్మణీయ వ్యాకరణము

**అథో వ్యాకరణం జాతం యచ్చాక్రవర్మణాహృతమ్.**

అష్టాధ్యాయిలో "ఈత్ చాక్రవర్మణస్య" (౬-౧-౧౩౦) అను సూత్రమున చాక్రవర్మణుని నామము గోచరించుచున్నది. కాతంత్రపరిశిష్టములోని "ఇతో వా" (సంధి ౨౮) సూత్రముపై వృత్తిలో శ్రీపతిదత్తుడు చాక్రవర్మణుని పేర్కొన్నాడు. శకటి-శాకటి-శాకటాయనీయ త్రిమునివ్యాకరణమున "కప శ్చాక్రవర్మణస్య" (ఉణ్ 3-౧౧౮) అను సూత్రము కలదు. దానిపై వ్యాఖ్యలో ఉజ్జ్వలదత్తుడు "కపాతే రేవ చాక్రవర్మణస్య ఆచార్యస్య మతేన కపప్రత్యయః సంప్రసారణంచ. కుపాపః సఏవ. స్వరేతు విశేషః" అని వివరించినాడు. దీనినిబట్టి యితడు శాకటాయనునికి పూర్వుడని ఉపపన్నమగుచున్నది. ఈ సూత్రములను, వృత్తులను జూచుచో తత్కాలమున నీతని వ్యాకరణము తప్పక యుండెననిపించును. "కపః చాక్రవర్మణస్య" వలన చాక్రవర్మణునకు మహర్షి శాకటాయననకు పూర్వమే ప్రాతిపదికమాత్రములకు ధాతుజత్వకల్పన సమ్మతమని తేలుచున్నది. అది కానిచో ఔణాదికసూత్రమున ఈతని నామ మేల నిబద్ధమగును? ఈయనవ్యాకరణమున ద్వయశబ్దమునకు సర్వవిభక్తులలో సర్వనామత్వము స్వీకృతమయినట్లు ప్రతీతి. అందుచేతనే మాఘకవి "శ్వ్యథాం ద్వయేషా మపి మేదినీభృతామ్" (౧౨-౧౩) అనుటయు, భట్టోజిదీక్షితుడు ఖండించుటయు సంభవించినది.

చాక్రవర్మణుడు చక్రవర్మపుత్రుడు. వాయుపురాణప్రకారము చక్రవర్మ కశ్యపదనాయకుల పౌత్రుడు. దానవసంబంధ ముండుటచేతనే ధర్మశాస్త్రకారులలో నతని నామము కానరాదు. కశ్యపుడు బహుప్రాచీనమహర్షి. ఆయనప్రపౌత్రుడనుట చేత చాక్రవర్మణుడు ప్రాచీను డనవలసివచ్చినది.

## ఆపిశల వ్యాకరణము

**ఆపిశలం తతో జ్ఞేయం య త్పురాపిశలిస్మృతమ్.**

అష్టాధ్యాయిలో "వాసుప్యాపిశలేః" (౬-౧-౯౨) అను సూత్రమువలన శబ్దాధికారమున పాణినికి ఆపిశలి ప్రామాణికు డని తోచును. "అపిశల స్యానంతరాపత్య మాపిశలిః. ఇఞ్ ఆద్యచో వృద్ధిః" అని శాబ్దికు లన్నారు. అందుచే ఆపిశలుని పుత్రుడు ఆపిశలి. అతడు సామతంత్రప్రణేత యని ప్రసిద్ధి. పౌరాణిక మతప్రకార మీతడు యాజ్ఞవల్క్యునికి శ్వశురుడు. యాజ్ఞవల్క్యుడు వైశంపాయనుని మేనల్లుడు, శిష్యుడు.

"కృత్వా చాధ్యయనం తేషాం
శిష్యాణాం శత ముత్తమమ్
విప్రియార్థం సశిష్యస్య
మాతులస్య మహాత్మనః"

(మహాభారత. శాంతి. 3౨3 అ.)

అని యాతడు స్వయముగా జెప్పినాడు. తరుణ యాజ్ఞవల్క్యుడు వృద్ధశాకల్యునితో బ్రహ్మవిచారమున ప్రవృత్తు డయినాడు. (బృహ. ఉప.) కావున ఆపిశలి, శాకల్య, వైశంపాయనాదులు సమకాలికులు. కురుక్షేత్రయుద్ధకాలమున ఆయన యుండెనని యూహించుట పురాతత్త్వవేత్తలకు అసమ్మతము కాదు. శ్రీ హేమచంద్రరాయ చౌధురీ '*Political History of Ancient India*' అను గ్రంథమున ౧౩౧ పుటలో నిట్లు చెప్పినాడు :

"*The Malloi : They occupied the valley of the* Hydraotes (*Ravi*) *on both banks of the river. Their name represents the Sanskrit Malava Weber informs us that Apisali, one of the teachers cited by Panini speaks of the formation of the compound—'Khandraka-Malava'. Dr Smith pointed out that the Mahabharata coupled the tribes in question as forming part of the Kaurava host in Kurukshetra war.*"

భారతయుద్ధానంతరము యుధిష్ఠిరుడు ప్రభు వయినాడు; అప్పుడే కల్యబ్దము ప్రారంభమయినది. క్రీస్తుశకము ప్రారంభ మగునప్పటికి ౩౧౦౦ కల్యబ్దములు గడచినవి. మత్స్యపురాణప్రకారము ఆపిశలి భృగువంశమున నొక గోత్రప్రవర్తకఋషి; ఒకప్పుడు పార్వతీదేవి పుణ్యకవ్రతమునకు నిమంత్రితుడు.

ఆపిశలిప్రోక్తవ్యాకరణనామము ఆపిశలము (పాణిని ౪-౩-౧౦౧,౧౧౫). ఈ గ్రంథమును లక్ష్యమున నుంచికొని కాశికావృత్తిలో "ఆపిశలపాణినీయే శాస్త్రే" (౬-౨-౩౬) అని లిఖితమయినది. శ్రీ తత్త్వనిధిమతప్రకారము ఉల్లేఖయోగ్యము లగు నవవ్యాకరణములలో ఆపిశల మొక్కటి.

"అష్టకా ఆపిశలపాణినీయాః"అని అమోఘవృత్తిలో అభినవశాకటాయనుడు లిఖించినాడు. పాణిని వ్యాకరణమువలెనే ఆపిశలము సూత్రాత్మక గ్రంథ మనియు, అది అష్టకమనికాని, అష్టాధ్యాయియనికాని ప్రసిద్ధి చెందెననియు దీనివలన గ్రహింపవచ్చును. "ప్రోక్తాల్లుక్" (౪-౨-౬౪) సూత్రముపై కాశికాదివృత్తులవలన, ఆపిశలవ్యాకరణపఠనపాఠములు చేయువారి వర్గమునకు ఆపిశల మను పేరు వచ్చిన దని చెప్పనగును.

బహుకాలముక్రిందటనే ఆపిశలము పోయినది. అయినను వివిధగ్రంథములలో ఆపిశలిసూత్ర మేదో యొకటి కానవచ్చుచుండును :

(౧) "తురుస్తుశమ్యమః సార్వధాతుకాసు చ్ఛందసి"— కాశికలో వామనాచార్యుడు "ఆపిశలాస్తురుస్తుశమ్యమః సార్వధాతుకాసు చ్ఛందసీతి పఠంతి" (౭-3-౯౫) అన్నాడు. శ్రీపాదకృష్ణపండితుడు ఈ స్థానమున "*A rule of Apisali is given by the Kasika* 7-3-95 (S. S. O.)" అని వ్రాసినాడు.

(౨) "శతాచ్చ ఠన్యతావగ్రంథే"— కైయటుడు ప్రదీపములో దీనిని వివరించుచు, నిది ఆపిశలి వచన మన్నాడు. వేంకటాచలపండితుని యభిప్రాయముకూడ నిట్టిదే.

(౩) "సమయాదీనాం కర్మప్రవచనీయత్వమ్"- కాతంత్రకారకప్రకరణములోని "ద్వితీయైనేన" (చ. ౨౨) అను సూత్రముపై టీకలో దుర్గసింహుడు "ఆపిశలీయవ్యాకరణే కర్మప్రవచనీయత్వం దృష్టమితి మతమ్" అని వ్రాసినాడు.

"ఆపిశలవ్యాకరణమున సమయా నికషా హా ధిక్ అంతరా అంతరేణ శబ్దసమూహము కర్మప్రవచనీయ మని నిర్ధారితము. తదనుసారముగా శర్వవర్మయు 'కర్మప్రవచనీయైశ్చ' (౨౫) అను సూత్రమున ఈ శబ్దము లన్నియు ఆపిశలిమతప్రకారము కర్మప్రవచనీయాంతర్గతము లని చెప్పినాడు"అని భావము.

(౪) "ధేను రనఞి క ముత్పాదయతి"—పదమంజరిలో హరదత్తమిశ్రుడు "ధేను రనఞి క ముత్పాదయతి ఇత్యాపిశలేః సూత్రమ్" అని వ్రాసినాడు (పద. ఖండ. ౨. ౧౩౬ పుట). "జ్ఞాపకం స్యాత్ తదంతత్వే తథా చాపిశలే విధిః" (౪-౨-౪౫) అని కాశికా

వృత్తి. ఆపిశలివిధి యేదియో తెలుపుటకు హరదత్త గ్రంథమున ఈ సూత్ర ముద్ధృతమయినది.

(౫) "మన్యకర్మ ణ్యనాదర ఉపమానాత్ విభాషా ఽప్రాణిషు"—ఈపాఠము శ్రీపతిసమ్మతము. (కాతంత్రపరిశిష్టము. కారక. ౩౯ సూత్ర) "మన్య కర్మ ణ్యనాదర ఉపమానే విభాషా ఽప్రాణిషు" అను పాఠము కైయటాచార్యసమ్మతము (౨-౩-౧౭ సూత్ర ప్రదీపము). హరినామామృతవ్యాకరణమున కారక ప్రకరణములో శ్రీజీవగోస్వామి "మన్యకర్మ ణ్యనాదర ఉపమానే విభాషా ఽప్రాణిషు-ఇత్యేవాపిశలసూత్రం చ. జయాదిత్యాదయ స్తూపమానా దితిచ నాద్రియంతే ప్రత్యుదాహరంతి చ" (ఖండ ౧. ౭౪౨ పుట) అని వ్రాసినాడు.

(౬) "ధాత్వంతరయోగేవా"—ఇది ఆపిశల సూత్రము కావచ్చును. కాతంత్రప్రదీపమున "ఆపి శలీయమతే ధాత్వంతరయోగే పాక్షికం కర్తృత్వం తదనుసారేణ సంగత మిత్యదోషః" అని యున్నది. (విద్యాసాగరీయప్రదీపము. కారక ౭౧౯ పుట.)

"తదర్హమ్" (౫-౧-౧౧౭) అను పాణినీయ సూత్రమువంటి సూత్ర మేదియు ఆపిశలమున లేదని వినికిడి. "తదర్హమితి నారబ్ధం సూత్రం వ్యాకరణాంతరే" అని భర్తృహరియు, "వ్యాకరణాంతరే ఆపిశలే కాశ కృత్స్నేచ" అని హేలరాజును వ్రాసినారు. కాని భర్తృహరి యేగ్రంథమును జూచి, ఏ కింవదంతి విని యిట్లు లిఖించెనో తెలియదు.

సంప్రదాయనివృత్తికయి కేవలసూత్రపాఠమే కాక, ధాతుపాఠప్రాతిపదికపాఠము (గణపాఠము), శిక్షాశాస్త్రముకూడ ఆపిశలి రచించినాడు. అందు శిక్ష మాత్రము నేటికిని కలదు. అది ఆపిశలీయశిక్ష యని బహుస్థానములందు ముద్రితము. కాతంత్రమున నామ ప్రకరణములో ౧౪౩ సూత్ర టీకలో దుర్గసింహు డిట్లు లిఖించినాడు: "ఆపిశలీయంతు—

పాద స్త్వర్థసమాప్తి ర్వా జ్ఞేయో వృత్తస్య వా పునః
మాత్రికస్య చతుర్భాగః పాద ఇత్యభిధీయతే."

దీనినిబట్టి ఛందస్సంబంధమున ఆపిశలిముని యేదో గ్రంథము రచించినట్లు ఊహింపవచ్చును.

ఆపిశలిధాతుపాఠము లభింపలేదు. కాని ఒకా నొకకాలమున అది ప్రచారములో నుండె ననుటకు సందేహము లేదు. "సమవప్రవిభ్యః స్థః" (౧-౩-౨౨) అను సూత్రముపై భాష్యమున "అస్తిం సకార మాతిష్ఠతే" అని స్మరించినాడు. దీనిపై మహాభాష్య దీపికలో "ఇహాస్తిః కేచిత్ సకారమాత్ర ముపదిశ్య పిత్ స్వతాగమం విదధతి" అని భర్తృహరి లిఖించినాడు. (మహాభాష్యము, ద్వితీయఖండము, *Kielhorn intro.*) భర్తృహరివాక్యమును పరిస్ఫుటము చేయుటకై కాశికాన్యాసమున జినేంద్రబుద్ధి యిట్లు వ్రాసినాడు: "సకారమాత్ర మస్తిధాతు మాపిశలా చార్యః ప్రతిజానీతే. తథాహి న తస్య పాణినే రివాస భువీతి పాఠః. కిం తర్హి? స భువీతి. సత్యేవాగమా గుణవృద్ధీ ఆతిష్ఠతి ఇతి. ఏవంహి సప్రతిజానీత ఇత్యర్థః" (౧-౩-౨౨). అమోఘవృత్తికారుడు శాకటాయనుడును జినేంద్రబుద్ధి లెనే చెప్పినాడు. భర్తృహరి కించు మించుగా సమకాలికుడు స్కందస్వామి "ఉషి-జిఘర్తీ ఛాందసౌ ధాతూ. వ్యాకరణస్య శాఖాంతర ఆపిశ లాదౌ స్మరణాత్" అని నిరుక్తభాష్యమున లిఖించి నాడు. ఈ ప్రాచీనోక్తులవలన ఆపిశలధాతుపాఠ ముండె ననవచ్చును.

ధాతుపాఠమువలెనే ఆపిశలగణపాఠముకూడ లభింపదు. గణపాఠమనగా ప్రాతిపదికపాఠము. ఆపిశల సర్వాదిగణపాఠము వర్తమానగణపాఠముకంటె భిన్న మని దీపికలో హరి వ్రాసినాడు. పాణినికి పూర్వమే సర్వాదిగణపాఠ మొకటి భాష్యాదికములనుండి యుప పన్న మయియుండును. పాణినీయసర్వాదిపాఠ మిట్లున్నది: "సర్వ విశ్వ...సిమ...పూర్వపరావర... వ్యవస్థాయా మసంఖ్యాయామ్...స్వమజ్ఞాతి ధనా ఖ్యాయామ్...అంతరం బహిర్యోగోప సంవ్యాన యోః...త్యద్ తద్ యద్...కిమ్...సర్వాదిః" ఆపి శలీయసర్వాదిగణపాఠ మిట్లుండె ననవచ్చును: "సర్వ విశ్వ...సిమ త్యద్ తద్ యద్...కిమ్...పూర్వ పరా వర...వ్యవస్థాయా మసంజ్ఞాయామ్. స్వమజ్ఞాతిధనా ఖ్యాయామ్. అంతరం బహిర్యోగోపసంవ్యానయోః, సర్వాదిః."

అష్టాధ్యాయిలోని "పూర్వ పరావర..." (౧-౧-౩౩) సూత్రభాష్యమున, సూత్రప్రయోజనాధికరణప్రసంగమున మూడుపక్షము లుపన్యస్తములయినవి. పతంజలి ప్రథమద్వితీయపక్షప్రత్యాఖ్యానపూర్వకముగా తృతీయపక్షమును గ్రహించినాడు.

(౧) ఇదం తర్హి ప్రయోజనం వ్యవస్థాయామసంజ్ఞాయామితి వక్ష్యామీతి. ఏతదపి నాస్తి ప్రయోజనమ్. ఏవం విశిష్టాన్యేవైతాని గణే పఠ్యంతే.

(౨) ఇదం తర్హి ప్రయోజనం ద్వ్యాదిపర్యుదాసేన పర్యుదాసో మాభూదితి. ఏతదపి నాస్తి ప్రయోజనమ్. ఆచార్యప్రవృత్తిః జ్ఞాపయతి నైషాం ద్వ్యాది పర్యుదాసేన పర్యుదాసో భవతీతి. యదయం పూర్వత్రాఽసిద్ధమితి నిపాతనం కరోతి. వార్తికకారశ్చ పఠతి జశ్ భావా దితి (౫-౩-౧౩: ౨ వార్తిక) చేత్ త్త్రత్రాఽభావా దపవాదప్రసంగ ఇతి.

(౩) ఇదం తర్హి ప్రయోజనం—జసి విభాషాం వక్ష్యామీతి.

వర్తమానసర్వాదిగణపాఠము మనసులో నుంచి కొని ప్రథమపక్షమును, ఆచార్యప్రవృత్తిని భావించి ద్వితీయపక్షమును మహర్షి ప్రత్యాఖ్యానము చేసినాడు. కాని, వర్తమానసర్వాదిగణపాఠముకంటె భిన్నపాఠము లేనియెడల "ద్వ్యాదిపర్యుదాసేన పర్యుదాసో మాభూదితి" అని యేల చెప్పవలసివచ్చినది? దీనిని వివరించుచు కైయటుడు ప్రదీపములో నిట్లు వ్రాసినాడు: "...త్యదాదీని పఠిత్వా గణే కైశ్చిత్ పూర్వాదీని పఠితాని. తత్రాఽద్వ్యాదిభ్య ఇతి తసిలాదీనాం ప్రతిషేధః ప్రాప్నోతి. తత్ర పునః సర్వనామ సంజ్ఞా తసిలాదివిధానార్థం విధీయతే. తేన ద్వ్యాది పర్యుదాసో బాధ్యతే." పాణినికాలమునగూడ ఆపిశలము వ్యాప్తిలో నన్నట్లు పదమంజరిలో హరదత్తు డిట్లన్నాడు: "తత్ర యే సాధవస్తే...కథం పున రాచార్యేణ పాణినినా అవగత మేతే సాధవ ఇతి? ఆపిశలేన పూర్వవ్యాకరణేన." ఆపిశలగణపాఠమును గూర్చియే యీవిషయము లన్నియు సంభావితము లయ్యె ననవచ్చును.

ఆపిశలసంప్రదాయ మొకటి ప్రబలముగా నుండెను. ఇప్పటికిని వివిధగ్రంథములలో ఏతత్సంప్రదాయోక్తులు కానవచ్చును.

(౧) కాతంత్రసంధి ౭ - సూత్రపంజియందు త్రిలోచనదాసు డిట్లన్నాడు: "తథా చాపిశలీయాః పఠన్తి—

సామీప్యేఽథ వ్యవస్థాయాం
ప్రకారేఽవయవే తథా
చతుర్ష్వర్థేషు మేధావీ
ఆదిశబ్దం తు లక్షయేత్...ఇతి..."

(౨) కాతంత్రసంధి ౨౪ సూత్రముపై టీకలో దుర్గసింహు డిట్లు లిఖించినాడు: "తథా చాపిశలీయ శ్లోకః—

ఆగమోఽనుపఘాతేన వికారశ్చోపమర్దనాత్
ఆదేశస్తు ప్రసంగేన లోపః సర్వాపకర్షణాత్..."

సుపద్మములోని సుబంత ప్రకరణమున ౪౭ సూత్రముపై 'మకరందమున' విష్ణుమిత్రుడు నీశ్లోకము నుద్ధరించుచు "ఇత్యాపిశలీయాః" అన్నాడు. ఆపిశలి స్వయముగా దీనిని చెప్పెనో, లేదో అనుసంధానము చేయవలెను. దీనిని సంప్రదాయోక్తిగా ప్రస్తుతము గ్రహింపనగును.

(౩) నవీనకౌమారమతమున నిట్లున్నది:

"గత్యర్థాదిషు కస్యైవ నీఖాద్యాదిషు కర్తృతా
శేషే కర్మ చ కర్తా చ యథాసంభవ మిష్యతే."

ఇది ఆపిశలసంప్రదాయశ్లోకము. కాని శ్రీపతి, లోచన, దుర్గసింహాదుల ప్రాచీనకౌమారగ్రంథములలోగాని, అన్యసంప్రదాయప్రాచీనరచనలో గాని యీ శ్లోకము కానరాదు. ఇయ్యది ఆపిశల సంప్రదాయములోనిదని యూహించుటకును వీలు లేదు. పాణినీయసూత్రములు—"గతిబుద్ధి.....సణౌ" (౧-౪-౫౨) "హృక్రో రన్యతరస్యామ్" (౧-౪-౫౩) అను రెండిటిలో మొదటిదానిపై లఘువృత్తిలో పురుషోత్తము డిట్లు వ్రాసినాడు: "తతశ్చ గత్యర్థాదివ్యతిరిక్తానాం ణిచాం కర్తౄణాం పృథక్త్వం భవతి కర్తృత్వం కర్మత్వం చేతి వదంతః కేచిత్ పాచయత్యోదనం

దేవదత్తం దేవదత్తే నేత్యాద్యపి భవతీ త్యాహుః. ఏవంచ హ్యృక్రోశ్వేతి ప్రపంచార్థం వేదితవ్యమ్."

ఉక్తశ్లోకమును పురుషోత్తము డెరుగడు. కాని చెప్పిన విషయము తాత్పర్యశ్లోకోపలబ్ధమయియుండును. కాతంత్రపరిశిష్టమున శ్రీపతి యిట్లు లిఖించినాడు: "తదా హ్యృక్పంచో ర్వాపచన మకర్మకాభ్యవహార్యా ర్థయో ర్నిత్యం మాభూ దితి, కథం ప్రపంచార్థమితి లఘు వృత్తికృతోక్తమ్." (కారక ౧౭ సూ). శేషోక్త సూత్రము అనర్థకప్రపంచార్థకము కాదని యభిప్రాయము. అందుచే దీని వ్యాఖ్యలో గోపీనాథతర్కాచార్యుడు తొలుత ఆపిశలీయసంప్రదాయమును పేర్కొని యిట్లు వ్రాసినాడు: "తథా చాహుః గత్యర్థాదిషు కర్తృ...అ త్రైవ మాపిశలీయదిశా నా హ్యృకృంచో రి త్యనర్థకమ్; తథాచ పురుషోత్తమో వాపచన మనర్థక మి త్యాహ తజ్జేతి...హీనమహీమత్వాత్ లఘు వృత్తి ర్నాల్పాత్సురా దితి భావః." అక్కడ చెప్పిన శ్లోకమును శ్రీపతి వినలేదనికాని, ఆపిశలవాద మాత డెరుగ డనికాని చెప్పుట యుక్తము కాదు. ప్రసంగాంతరములో నతడు ఆపిశలిని పేర్కొని "మన్యకర్మ ణ్యనాదరే..."ఇత్యాదిసూత్రము నుద్ధరించినాడు(కారక ౩౯). ఏమయినను శ్రీపతిగోపీనాథుల వాక్కులనుబట్టి కౌమారసంప్రదాయములోని పుండరీకవిద్యాసాగరుడు కాతంత్రప్రదీపములో నిట్లు వ్రాసినాడు: "ఆపిశలీయ మతే హ్యృకృంచో ర్వాపచనం ప్రపంచార్థ మితి పురుషోత్తమః. అత్రాకర్మక త్వేఽభ్యవహార్యార్థేవ సాఫల్య మితి శ్రీపతిప్రలాపో నిరస్తః" (కారక ౨౧౯). కలాప దీపికయందును భట్టి యిట్లే వ్రాసినాడు.

అష్టాధ్యాయిలోవలెనే చాంద్రమునందును "గతి బోధాహారశబ్దార్థానా హ్యృనాం ప్రయోజ్యే" (౨-౧-౪౪) అనియు, "హ్యృక్రోర్వా" (౨-౧-౪౫) అనియూ సూత్రము లున్నవి. ఆపిశలీయశ్లోకమును వర్ణతఃగాని, తాత్పర్యతఃగాని యెరిగియున్నచో చంద్రగోమి యేల యూరకుండును? శ్రీపతికి పిమ్మటను, గోపీనాథునికి పూర్వమునను ఆపిశలీయ సంప్రదాయసంబంధి యని యీ శ్లోకము నెవరో సృజించియుందురు. మండనాచార్యుని దౌర్ఘటిప్పణి యీశ్లోకమున కాకరము కావచ్చును. మండనాచార్యుడు క్రీ. శ. ౧౩, ౧౪ శతాబ్దులలోనివాడు. కావున నతడు శ్రీపతికి పరవర్తి, గోపీనాథునకు పూర్వవర్తి.

## వ్యాడీయ వ్యాకరణము

మునినా వ్యాడినా గ్రంథః ప్రణీత స్తదనంతరమ్.

వ్యాడినామకు లగు వైయాకరణు లిరువురు కలరు. వేదనిధియగు శౌనకభార్గవుని శిష్యు డొకడు; ఆయన పాణినికి పూర్వుడు. రెండవయాతడు పాణిని శిష్యుడు,మాతులపుత్రుడో పౌత్రుడో యగు దాక్షాయణ వ్యాడి. అష్టాధ్యాయిలో వీరి పేరులు కానరావు. పేరు కనబడకున్నను పాణినికి ముందువెనకల నున్న వివిధ గ్రంథములవలన వృద్ధవ్యాడినామధేయ ముపపన్నమగును. దాక్షాయణవ్యాడి సంగ్రహకారు డని ప్రసిద్ధి. మహాభాష్యములోను, దీపికాదిగ్రంథముల లోను ఆయన నామము గోచరించుచున్నది.

వికృతవల్లిలో వ్యాడి యిట్లు చెప్పినాడు:

"శైశిరీయే సమామ్నాయే వ్యాడినైవ మహర్షిణా
జటాద్యా వికృతీ రష్టౌ లక్ష్యంతే నాతివిస్తరమ్."

వ్యాడి మహర్షి యని తేలినది. "శౌనకాదిభ్య శ్ఛందసి" (౪-౩-౧౦౬)అను సూత్రమున పాణిని శౌనకుని పేర్కొన్నాడు. శౌనకుని ఋక్ప్రాతిశాఖ్యలో వ్యాడిపేరు కలదు. శునకవంశమునకంటె అర్వాచీనుడు (గృహపతికాని, కులపతికాని) శౌనకుడు పాణినికి పూర్వుడు. ఆయన ఋక్ప్రాతిశాఖ్యలో నిట్లు కానవచ్చును—"ఉభే వ్యాడిః సమస్వరే" (౩-౧౩); "పరేషాం న్యాస మాచారం వ్యాడి స్తౌచేత్ స్వరౌ పరౌ" (౩-౭); "వ్యాడేః సర్వత్రాభిధానలోపః" (౬-౨౧) ఇత్యాదులు. ఉవటాచార్యుడు "పరేషాం......"అను సూత్రవ్యాఖ్యలో "అనార్షా దితికరణాత్ పరేషా మతురాణాం న్యాస ముదాత్తత్వ మాచారం మన్యతే వ్యాడి రాచార్యః" అన్నాడు. దీనివలన శౌనకోక్తవ్యాడి పాణినికి పూర్వుడని యుపపన్నమగుచున్నది.

వ్యాడివిరచితమగు వ్యాకరణగ్రంథ మేదో యుండవలెను. శౌనకీయఋక్ప్రాతిశాఖ్యలో—

"సమాపాద్యం నామ వదంతి సత్వం
తథా ణత్వం సామవశాంశ్చ సంధీన్
ఉపాచారం లక్షణతశ్చ సిద్ధ
మాచార్యా వ్యాడిశాకల్యగార్గ్యాః" (౧౩-౧౨)

అను శ్లోకము దానికి ప్రమాణము. వ్యాకరణాధి కారమున సుప్రసిద్ధులగు శాకల్యగార్గ్యులతోపాటు వ్యాడి నామముకూడ లిఖితము. బహుశః వ్యాడివ్యాకరణములో వైదికలౌకికభాగము లుండవచ్చును. పూర్వ ముద్ధరించిన వచనములు వైదికభాగమునకు ప్రమాణములు. "ఇకాం యణా వ్యవధానం వ్యాడిగాలవయో రితి వక్తవ్యమ్" అన్నాడు పురుషోత్తముడు. "యణాఽవ్యవధానం వ్యాడిగాలవయోః" అని సుపద్మమున పద్మనాభుడు లిఖించినాడు. గాలవీయవ్యాకరణమున లౌకికభాగము నుండి పాణిని వివిధవాదములను గ్రహించినాడు (౬-౩-౬౧; ౭-౩-౯; ౮-౪-౬౭).

"ఇకాం యణ్భి ర్వ్యవధానమ్" అనునదియు లౌకికనియమసంబంధిసూత్రము. కావున గాలవ వ్యాకరణములోవలె వ్యాడివ్యాకరణమున లౌకికభాగ మున్నట్లు భావించుట అసంగతముకాదు. పాణిని-అష్టాధ్యాయిలోకూడ లౌకికవైదికభాగము లున్నవి. వ్యాడివ్యాకరణముగాని, గాలవవ్యాకరణముగాని అష్టాధ్యాయివలె నుండె నని యూహింపవచ్చును. అష్టాధ్యాయిలో లౌకికభాగము ప్రధానము, గాలవాదులలో వైదికభాగమే ప్రధానము. షడ్గురుశిష్యు డిట్లు చెప్పినాడు:

"ఆసీన్ గృహపతి ర్యోవై
నైమిశారణ్యవాసినామ్
శతానీకాయ రాజ్ఞే వై
జనమేజయసూనవే."—ఇత్యాది...

శౌనకు డనగా ఋక్ప్రాతిశాఖ్యకారుడు, కులపతి గృహపతియగు శౌనకుడు. ఈయన పితామహుడు ఇంద్రోతదైవాపశౌనక భార్గవుడు. శౌనక భార్గవునకు వేదనిధి యని బిరు దుండెను. అతడు పెద్ద వ్యాకరణవు. వ్యాడి స్వయముగా—

"నత్వాఽఽదౌ శౌనకాచార్యం
గురుం వేదమహానిధిమ్
మునీంద్రం సర్వవేదజ్ఞం
బ్రహ్మజ్ఞం లోకవిశ్రుతమ్,
అని స్తుతించినాడు.

ఋక్ప్రాతిశాఖ్యకారుడగు శౌనకుడు జనమేజయ పుత్రుడగు శతానీకుని కాలమున నున్నట్లు షడ్గురు శిష్యుడు భావించినాడు. అందుచే తచ్ఛిష్యమహా శిష్యుడు వ్యాడి జనమేజయుని కాలమునగాని, పరీక్షిత్తు కాలమునగాని ఉన్నట్లు తలంపవచ్చును.

"స్వాగతాదీనాంచ" (౭-౩-౭) అను పాణినీయసూత్రస్వాగతాదిగణమున వ్యడనామము కానవచ్చుచున్నది. వ్యడుని అపత్యము వ్యాడి. ఈయన గోత్రప్రవర్తకమునులలోనివాడు. అత్రిగణమున వ్యాడి గోత్రపాఠముకూడ కలదు. ఆత్రేయ, అర్చనానస, శ్యావాశ్వమునిత్రయ మీ గోత్రప్రవర అని గ్రంథాంతరమువలన తెలియవచ్చుచున్నది. వీరందరును వేద మంత్రద్రష్టలు, పాణినికి పూర్వులు. స్వాగతాదిగణము లోని వ్యడమునిపుత్రుడు వ్యాడియు పాణినికి పూర్వుడు. ఈయన శౌనకశిష్యుడగు వ్యాడి యయి నను కావచ్చును.

"సరూపాణా మేకశేష ఏకవిభక్తౌ" (౧-౨-౬౪) అను సూత్రముపై "ఆకృత్యభిధానాద్వైకం విభక్తౌ వాజప్యాయనః" అని కాత్యాయనవార్తిక మున్నది. దీనిపై పతంజలి యిట్లు వ్రాసినాడు: "ఆకృత్యభిధానాద్వైకం శబ్దం విభక్తౌ వాజప్యాయన ఆచార్యో న్యాయ్యం మన్యతే. ఏకా ఆకృతిః, సా చాభిధీయత ఇతి." ఈ సూత్రముపై కాత్యాయనుడు "ద్రవ్యాభిధానం వ్యాడిః" అను వేరొక వార్తికము రచించినాడు. దీనిపై పతంజలి "ద్రవ్యాభిధానం వ్యాడి రాచార్యో న్యాయ్యం మన్యతే ద్రవ్య మభిధీయత ఇతి" అన్నాడు. దీని యభిప్రాయ మిది. ప్రవృత్తినిమిత్తభేదముచే శబ్ద మయిదువిధములు: జాతి, ద్రవ్య, లింగ, సంఖ్యా, కారకములు. వానిలో వాజప్యాయనుడు జాతిపదార్థవాది; వ్యాడి ద్రవ్యపదార్థవాది. ఉభయులలో ఈ మతభేద మున్నది. అనంతరము పాణినిముని ఉభయపదార్థవాది. కావుననే ఈ యాశయము వినవచ్చుచున్నది:

"ఇహ జగతి సంసారే
పదార్థో భిద్యతే ద్వయమ్. "
క్వచిద్ వ్యక్తిః క్వచిత్ జాతిః
పాణినే స్తూభయం మతమ్.

వ్యక్తి యనగా ద్రవ్యము. పాణినికి పిమ్మట కాత్యాయనముని జాతిద్రవ్యలింగపదార్థవాది. ఆయన తరువాత వ్యాఘ్రపాదుడు చతుష్టయవాది. అనంతరము పతంజలి పంచకవాది.

అందుచే వైయాకరణభూషణసారములో—
"ఏకం ద్వికం త్రికం చాథ
చతుష్కం పంచమం తథా,
నామార్థా ఇతి సర్వేఽమీ
పక్షాః శాస్త్రే నిరూపితాః."

అని యున్నది.

ఏకపదార్థవాది వాజప్యాయనుడు యాజ్ఞవల్క్యుని సమకాలికుడు. కావున పాణినికి పూర్వుడు. వాజప్యాయనుని మొదలు పతంజలివరకును ఉత్తరోత్తరోత్తముడగు ముని పూర్వపూర్వోక్తుని కంటె అర్వాచీనుడు. వాజప్యాయనునివలె వ్యాడికూడ ఏకపదార్థవాది. కావున వ్యాడి పాణినికి పూర్వు డనవలెను. ఏకపదార్థవాది యగు వ్యాడి వైయాకరణు డని కాత్యాయనుడు చెప్పినాడు. ఈ సంగతులను బట్టి శౌనకోక్తవ్యాడియే కాత్యాయనోక్తవ్యాడియని తోచును.

వ్యాకరణాధికారమున 'సంగ్రహ'మను గ్రంథము బహుకాలమునుండి ప్రచారములో నున్నది. "సనూత్రవృత్త్యర్థం పదం మహార్థం ససంగ్రహం సిధ్యతి వై కపీంద్రః" (ఉత్తరకాండ, ౩౧-౪౪) అను శ్లోకము రామాయణమున కలదు. లక్షణసంబంధమున ప్రాచీనులు "బహ్వర్థకవాక్యానా మేకత్ర సంకలనం సంగ్రహః" అన్నారు. పతంజలికాలమునగూడ సంగ్రహ మను గ్రంథ ముండెను. ఆయన మహాభాష్యమున నిట్లు లిఖించినాడు: "సంగ్రహ ఏతత్ ప్రాధాన్యేన పరీక్షితం నిత్యోవా స్యాత్, కార్యో వా స్యాత్... సంగ్రహే తావత్ కార్యప్రతిద్వంద్విభావాన్మన్యామహే నిత్యపర్యాయవాచినో గ్రహణ మితి." ఈగ్రంథ రచయిత యెవరో మహాభాష్యమునుండియే గ్రహింపవచ్చును. "ఉభయప్రాప్తౌ కర్మణి" (౨-3-౬౬)అను సూత్రవ్యాఖ్యావసరమున పతంజలి "శోభనా ఖలు దాక్షాయణస్య సంగ్రహస్య కృతిః. శోభనా ఖలు దాక్షాయణేన సంగ్రహస్య కృతిః" అన్నాడు. పతంజలి చూచిన సంగ్రహకృతి దాక్షాయణునిది. ఆత డెవరు? మహామహోపాధ్యాయ శివదత్తశర్మమతమున దాక్షాయణుడు పాణినికి మేనమామకొడుకు. దీనిని విశ్వసింపవచ్చును. దాక్షీపుత్రుడగు పాణినిముని దక్షుని దౌహిత్రుడు. దాక్షీపుత్రదాక్షాయణుడు ఆయనపౌత్రుడు. పాణిని దాక్షాయణశిష్యు డని కొంద రందురు. మహాభాష్యదీపికలో భర్తృహరి యిట్లన్నాడు: "సంగ్రహో ప్యస్యైవ శాస్త్ర స్యైకదేశః. తత్రైకతంత్రత్వాత్ వ్యాడేశ్చ ప్రామాణ్యా దిహాపి తత్రైవ సిద్ధశబ్ద ఉపాత్తః." సంగ్రహకారదాక్షాయణుడు కూడ వ్యాడినామప్రసిద్ధుడనియు, తత్సంగ్రహాదిని 'సిద్ధ'శబ్దమును జూచి కాత్యాయనుడు వార్తికపాఠప్రారంభమున సిద్ధశబ్దము ప్రయోగించె ననియు దీనివలన నుపపన్నమగుచున్నది.

"సంగ్రహో వ్యాడికృతో లక్షశ్లోకసంఖ్యో గ్రంథ ఇతి ప్రసిద్ధిః" అని నాగేశభట్టు వ్రాసినాడు. "చతుర్దశసహస్రాణి వస్తూని అస్మిన్ సంగ్రహగ్రంథే" అని భర్తృహరి లిఖించినాడు. వాక్యపదీయద్వితీయకాండలోని "ప్రాయేణ సంక్షేపరుచీ నల్పవిద్యాపరిగ్రహాన్......" ఇత్యాదిశ్లోకవ్యాఖ్యలో పుణ్యరాజు "ఇహ పురా పాణినీయేఽస్మిన్ వ్యాకరణే వ్యాడ్యుపరచితం * లక్షశ్లోకపరిమాణం సంగ్రహాభిధానం నిబంధ మాసీత్" అన్నాడు. స్మృత, ప్రణీత, రచితప్రభృతిశబ్దములకు బదులుగా పుణ్యరాజు ఉపరచిత అనికాని, ఉపచరిత అనికాని యేల ప్రయోగించెను? ఒకవేళ దాక్షాయణుడు సంగ్రహగ్రంథ

---

* వ్యాడ్యుపరచిత మనుచోట నొకానొక విమర్శకుడు వ్యాడ్యుపచరితమ్ అన్నాడు. "ఉపరచితం ప్రతిసంస్కృతమ్" "ఉపచరిత మారాధితం సేవితంవా". ఉపచరిత—approached, attended అని Monier Williams వ్రాసినాడు. నష్టము లేదు.

మునకు ప్రతిసంస్కర్త యగునా? అయినను చిక్కులేదు. సామాన్యజీవితకాలములో పదునాలుగు వేల విషయములనుగూర్చి లక్షశ్లోకాత్మకగ్రంథము రచించుట సహజము కాదు. కావుననే వృద్ధుడయిన వ్యాడిగ్రంథమును చేకొని, పాణినినయానుసారముగా తత్కాలోపకారకముగా దాక్షాయణవ్యాడి ప్రతిసంస్కారము చేసియుండవచ్చును. ఇట్టి యుదాహరణములు కలవు. దృఢబలప్రతిసంస్కృతవర్తమానచరకసంహిత, చంద్రటపరిశోధితవర్తమానసుశ్రుతము, చంద్రగోమిప్రతిసంస్కృతవర్తమానచాంద్ర వ్యాకరణము, దుర్గసింహాదికర్తృకప్రతిసంస్కృతపరిశోధితవర్తమాన కలాపము, జుమరనందపరిశోధితక్రమదీశ్వరీయ రసవతీవృత్తి ఇత్యాదులు కలవు.

మహారాజహర్షవర్ధనుడు, వామనాచార్యుడును వ్యాడిప్రణీతలింగానుశాసనమును జూచినారు. హర్షవర్ధనుడు "వ్యాడేః శంకరచంద్రయో ర్వరరుచే ర్విద్యానిధేః పాణినేః సూక్తాన్ లింగవిధీన్ విచార్య......" అన్నాడు. వామనీయలింగానుశాసనమున నిట్లున్నది: "వ్యాడిప్రణీత మథ వారరుచం సచాంద్రమ్......... యద్వ్యాడిప్రముఖైః ప్రపంచబహులం లింగస్య లక్ష్మోదితం తం సంహృత్య మయా యథా నిగదితం వ్యాఖ్యాయతే జానతామ్." ఈ వ్యాడి పాణినికి పూర్వవర్తియో సమకాలికుడో చెప్పుట కష్టము. కాని యీతడు దాక్షాయణవ్యాడికాని, వృద్ధవ్యాడికానేరడు.

వ్యాడివిరచితమైన ఉత్పలినీకోశము చిరకాలముక్రిందనే లోపించినది. కావ్యకల్పలతా పరిమళమున అమరచంద్రుడు "వ్యాడికృతోత్పలినీ మధ్యాత్" అన్నాడు. ఉత్పలిని ప్రామాణికకోశము. అభిధానచింతామణివ్యాఖ్యలో హేమచంద్రుడు "ప్రామాణ్యం వాసుకేః వ్యాడేః..." అన్నాడు. మహేశ్వరుని విశ్వప్రకాశములో "భోగీంద్రకాత్యాయనసాహసాంకవ్యాడిప్రరస్నరాణాం......"అని యున్నది. టీకాసర్వస్వమున సర్వానందసంధోపాధ్యాయుడు బహువారములు వ్యాడీయకోశమతమును, వచనములను ఉద్ధరించినాడు. "ఛాగః శకిదివిః స్మృత ఇతి వ్యాడినా దీర్ఘ ఉక్తః" (అమర. కాం. ౨) "ఆజ్యేచ ఘృతమ్—

అయాచితే యజ్ఞశేషే నిర్వాణేచాపి సుందరే
అమృతం వారిణి ప్రోక్త మతిహృద్యేచ వస్తుని.
ఇతి వ్యాడిః."

దీనిని లక్ష్యమం దుంచికొని త్రికాండశేషమున పురుషోత్తముడు "వ్యాడిః వింధ్యస్థో నందినీసూతః" అన్నాడు. ఈతడు పాణినికి పూర్వవర్తియగు వ్యాడియో, దాక్షాయణవ్యాడియో తెలియదు. లింగానుశాసనము ఉత్పలినిలో భాగము. ఇట్లగుచో నీతడు దాక్షాయణవ్యాడియే యగును.

పండితప్రవరశ్యామాచరణ కవిరత్నమహోదయుడు తాను ప్రకటించిన ముగ్ధబోధవ్యాకరణమున ఉత్పలమాలినిని ఉత్పలినిగా భావించి—

"క్రోడా దారా తథా హారా
త్రయవీతే యథాక్రమమ్,
క్రోడే దారేషు హారేచ
శబ్దాః ప్రోక్తా మనీషిభిః."

అను శ్లోకము వ్యాడిప్రణీత మన్నాడు. ఇది యుక్తము కాదు. సంక్షిప్తసారరసవతిలో ౧౨వ శతాబ్దిలోని మహారాజజుమరనంది యీశ్లోకము నుద్ధరించుచు "ఇత్యుత్పలమాలినీ"అన్నాడు. (కృత్. ౩౭౬ సూ.) ఉత్పలమాలినీకోశము శుభాంగకర్తృకము. శుభాంగుడు క్రీ. శ. ౧౦వ శతాబ్దిలో ధారానగరమున వాక్పతిముంజప్రభుసభలో నుండెడివాడు. సర్వానందుడు టీకాసర్వస్వములో ఈశ్లోకము శుభాంగుని దని స్పష్టముగా వ్రాసినాడు. శుభాంకశబ్దము శుభాంగుని నామాంతరము.

# పాలకురికి సోమనాథుడు

## శ్రీ చిలుకూరి నారాయణరావు

"విమర్శకాగ్రేసర" బండారు తమ్మయ్యగారి నెఱుగని ఆంధ్రు లుండరు. వీరు దేవరలు, వీరమాహేశ్వరాచారసంపన్నులై వీరశైవ మతమును గురించిన అభినివేశము నిండుకొన్న ఆంధ్రమున గల వీరశైవవాఙ్మయమును లోకమునకు పరిచితముగా చేయడానికి నేటికి ౩౦, ౩౫ ఏండ్లుగా పరిశ్రమ చేస్తూ, దానినిగురించిన ఎన్నో విషయములనే కాక గ్రంథములనుకూడా బయటికి తీసి, వాటి ప్రచారము కోసము బహుముఖముల కృషి చేసి, చేస్తూఉన్న పండితపరిశోధకులలో ప్రథములు, ముఖ్యులు, ప్రామాణికులు అయినవారు. వీరి నిరంతరకృషిఫలముగానే ఆంధ్రమున వీరశైవవాఙ్మయశాఖకు గొప్ప స్థానము లభించినది. ఆ వాఙ్మయప్రాముఖ్యమును వీరు బయటపెట్టకపోతే అది యే జంగపుపాటలక్రిందనో నామరూపాలు లేక పడిఉండేది.

వీరశైవవాఙ్మయస్రష్ట పాలకురికి సోమనాథుడు. ఇతడు రచించిన బసవపురాణ, పండితారాధ్యచరిత్ర, వృషాధిపశతకములు సుప్రసిద్ధములు. ఈ మూడును ఆంధ్రగ్రంథమాలలో ప్రకటితములయినవి. బసవపురాణమును శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలుగారును, పండితారాధ్యచరిత్రమును నేనును, వృషాధిపశతకమును కీ. శే. కళాప్రపూర్ణ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారును సంస్కరించి పీఠికలతో సిద్ధముచేసినాము. సోమనాథుడు రచించిన ఆంధ్రగ్రంథము లింకా ఉన్నవి. వాటి స్వరూపమును శ్రీ తమ్మయ్యగారు లోకమున కెఱుకచేస్తూనే ఉన్నారు.

పాల్కురికి సోమనాథుని జీవితవిశేషములను గురించిన్ని, ఆతడు సాధించిన కార్యములను గురించిన్ని బసవపురాణపీఠికలోను, పండితారాధ్యచరిత్ర పీఠికలోను విపులముగా నిరూపింపబడిఉన్నది. ఈ జీవితవిశేషములనుగురించిన్ని, మతాదికవిషయములను గురించిన్ని కొన్ని అభిప్రాయభేదము లుండడము సహజము; ఉండకపోవడ మసహజము. అభిప్రాయభేదము లున్నంతమాత్రముచేత ఒకరి నొకరు తక్కువచేసుకో నక్కఱలేదు. ఎవరికి తోచిన అభిప్రాయములను వారు, తమకు నిష్పక్షపాతము లని తోచినవానిని వెల్లడించడాని కధికార మున్నది. ఒకరి కిష్టములు కావన్న భీతితో స్వీయాభిప్రాయముల నణచిపెట్టడము తప్పు. అందులో ఏనాడో గతించిన ఒక వ్యక్తినిగురించి ఇటుగాని, అటుగాని ప్రత్యేకాభినివేశముతో ఇప్పటివారొకరిపైనొకరు దుముకుటకు కారణ మగపడదు.

పాల్కురికి సోమనాథుడు మహాకవి. మహాశైవభక్తుడై, వీరమాహేశ్వరవీరాచారసంపన్నుడై, జంగమగురువై, దేశాటనముచేసి, అన్యమతములను ఖండింప సమకట్టి, తన యనన్యవాచాపాండిత్యములచేత వీరశైవమతము నాంధ్రదేశమున నిండజేసి కర్ణాటకములోనికి పొంగిపోజేసిన దీక్షానిష్ఠాదిగుణగరిష్ఠుడు. అట్టివాని చరిత్రమునుగురించిన విశేషములను కొన్నిటిని గ్రంథపీఠికలలోను, పత్రికావ్యాసములలోను చదువుకొనవలసిన కష్టమును తొలగించడానికి శ్రీ తమ్మయ్యగారు "పాల్కురికి సోమనాథుడు" అనే యీ పెద్ద గ్రంథమును రచించి, ప్రకటించి ఆంధ్ర పాఠకలోకమునకు మహోపకారము చేసినారు.

---

* శివధర్మగ్రంథమాల—౧౨ బిల్వము, మఠికె నాగయ్య ధర్మనిలయము, సికింద్రాబాదు. గ్రంథకర్త: "విమర్శకాగ్రేసర" బండారు తమ్మయ్యగారు. ౩౩౫ పుటలు, వెల రు ౨-౮-౦ లు.

శ్రీ తమ్మయ్యగారి లేఖిని చాలా బలమైనది. అదియే ఆయనపాలిటి లింగపసాయితఖడ్గము. దానితో సమయము చిక్కించుకొని దెబ్బకొట్టడములోనేమి, వ్రేటులసలకుండతప్పించుకొనడములోనేమి ఈయన ఆరి తేరిన సాముకాడు. సామునేర్చినవాని కెవరితోనైనా సాముచేస్తూఉండనిదే ఉండబట్టదు. అత డెవరినైనా సరే పోరితమున కాహ్వానిస్తూఉంటాడు. ఓపికగలవా రట్టి యోధులతో వాగ్లడాయికి దిగితే లోకానికి కొంత వినోదముగా ఉండి ఊసుపోతుంది. సహజవీర శైవులయిన శ్రీ తమ్మయ్యగారి కి ధీరత్వ ముగ్గు పాలతో నలపడినదే కాని క్రొత్తది కాదు.

శైవ మనేదే ఆవేశము కలిగించేది. "ఆవ గింజంత బూది మై నలదికొనిన, వెలది, గుమ్మడి కాయంత పట్టివుట్టు"నని శ్రీనాథు డన్న మాటలో ఎంతో సత్య మున్నది. ఇది సాధారణశైవుల విభూతి ధారణముమాట. బూదికితోడు రుద్రాక్షలు (శివుని మూడోకళ్లు), దానికి తోడు లింగముకూడా ధరించిన వారి మాట వేరే చెప్పవలెనా? ఇది వీరశైవము విషయ ములోనే కాదు, ఏ మతము విషయములోనైనా తన్మతాభినివిష్టుల కందరికిన్ని ఇదే అవస్థ. ఇట్లు మతా విష్టులయినవారికి పరమతసహిష్ణుతమాట అటుంచగా, పరమతములవారు తమ మతమునుగురించి ఏపాటి ప్రస్తా వించినా సంశయమే, సందేహమే, అపనమ్మకమే. ఇత రులు తమ మతమును పొగడినాసరే అనుమానమే; ఇక విమర్శిస్తే చెప్పే దేమున్నది?

పాల్కురికి సోమనాథుడు వీరశైవుడు; ఆంధ్ర దేశములోనేమి, కర్ణాటక దేశములోనేమి అతని మూలము గానే వీరశైవము వ్యాపించినది. శ్రీ తమ్మయ్యగారు వీరశైవులు. నేను వీరశైవుడనుకాను; తుదకు శైవుడ నయినా కాను. పండితారాధ్యచరిత్రము వీరశైవ వాఙ్మయములో ఉత్తమోత్తమకావ్యము; కావ్యము మాత్రము కాదు; వీరశైవమతగ్రంథము; వీరశైవసర్వ స్వము. అట్టి గ్రంథమును నేను తప్పులులేకుండ సవరిం చడ మొకతప్పు; దానికి పీఠిక వ్రాయడము రెండోతప్పు. ఆ వ్రాయడములో అంతకుపూర్వము శ్రీ తమ్మయ్య గారు నిర్ణయించిన సిద్ధాంతములకు విలక్షణముగ, విరుద్ధముగ అభిప్రాయములను దెలుపడము తప్పాతితప్పు లలో మహాతప్పు కాదా! నా కేమి అధికార మున్నది?

నిజమే—తప్పే— ఒప్పుకొంటున్నాను. సుమారు ౫౦ తాటాకుప్రతుల నెదురుగా పెట్టుకొని పాఠభేదములను గుర్తించి, సరియైన పాఠములను నిర్ణ యించి సాధ్యమైనంతమట్టుకు నిగ్గుపట్టుగా సంతరించి, ఎన్నో వీరశైవమతగ్రంథములను డబ్బిచ్చికొని, చదివి, ఎన్నో చరిత్రగ్రంథములను, శాసనములను పరిశోధించి సత్యచరిత్రముకోసము రాత్రింబవళ్ళు శ్రమించి ౩౫౦ పుటల పీఠికను, ౨౦౦ పుటల అకారాదిపదసూచికలను ఘటించి, ప్రతిఫలాపేక్షారహితుడనై చేసిన పనిచేత దృష్టిమాంద్యమును సంపాదించుకొన్న నాది తప్పుకాక మ రేమవుతుంది? వీరశైవమతము శ్రుతి, స్మృతి, పురా ణేతిహాససమ్మతము కాదనీ, అది హిందూమతము కాదనీ ఒకానొక వీరశైవనిరాచారిమతము ధనకాంక్షా ప్రేరితమై కోర్టు కెక్కి తెలివితక్కువగా సంచరిస్తున్న ప్పుడు నే నడ్డుపడి శతాధికగ్రంథపరిశోధనము చేసి వీరశైవమతవైదికత్వమును ౫౦౦ అరటావుపుటలలో ఇంగ్లీషున వ్రాసి కోర్టుఎదుట పెట్టి, బోనులోని కెక్కి సాక్ష్య మిచ్చి వీరశైవవైదికత్వమును చిరస్థాయిగా నిల బెట్ట తోడ్పడడము తప్పుకాదా!

అవును—నేను వీరశైవుడను కాను, నిజమే. కాని, వీరశైవలోకము నేను వీరశైవుడ నని భ్రమించి, అట్లే సంబోధిస్తూ లేఖలు వ్రాయడముకాక, వారి మతసభలలో అధ్యక్షత వహించవలసినదనీ, ఉప న్యసించవలసినదనీ పిలువడాని కాస్పదము కలిగే అంతటి వీరశైవత్వము నారోపించుకొనడము తప్పు కాదా?—తప్పే.

కాని, ఇందులో వింత ఏమిటంటే: నే నేకోర్టు ఎదుట నిలబడి వీరశైవమతము శ్రుతిస్మృతిసమ్మతమని సాక్ష్యమిచ్చినానో ఆ కేసులోనే నాకు ప్రతిపక్షిగా నిలబడి, తాను వీరశైవుడయి, తన వీరశైవము శ్రుతి, స్మృతి, పురాణేతిహాసవిరుద్ధ మనిన్ని, అది ఆర్యసమ్మ తము కాదనిన్ని వ్రాతమూలకముగా వాఙ్మూలము

నివ్వడమే కాక, ప్రమాణపూర్వకముగా, శివునితోడుగా నోటిసాక్ష్యమునుకూడా ఇచ్చిన టి. హెచ్. ఎమ్. సదాశివయ్య ఎమ్. ఏ., బి. ఎల్. గారిచేత తమ గ్రంథమునకు శ్రీ తమ్మయ్యగారు Foreword (తొలిపలుకు) వ్రాయించుకొనడము. శ్రీ సదాశివయ్యగారు సబుజడ్జిగారు. ఎవ రేమి చేయగలరు?

ఇంతకంటె వింత ఏమి టంటే, తాము తమ వీరశైవమతోత్కృష్టప్రకటనమునకుగాని, వీరశైవ వాఙ్మయప్రాశస్త్యప్రచారమునకుగాని ఎట్టి కృషినీ చేయకపోయినా వారి వీరశైవ వాఙ్మయములో శ్రేష్ఠగ్రంథము లని ప్రసిద్ధికెక్కిన బసవపురాణమును శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారున్ను, పండితారాధ్యచరిత్రమును నేనున్ను, శివతత్త్వసారమును కొమర్రాజు లక్ష్మణరావుగారున్ను, వృషాధిపశతకమును కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారున్ను పరిశ్రమించి ప్రచారమునకు తేగా ఆ కృషినిగురించి ఒక్క మంచి మాట అయినా తమ ౩౩౫ పుటల గ్రంథములో పొందింపలేకపోవడము. పోనీ, తక్కిన ముగ్గురమున్ను భవుల మయితే అయినాముగాని, నాగేశ్వరరావుపంతులుగారు కూడా భవులేనా అట్టి ఉపేక్షాభావముతో చూడబడడానికి? అబ్బే! ఇతరులు తమకోసము చేసిన పనిని గుర్తింపనీయని మతావేశము నిండుకొన్న వారివల్లనే ఇకముం దిట్టి జోక్యములోనికి పోగూడ దని విరక్తి పుట్టిస్తుంది. పండితారాధ్యచరిత్రమువలెనే పిడుపర్తివారి ప్రభులింగలీలలనుకూడా అనేకతాళపత్రప్రతులు పరిశోధించి సరియైన పాఠములను నిర్ణయించి పీఠికతో ముద్రణమునకు సిద్ధముచేసిఉంచినాను. తమ్మయ్యగారి ఈ గ్రంథమును చదివినతరువాత "వృథా! వృథా! ప్రకటించకూడ" దనిపిస్తున్నది. కాని, ఇంతమాత్రముచేతనే విరక్తి పుట్టగలవాడను కాను. భ్రమరకీటన్యాయముచేత నేనున్ను జంగముడనై పోవలసి వస్తుందేమో!

తమ్మయ్యగారి పుస్తకములో సుమారు సగము భాగము 'విమర్శ'తో నిండిఉన్నది. 'విమర్శకాగ్రేసర' బిరుదాంచితులగువారి గ్రంథములో ఆపాటి విమర్శ లేకుంటే అది గ్రంథమే కాకుండేది. ఆ విమర్శకు వేటూరివారీసారి చాలవరకు గురితప్పినారు. అమ్మక చిక్కిన మేకను నేను గురి అయినాను. నాకు విమర్శ అంటే భయమని కాదు. సరియైన విమర్శ అయితే నాఊహ తప్పయినప్పుడు తప్పక ఒప్పుకొంటాను. కాని, మీదికి దూకుడుగా వస్తే కొంచె మాత్మరక్షణము చేసుకోవలసివస్తుంది. పండితారాధ్యచరిత్రపీఠికలో తమ్మయ్యగారి అభిప్రాయము ప్రకారము నేను చేసిన నేరములు ముఖ్యముగా మూడు. అవి (౧) సోమనాథుని జన్మస్థానము మైసూరుసంస్థానము, తుమ్కూరుజిల్లా, తిప్పటూరు తాలూకాలోని పాలకురికి అనే గ్రామము అనడము; (౨) సోమనాథుడు వీరశైవబ్రాహ్మణుడుగా జన్మించి వర్ణాశ్రమాతీతుడైన జంగముడుగా వీరశైవమతప్రచారము చేసినా డనడము; (౩) అతడు కాకతీయ మొదటి ప్రతాపరుద్రుని కాలములో లేడనిన్ని, గణపతిదేవ, రుద్రాంబా, ద్వితీయప్రతాపరుద్రుల కాలములో ఉన్నవాడనిన్ని అనడము. —ఈవిషయములనుగురించే కాక ఇంకా కొన్ని స్వల్పవిషయములనుగురించి కూడా నామీద నేరము లున్నవి. వీటి కన్నిటికీ సమాధానమును సంగ్రహముగా చెప్పుకొంటాను. కాని, శ్రీ తమ్మయ్యగారికిన్ని, పాఠకలోకమునకున్ని చిన్న మనవిమాత్రము ముందుగా చేసుకొంటున్నాను. తమ్మయ్యగా రన్నట్లు (పుటలు ౬౯, ౭౦) నాహృదయమును అభిమానమాత్సర్యము లావరింపలేదు. నేను దురభిమానమునే ప్రధానముచేసికొని సత్యదూరములగు నభిప్రాయములను వెలువరించడము లేదు. నేను వీరశైవుడను కాను. కాబట్టి అభిమానముగాని, దురభిమానముగాని, మాత్సర్యముగాని ఉండ నవకాశమే లేదుగదా. వీరశైవము 'వీరుల' శైవ మని నాకు తెలియకపోలేదు. ఆ వీరత్వము బౌద్ధజైనములను భరతఖండములో నేమిచేసినదో నాకు తెలియకపోలేదు. అందుచేతనే దానినిగురించి వ్రాయవలసినప్పుడు చాలా జాగ్రత్తగా, సమస్త విషయములను పరిశీలించనిదే, స్పష్టముచేసుకొననిదే నే నొక్క వాక్యమును వ్రాయ సాహసించలేదు. నాకు తెలియని దానిని తెలియ దని చెప్పినాను. నాకు సందేహముగా

తోచినదానిని సందేహముగానే నిరూపించినాను. నాకు సత్యమని తోచినదానిని తగినకారణములను నిరూపించి నిర్భయముగా ప్రకటించినాను. అభిమాన, దురభిమాన, మాత్సర్యాదులు తమ్మయ్యగారి కుంటే ఉండవచ్చునుగాని నా కుండడాని కావశ్యకత లేనేలేదు.

ఇంతకూ ఏమి మహావిషయములుగనుక అభిమానమాత్సర్యములు ప్రకోపించడానికి? పాల్కురికి సోమనాథుడు మైసూరుప్రాంతములో పుట్టితే నా కేమి? ఓరుగల్లుప్రాంతములో పుట్టితే నా కేమి? క్రీ. శ. ౧౧౯౫లో ఉంటే నా కేమి? ౧౩౦౦ సం.ర ప్రాంతములో ఉంటే నా కేమి? అతని కులగోత్రములుకూడా నా కంతటి ముఖ్యములైనవి కావు. పండితారాధ్యచరిత్రమును దానిలో విస్తరింపబడిన మతముకోసము సరిదిద్ది ప్రకటించి, దానికి పీఠిక వ్రాయలేదు. దానిలోని కావ్యత్వమును నే ననుభవించి ఆంధ్రులచేత అనుభవింపజేతామనే ఉద్దేశము తప్ప నాకు మరొక ఉద్దేశము లేదు. అయినా, నేను పైవిషయములనుగురించి తెలిపిన అభిప్రాయములను శ్రీ తమ్మయ్యగారు అనవసరతీవ్రత నుపయోగించి "శోచనీయము, శోచనీయము" అని పదేపదే వక్కాణించినారు కాబట్టి వారి విమర్శకు ప్రతివిమర్శగా కాకుండా సవినయనివేదనముగా సంగ్రహించి చెప్పకొంటున్నాను.

## (౧) పా ల కు రి కి

లోకములో ఉన్న 'పాలకురికి' ఒక్కటే ఉన్నది. అది మైసూరు సంస్థానము, తుమ్కూరు జిల్లా, తిప్పటూరుతాలూకాలో ఉన్నది. దానికి ప్రాచీనకన్నడశాసనములలో పాలకుఱికె అనిన్ని, హాల్కురికె అని తరువాతిశాసనములలోను పే రున్నది. అది కుగ్రామము కాదు. తాలూకా హెడ్‌క్వార్టర్సు కాకపోయినా కొన్ని ప్రభుత్వ కార్యాలయా లున్నవి. ఆ గ్రామములో తెనుగువా రనాదిగా ఉన్నారు. ఇటీవల రాజభాష కన్నడము కావడము చేతను, తెనుగుబడుల నెత్తివేసి కన్నడబడులను మాత్రమే ఉంచడముచేతను కన్నడమున కెక్కువ ప్రచారము కలిగినా ముఖ్యవృత్తుల నవలంబించి ప్రాతకాపులై అచ్చట నున్నవారు తెనుగువారే. వీరి తెనుగుభాష గోదావరిజిల్లావారికి కొంచెము ఏసగా కనిపించవచ్చును. ఒక మండలపు వ్యవహారభాష అప్రక్కమండలమువారికే ఏసగా కనబడేటప్పుడు, దూరముగా ఉన్నవారికి కనబడడము వింతకాదు. కాని, అది తెనుగుభాషే. అందుచేతనే తెనుగుభాష ఇంకా మైసూరురాజ్యములో మిగిలిఉండగానే దానిలోని తుమ్కూరు, బెంగుళూరు, కోలారు, చిత్రదుర్గము జిల్లాల నాంధ్రదేశములో వెంటనే కలిపివేయవలె నని ఘోషిస్తున్నాను. పాలకురికిలోనే కాక తిప్పటూరు తాలూకా అంతటా తెనుగు ప్రచారములో ఉన్నది. ఇక్కడి జనులు సాధారణముగా లింగాయతులు, వీరశైవులు. సోమనాథుని జన్మస్థానములో వీరశైవము ప్రబలమె మొక వింత కాదు. ఈ పాలకురికిలో జన్మించి పరదేశములకు పోవడముచేతనే సోమనాథునికి పాలకురికి సోమనాథు డనే పేరు కలిగినది. కాకుంటే అట్టి యింటిపేరే కలుగదు. ఈ పాలకురికి తన జన్మస్థానముకాబట్టే సోమనాథుడు తన వృద్ధాప్యములో అచటికి చేర తొందరపడి ఓరుగల్లు, శ్రీశైలము మొదలయిన ప్రాంతములను విడిచిపెట్టినాడు. కాకతీయరాజ్యము అచిరకాలములో తురుష్కాక్రాంతము కాబోతుం దని తెలుసుకొని తన నిష్ఠకు భంగము కలుగకుండా జన్మస్థానమును చేరుకోవలెనని వృద్ధుడయిన సోమనాథునికి తొందర పుట్టడము సహజమే. అతడు తిరిగి తన పుట్టినఊరయిన పాలకురికికి చేరుకొన్నాడో లేదో తెలియదుగాని, దానికి దగ్గరగానే ఉన్న 'కల్యా' (కల్కె ?) ములో సమాధి అగుటనుగురించి సాక్ష్య ముండనేఉన్నది. తమ్మయ్యగా రచ్చటి సోమనాథుని సమాధికి తీసిన ఛాయాపటమునుగూడా అచ్చొత్తించినారు. కాబట్టి మైసూరుసీమలోని పాలకురికియే సోమనాథుని జన్మస్థాన మనడానికి సందేహము లేదు.

ఓరుగల్లుప్రాంతములో 'పాలకుర్తి' అనే గ్రామమున్నది. అదే పాలకురికి అని నమ్మవలసిన దని శ్రీ

తమ్మయ్యగా రంటున్నారు. 'క్రొత్త ఒక వింత, ప్రాత ఒక రోత' అని వారు నామీదికి ప్రయోగించిన సామెతనే వారిమీది కిప్పుడు నేను ప్రయోగింపవలసి వచ్చినందుకు విచారిస్తున్నాను. చిదిరామఠము వీరభద్ర శర్మగారితోబాటు తమ్మయ్యగారు పాలకుర్తియే పాలకురికి అని చెప్పేవరకున్నూ ఎవ్వరున్నూ అట్టి అనుమానము పడలేదు. వీరేశలింగముగారు సోమనాథుడోరుగల్లుప్రాంతమువాడని ధ్వనింపజేస్తే, ప్రభాకర శాస్త్రిగా రెవడో అనామధేయుడు పాలకురికి ఓరుగల్లుప్రాంతములో ఉన్నదని చెప్పినదానినిబట్టి ఉన్నదట అని వ్రాస్తే, దానినిబట్టి వీరభద్రశర్మగారు పాలకుర్తిని పట్టుకొని పాలకురికి అని చెప్పితే, చాంగు భళా! అని తమ్మయ్యగారు దాని నామోదిస్తే, పోతన్నతోబాటు మరొక్క ప్రసిద్ధాంధ్రకవి అయినా నైజాములోనికి రానీ అని శేషాద్రిరమణకవులు వెనక తాళము వేస్తే, దానిని స్థిరపరుచుకొని అచ్చట సోమనాథాలయములోని సోమనాథలింగము పాలకురికి సోమనాథుని సమాధిపై నిలుపబడిన దని చిన్నకథ లేవదీస్తే, పాలకుర్తియే పాలకురికి అని లోకము నమ్మే స్థితిలోనికి వస్తూ ఆ సోమనాథాలయమును, మఠమును బాగుచేయించడానికి ప్రయత్నాలు జరుగుతూఉంటే, ఇంతలో ఆ పాలకుర్తి పాలకురికి కాదు, పాలకురికి మైసూరురాజ్యము తుమ్కూరుజిల్లాలో ఉన్నది అని రుజువులతో చూపేసరికి ఎంతమందికో ఆశాభంగము కలిగిఉంటుంది. దానికి నే నేమిచేయగలను? 'పాలకుర్తియే 'పాలకురికి' అని అష్టోత్తరశతవారములు జపముచేసినా కావడానికి సాధ్యమా? . పాలకురికి పాలకురికే, పాలకుర్తి పాలకుర్తే. పాలకుర్తి అనేది పాలకుర్రు అనే పదానికి ఔపవిభక్తికసప్తమ్యేకవచన రూపము. పాలకురికి కేవలప్రథమైకవచనరూపము. పాలకుర్తికి పాలకురికి అనే వ్యవహార మున్నట్టు ఇంత ఆర్భాటము చేసి 'శోచనీయము' అనకపోతే ఒక్క, ఒకటేఒక్క ప్రమాణము చూపిస్తే ఎంత బాగుండేది! తమ్మయ్యగా రంతటి ఆవేశములో అన్ని పుటలు నింపడము వ్యర్థమేకదా! సోమేశ్వరాలయమునకు దగ్గరగా ఉన్నదికదా అని దానికి సోమనాథలింగ మని పేరు పెట్టి, సోమనాథలింగము పాల్కురికి సోమనాథుని పేరనే, అతని సమాధిమీదనే నిలుపబడినదని ఒక కథను లేవదీస్తేమాత్రము పాలకుర్తి పాలకురికి అవుతుందా?

సోమనాథనామము కనబడినచోట్లనెల్ల పాల్కురికి సోమనాథమయము చేయడమేనా? ఇంకా నయము — గజనీమహమ్మదు పగులగొట్టిన సోమనాథలింగముకూడా పాల్కురికి సోమనాథుని పేర వెలసినదే అనలేదు? తమ్మయ్యగారి నీ సందర్భములో అడుగవలసిన ప్రశ్న ఒకటి ఉన్నది: పాల్కురికి సోమనాథుని సమాధి శివగంగకు సమీపమున 'కల్యె' (కల్కె) ములో ఉన్నదని తెలియగానే పాలకుర్తి నుంచి పాలకురికి సోమనాథుని సమాధి పరారీఅయి, ఆ సమాధిస్థానములో ఒక తొమ్మిదిఅంగుళముల ఎత్తుగల 'గద్దె' వెంటనే తయారయినదేల? దానిమీద పాలకురికిసోమనాథుడు తపస్సుచేసుకొనడానికా? గ్రంథములో ౧౯ పుటలో సమాధిగా వర్ణింపబడినది ౩౨౪ పుట వ్రాయనారంభించేసరికి. అకస్మాత్తుగా గద్దెగా ఎట్లు మారినది? ఈమధ్యకాలములో పాల్కురికిసోమనాథుని మాహాత్మ్య మేమయిన వెలసినదా! ఇట్టి కల్పనములను చేసి ఏమి సాధించినట్లు?

## (౨) సహజవీరశైవత్వము

తమ్మయ్యగారు సోమనాథాదులను సహజవీరశైవు లనమంటారు. సహజవీరశైవు లంటే ఏమిటో? ఈపదమును తమ్మయ్యగారు సృష్టిచేసినట్టు కనబడుతుంది. తమతోబుట్టిన వీరశైవులు కలవారు, వీరశైవులు తమకు తోబుట్టువులుగా గలవారు; తమతోడ బుట్టిన వీరశైవము గలవారు; పుట్టుకతోడనే వీరశైవులు; వీరశైవులైన తలిదండ్రులకు పుట్టినవారు; తమలోపలనుంచి పుట్టుకొనివచ్చిన వీరశైవము గలవారు; తమకు పుట్టిన వీరశైవులు గలవారు; తమకు తాము పుట్టినవీరశైవులు — ఇటువంటి అర్థములను ఇంకా చెప్పవచ్చు నీ సమస్తపదానికి. ఈ అర్థముల ప్రకారము వీరశైవులందరున్నూ సహజవీరశైవులే అవుతారు. (తమకు తాము పుట్టినవా రంటేనే అర్థము సరిపోతుం.) ఇక అసహజవీరశైవు లెవరైనా ఉంటా

రని తమ్మయ్యగారి అభిప్రాయమా? ఉంటే, వారెవరు? ఇదేమిటో అగమ్యగోచరముగా ఉన్నది. సహజవీరశైవు లంటే అచ్చమైన వీరశైవు లనిన్ని, అచ్చమైన వీరశైవులు కాని, అవాంతరముగా వీరశైవ రక్షను పుచ్చుకొన్న, ఇతర మతములను విడిచి లింగదీక్షను పుచ్చుకొన్న వీరశైవులు ఆరాధ్యబ్రాహ్మణుల వంటివారుకూడా ఉంటారనిన్నీ తమ్మయ్యగారి అభిప్రాయమేమో! ఆ అర్థమేమిటో స్పష్టముగా బయటికి చెప్పివేస్తే ఎంత బాగుంటేది!

పాల్కురికి సహజవీరశైవుడే; అసహజవీరశైవుడు కాడు. ఇక తమ్మయ్యగారు సంతోషించవచ్చు. అత డసహజవీరశైవు డని ఎవరన్నారు గనుక ఇంత ఆర్భాటము చేయడానికి? అంతటి వీరశైవుడు అతడే అనీ, అతనిమూలముగానే ఆంధ్రకర్ణాటదేశములలో వీరశైవము ప్రబలినదనీ నేను చెప్పినానుగదా! ఇంక ఈవిషయములో నాతో తమ్మయ్యగారికి విప్రతిపత్తి? వీరశైవుడు కానివాడు వీరశైవమునుగురించి వ్రాయడాని కధికార మేముంది అనే అభిప్రాయమా? తమ్మయ్యగారు వీరశైవమును గుత్తగొనలేదుగదా!

అదేమో కొందరు తమ మతమును గురించి యితరులు తలపెట్టితే చాలును ఉలుకుపడుతారు. నీడను చూచుకొని భయపడుతారు. తమ మతమునకు న్యూనత కలుగుతుందేమో అని దిగులుపడుతారు. లేనిపోని అనుమానాలు కల్పించుకొని, ఆక్షేపణల నాకాంక్షించుకొని, ఎక్కడనూ లేని డిబిర్ధుల నెదురుగా నిలబెట్టుకొని ఆ కల్పితపురుషులతో కొట్లాటకు దిగుతారు. పాల్కురికి సోమనాథుడు తన తండ్రి విష్ణురామిదేవు డనిన్ని, తల్లి శ్రియాదేవి అనిన్ని చెప్పుకొంటే, ఎవరయినా వైష్ణవసంప్రదాయబోధకమైన పేళ్లుగల వారికి సోమనాథుడు పుట్టినా డని అంటారేమో అని ఆలోచించుకొని, దానిని సమర్థించుకొనడానికి విష్ణువు శివునికి కింకరుడు కొట్టి అట్టే భయము లేదనీ, విష్ణురామిదేవుడు, శ్రీయాదేవి అనేవారు సోమనాథు నాదరించి పెంచినవారుగాని అసలు తలిదండ్రులుకారనిన్ని ఏమేమో చెప్పుకొని తంటాలు పడడ మెందుకు? శివద్విజులు, శివబ్రాహ్మణులు అనే పేళ్లతో వ్యవహరింపబడే కొందరి పేళ్లు శాసనములలోను, వాఙ్మయములోను కనబడుతున్నవి అని నేను వ్రాసేటప్పటికి ఏమేమో ఎగబారించుకొని, కొట్ట వచ్చినట్టు మీదికి దుముకుతూ వచ్చి, నారాయణరావుగారు శంతలు అనే అర్థము వచ్చేటట్టు ఏమేమో పుటలు నింపివేస్తే తన్ జ్ఞ లేమంటారు?

తమ్మయ్యగారు స్మార్తబ్రాహ్మణులనీ, స్మార్తులు కాని బ్రాహ్మణులనీ ఉంటారని చెప్పినారు. బ్రాహ్మణుల కందరికీ స్మృతులు ప్రమాణములే కదా! స్మృతి సంప్రదాయానుసారముగ నేకదా తామందరున్ను బ్రాహ్మణశబ్దవాచ్యు లయినారు. అందుచేత బ్రాహ్మణు లెవ్వరయినా స్మార్తులే అవుతారుగదా! అయితే స్మార్త, స్మార్తేతరసిద్ధాంతమును తమ్మయ్యగారెందుకు లేవదీయవలెను? స్మృతులప్రకారము బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రవర్ణము లున్నవి. (నాస్తి పంచమః—కొందరి ప్రకారము.) ఇట్లేర్పడిన బ్రాహ్మణవర్ణమువారిలో శైవబ్రాహ్మణులు, శైవేతర బ్రాహ్మణులు ఉన్నారు. శైవబ్రాహ్మణులలో లింగధారి బ్రాహ్మణులు, లింగధారులుకాని బ్రాహ్మణులు ఉన్నారు. లింగధారణము ప్రత్యేకముగా శైవబ్రాహ్మణులలోనే కాక ఇతరవర్ణములవారయిన క్షత్రియ, వైశ్య, శూద్రాదులలోకూడా ఉన్నది. లింగధారులలో నాలుగువర్ణములవారున్ను ఉన్నారు. గృహస్థులయిన లింగధారి బ్రాహ్మణులలో హారీతసభారద్వాజాది ఋషిగోత్రము లున్నవి. ఇట్టి గోత్రములుకాక వీర, వృష, భృంగి, నంది, స్కంద అనే శివప్రమథగణ గోత్రములుకూడా లింగధారులలో ప్రచారములో ఉన్నవి. జంగమగురువులలోమాత్రమే ఈ పంచగోత్రములును ఉన్నట్టు కనబడుతుంది. సాధారణ వీరశైవులుకూడా తమకు శివదీక్ష నిచ్చిన గురువుగోత్రమును నీ యైదింటిలో నొకదానిని స్వీకరింపవచ్చును. బ్రాహ్మణేతరులలో ఈ సంప్రదాయము ప్రబలినట్లున్నది. లింగదీక్షను పొంది లింగధారణ ము కాగానే వ్యక్తి చరలింగమౌతాడని వీరశైవసిద్ధాంతము. లింగధారణము స్త్రీపురుషుల కిద్దరికిన్ని వీరశైవులలో విహితమే. ఈ లింగధారణము గర్భాష్టమములో మాతృగర్భమునకే చేయ

వచ్చును. లేదా కొందరు పుట్టగానే చేస్తారు. కొందరు నామకరణదినమున చేస్తారు. కొందరు ఎనిమిదోఏట చేస్తారు. బ్రాహ్మణులయితే ఉపనయనమున యజ్ఞోప వీతధారణముతోబాటు లింగధారణముకూడా చేస్తారు. కొందరు లింగసూత్రమే యజ్ఞోపవీతసూత్ర మంటారు. కొందరు లింగదీక్షయే గాయత్రీదీక్ష అంటారు. లింగ ధారిబ్రాహ్మణులకు శివపరమైన అర్థముతో గూడిన గాయత్రీఉపదేశ మున్నది. సిద్ధాంతముప్రకారము లింగధారణము చేసినవారందరూ చరలింగరూపులే అయినా, 'చర' అనే పదానికి 'జంగమ' అనే అర్థ మున్నా వ్యవహారములో లింగధారణము చేసినవా రంద రున్ను జంగమశబ్దవాచ్యులుగా ఇప్పుడు లేరు. ఆరాధ్య బ్రాహ్మణులు లింగధారులయినా వారిని జంగములంటే ఒప్పుకోరు. ఇం తెందుకు? తాము లింగధారులయినా, లింగధారిలింగాయతపదముల కర్థ మించుమించొక్కటే అయినా ఆరాధ్యబ్రాహ్మణులను లింగాయతు లని పిలిస్తే కొట్టవస్తారు. ఎందుచేతనంటే, వ్యుత్పత్తి ప్రకారము శబ్దముల కేర్పడే అర్థము నానాటికీ మారి పోయి ఒకానొక విశిష్టమైన అర్థము కలుగుతూ ఉంటుంది. జంగమశబ్ద మట్టిది. స్థిరము కానిది చరము; స్థావరము కానిది జంగమము. వ్యుత్పత్తినిబట్టిమాత్రమే ఆలోచిస్తే మనుష్యులేకాక పశు, పక్షి, కీటాదులన్నీ జంగమములే. సైకిళ్లు, మోటారులు, రైలుబళ్లు, ఓడలు, విమానాలు, అన్నీ జంగమములే. కాని, జంగమ శబ్దము అతివిశిష్టమైన అర్థములో మతవాఙ్మయములోను, మతవ్యవహారములోను స్థిరపడినది. లింగధారులందరున్ను జంగములు కారు. వారిలో కొందరుమాత్రము జంగ ములు. వీరశైవులలో సామాన్యవీరశైవులు, విశేషవీర శైవులు, నిరాచారులు అని మూడుతెగలవా రున్నారు. వీరందరున్ను లింగధారులే. పుట్టుకతో వీరశైవులై సాధారణగృహస్థులుగ లోకయాత్రను గడపుకొనేవారు సామాన్యవీరశైవులు. వీరిలో షట్స్థలసిద్ధాంతము ననుసరించి భక్త, మాహేశ్వర, ప్రసాద, ప్రాణలింగి, శరణ, ఐక్యస్థలములను సాధించిన సాధకుల అంతర ములనుబట్టి విశేషవీరశైవు లేర్పడుతారు. నిరాచారు లనేవారు కేవలవిరక్తులు, యత్యాశ్రమమును దాటి అత్యాశ్రమమును పొందినవారు.

ఇది యిట్లుండగా విశేషవీరశైవులలో కొందరు సామాన్యవీరశైవులకు గురువులయి వారికి లింగదీక్ష నిస్తూ జంగము లనే ప్రత్యేకనామముతో వ్యవహరి స్తున్నారు. సామాన్యవీరశైవులకున్ను, వీరికిన్ని వ్యావ హారికముగ చాలా భేద మున్నది. అసలు వీరి వేషమే వేరు. వీరి సంప్రదాయమే వేరు. జంగముల వేష మును, సోమనాథు డెట్లు వర్ణించినాడో పండితా రాధ్యచరిత్రమును (పుటలు ౩౦౭-౩౦౮) చదివిన తమ్మయ్యగా రెరుంగనిది కాదు.

"చందనకావులు సరిసాటికావు
లందంబులగు కఱకంచుకావులును
పలిపొత్తిపచ్చడంబులను గోపీన
ములు, మీద గూడికట్టులు కానుపింప—"

ఇట్లే వారి సంబువులు, గొడుగులు, పావలు, పేరెములు, కళుకులు, కుప్పసములు, పట్టుత్రాళ్లు, త్రతపట్టువస్త్రములు, తొంగళ్లు, వీణెలు, పటికపు సరములు, కావిపచ్చడములు, కావిదుప్పటులు, కావు మంజిళ్లు, బూరవడములు, కలశములు, కంచుగుబ్బలు, వివిధములయిన మకుటములు, తప్పరములు, కుండల ములు, బెత్తములు, సైరణగోలలు, గొడుగులు మొద లయిన చిహ్నములతో మకుటవర్ధనజంగమములున్ను, ఇతరలక్షణములు గల జంగములున్ను కలిసి ఉభయ జంగమకోటులు శ్రీశైలయాత్రకు పోయిన పరుసలో ఉన్నారుకదా. అట్లే 'రారోరి బసుత! తేరా లంజ కనుచు, బసవన్నకరుణారా-బసుత నీకనుచు' విలాసాతిశయత మించే మిండజంగమములుకూడా ఉన్నారు. వీరందరున్ను సామాన్యవీరశైవకోట్లకంటె విశిష్టులేకదా. ఈ విశిష్టజంగములేకాక యింకా విశిష్టులయిన వృద్ధలింగితపోధనులు, విరక్తులు, శివ యోగులు మొదలయినవారినికూడా సోమనాథుడు వర్ణించినాడు. వీరినందరినీ సామాన్యవీరశైవులతో, లింగధారిమాత్రులతో చేర్చి వేయవీలులేదుగదా.

అట్లే సోమనాథుడున్ను ఒక విశిష్టవీరశైవుడు. విశిష్టజంగముడు, విరక్తుడు, సంసారహేయస్థలమును సాధించి, సంసారవర్జితుడయి, లోకసంగ్రహార్థము దేశాటనము చేసిన జంగమోత్తముడు. అతనిని "సహజ వీరశైవు"లతో సాటిగ ఒక సామాన్యునిగ తలంచ వచ్చునా? జంగముల ప్రత్యేకవేషము, ప్రత్యేక వ్యవహారము లోకమునకంతటికీ విదితమే. దానిని కాదని వీరశైవులందరున్ను జంగములే అని యిప్పుడు తమ్మయ్యగారు చెప్పవస్తే ఎట్లు నమ్మగలము? జంగములలోనే వీర, భృంగి, నంది, వృష, స్కంద గోత్రము లున్నవి. సాధారణవీరశైవులలో అవి ఉండడానికి కారణము వారు తమ గురువులయిన జంగముల గోత్రముల నవలంబించడమే అని నొక్కి వక్కాణింప వలెను. ఈ వీరాదిగోత్రపంచకసంప్రదాయ మెప్పటి నుంచి వస్తున్నదో తెలియదని నేను వ్రాసినంత మాత్రమున బుస్సుమని తమ్మయ్యగా రంత మీదికి లేచినారు. అవి అనాదిగా ఉన్నవని వారి అభిప్రాయము. ఉంటే ఉండునుగాక, ప్రమాణముమాత్రము కనబడ దని నేను చెప్పినానే కాని మరేమీ చేయలేదే? దాని కింత ఆగ్రహ మెందుకు? ప్రమాణ ముంటే చూపితే తీరిపోయేదే! సోమనాథుడు ఒకసారి భృంగిరిటి గోత్రుడ ననీ, ఒకసారి బసవగోత్రుడ ననీ చెప్పుకొన్నాడే? మరి వృషగోత్రమునకున్ను, బసవగోత్రమునకున్ను భేద మున్నదా యేమి? వృషగోత్రము బసవగోత్రము కాదా? సోమనాథుడు రెండు గోత్రాలవా డెట్లవుతాడు? సూరార్యునికివలె ఆయనకున్ను ఒక ఋషిగోత్ర ముండి, శివభక్తిపారవశ్యము చేత ప్రమథగణములయిన భృంగి, వృషులను తనకు గోత్రకర్తలుగా చెప్పుకొన్నా డనవచ్చునుగదా! ఉన్న గొడవలు చాలక నా కెందుకీ క్రొత్తగొడవ? జంగములు సామాన్యవీరశైవులకు భిన్ను లన్నమాట సత్యము. వీరి ఛాయాచిత్రములను **Thurston: Castes and Tribes of Southern India**లో 'లింగాయితు' అనేపదముక్రింద చూచుకోవచ్చును.

నేను శివద్విజ శివబ్రాహ్మణప్రస్తావనను ప్రాసంగికముగా తెచ్చేసరికి ఎందుకో అకారణముగా తమ్మయ్యగారు నామీద రేగిపోయినారు. రేగితే భయము లేదుగాని నన్ను తృతీయపంథీయునిగా వర్ణించినవారు చతుర్థపంథ ననుసరించి అపూర్వశ్రుతమైన, ఎన్ని ఉపాయములచేతనైన సమర్థింపరాని ఒక వింతలోవింతవాదము లేవదీసినారు. శివద్విజులు, శివబ్రాహ్మణులు, హరద్విజులు అనేవా రొకరట; శైవబ్రాహ్మణు లనేవారు వేరొకరట. శివాలయములలోని స్థావరలింగార్చనము చేస్తూ లింగధారణముచేయని తమ్మళ్ళ, నంబి మొదలయినవారు శివద్విజులు, హరద్విజులు, శివబ్రాహ్మణులునట. శివాలయములలో అర్చకులు కాని లింగధారులు శైవబ్రాహ్మణు లట. ఇట్లు చెప్పడానికి తమ్మయ్యగారి విపరీతపాండిత్యమే ఆధారముగాని మరి యెట్టి ప్రమాణమున్ను లేదు.

**The Sivabrahmins of the temple agreed to provide for offerings in the shrine (M. E .R. 415 of 1909)** అనేదానిలోని శివబ్రాహ్మణు లంటే ఆలయములోని అర్చకులని అర్థము చెప్పవచ్చునా? శివబ్రాహ్మణులు ఇస్తే పూజారులు పూజచేస్తారుగాని, అచ్చటి శివబ్రాహ్మణులే పూజారులని చెప్పకూడదు. అట్లే **M E. R 513 of 1911 "There being some of the Sivadvija community at the place three priests were appointed** అంటే శివద్విజులే అర్చకులు అని ఎట్లు చెప్పగలము? పెరియనంగ శివద్విజురా లని ఉదాహరించినారే, ఆమె శివాలయములో అర్చకురాలా? స్త్రీలకర్చకాధికార మున్నదా? అరుపత్తుమూవురలో ఒకడయిన జడయారి శివాలయములలోని స్థావరలింగార్చకుడయిన శివద్విజు డనడము తమ్మయ్యగారి ప్రతిపాదనకే మూలచ్ఛేదము చేస్తున్నదిగదా! కాళహస్తిమాహాత్మ్యమునుంచి తమ్మయ్యగా రుదాహరించిన సీసపద్యములోని శివబ్రాహ్మణోత్తముండు లింగధారియే కదా. అతడు శివచిహ్నగోచరాంకుడని ఆ పద్యములోనే ఉన్నదిగదా. శివచిహ్నమంటే శివలింగమే కాదా! మరేమయినానా? శివబ్రాహ్మణుడు తమ్మయ్యగారి మాట ననుసరించి లింగధారి కాకపోవలెనే! ఈ శివ బ్రాహ్మణు డేకదా తరువాతి పద్యము

లోని హారద్విజుడు ? తమ్మయ్యగారి ప్రతిపాదనమే సరి అయితే జంగములందరున్ను శైవ బ్రాహ్మణులే కావలెను. ఆరాధ్యబ్రాహ్మణు లందరున్ను జంగములే కావలెను. ఇష్టలింగార్చకులు స్థాపితలింగార్చకులు కాకూడదు. ఇష్టలింగధారు లందరున్ను ఇష్టలింగార్చనము మాత్రమే చేయవలెను; స్థాపితలింగార్చనము చేయకూడదు. పైవాటిలో అన్నీ వ్యవహారమునకు విరుద్ధములే. ఈనాడు తమ్మయ్యగారు ప్రతిపాదించినారని లోకవ్యవహారము మారనేరదు. బెలిదేవి వేమనారాధ్యుడు లింగధారి కాడని యెవరన్నారు ? అతడు విరక్తుడయిన జంగమము కాడని తమ్మయ్యగా రెట్లు రుజువుచేయగలరు ? మడివాలు మాచయ్య జంగమప్రష్ఠుండు అంటే జంగములను గురువులుగా ముందిడుకొని ఆరాధించేవా డని అర్థముకాని అతడు జంగము డని కాదు. అందుచేత వీరశైవదీక్ష నొందినవారందఱును జంగములే అని తమ్మయ్యగారు వ్రాసిన వ్రాత పరాస్త మవుతున్నది.

## (3) సోమనాథుని కాలము

ఎవ రెంత ప్రాకులాడినా సోమనాథుడు క్రీ. శ. ౧౨౪౦ సం.రమునకు పూర్వము పుట్టినవాడు కాడనడము సిద్ధాంతము. అతడు మొదటి ప్రతాపరుద్రుని కాలమున ఉండడము సుతరాం అసంగతము. అతనికి బసవనిగురించిగాని, పండితారాధ్యునిగురించిగాని ఏమిన్నీ స్వయముగా తెలియ దన్నమాటను తమ్మయ్యగా రొప్పుకొన్నారుగదా ! మొదటి ప్రతాపరుద్రుని రాజ్యాభిషేకకాలము క్రీ. శ. ౧౧౬౩ సం.రము. బసవేశ్వరుడు ౧౧౬౮ సం. ర ప్రాంతమువాడు. అప్పటి కతడు బాలుడు. ఎంత వయసువాడో చెప్పలేము. ౨౫ ఏండ్లలోపలి వయస్సువా డనుకోవచ్చును. అందుచేత అప్పటికే ప్రసిద్ధుడయిన సోమనాథు డతనికంటె పెద్దవాడయిఉండవలెనుగదా. 'బసవగోత్రుండ' అని బసవని కాలములో ఉన్న సోమనాథుడు చెప్పకొనడము అసంగతమే కదా! బెలిదేవి వేమనారాధ్యుడు పండితారాధ్యునికి సమానమయిన వయస్సు గలవానివలె కనబడుతాడు. అతడున్ను పండితారాధ్యుడున్ను బసవనికి సమకాలికులు; అతనికంటె పెద్దవారు. బెల్దేవి వేమనారాధ్యుని మనుమని శిష్యుడే సోమనాథు డని ఒప్పుకొన్న మొదటి ప్రతాపరుద్రుని కాలములో ఉంటే వేమనారాధ్యునికంటె ౧౫-౨౦ ఏండ్లు మాత్రము చిన్నవా డయినట్లు కనబడే పాల్కురికి సోమనాథుడు వేమనారాధ్యుని మనుమని శిష్యుడు కావడము ఘటిస్తింపదు గదా. ఇదిగాక క్రీ. శ. ౧౧౪౦ నుంచి ౧౧౯౦ వరకు గల ౫౦ ఏండ్లలో సోమనాథుడు తన గ్రంథములలో పేర్కొన్న చారిత్రకపురుషులనందరినీ ఇరికించ సాధ్యముకాని పని. అట్లా ఇరికించడాని కంతటి తంటాలుపడి, ఉన్న మాటలను మార్చి, లేనిమాటలను దూర్చి, ఉన్నమాటల కపార్థములను కల్పించి సాధించే దేమయినా ఉన్నదా?

(౧) పిడుపర్తి సోమనాథుడు చెప్పినమాట కా దనడానికి కారణము కనబడదు. అతడు క్రీ. శ. ౧౪౮౦ సం. రమునకు తరువాతివాడు. పాలుకురికి సోమనాథుని శిష్యుడయిన శివరాత్రికొప్పయ్యకు పిడుపర్తిసోమన్న ఆరోతరమువాడు కాబట్టి తరమునకు ౨౫ ఏండ్లచొప్పున లెక్కవేస్తే కొప్పయ్య కాలము ౧౪౮౦—౧౫౦=౧౩౩౦ ప్రాంతమవుతుంది. అది రెండో ప్రతాపరుద్రుని కాలము.

(౨) పాల్కురికి సోమనాథుడు బెలిదేవి వేమనారాధ్యుని మనుమనిశిష్యుడ ననిచెప్పకొన్నాడు. ఈ వేమనారాధ్యుడు పండితారాధ్యుని సమకాలికు డయిన వేమనారాధ్యునికి మనుమడయి ఉంటాడు. అంటే సోమనాథుడు పండితారాధ్యునికి సమకాలికుడయిన వేమనారాధ్యుని మనుమడయిన వేమనారాధ్యుని మనుమని శిష్యుడు. ఇట్లాలోచించినా పాల్కురికి సోమనాథుని కాలము రెండో ప్రతాపరుద్రుని కాల మవుతుంది.

(3) సోమరాజు రచించిన కన్నడ ఉద్భట చరిత్రములోని "సానిరదనానూర్" అనేపాఠమే అన్ని వ్రాతప్రతులలోను ఉన్నది. "సానిరదనూతిఱి" అనే పాఠముగల ఒక్క ప్రతి అయినా కనబడేవరకున్ను సోమనాథుని కాలము శాలివాహనశకము ౧౪౪౪+౭౮=క్రీ. శ. ౧౫౨౨ సం.ర

మవుతుంది. ౧౧౪౪ + ౭౮ = క్రీ. శ. ౧౨౨౨ ఎంత మాత్రమున్ను కాదు. క్రీ. శ. ౧౨౨౨ అయితే పాల్కురికి సోమనాథుని కాలము బసవని కాలముకంటె పూర్వము కావలసివస్తుంది. ఇది అసంభవము గదా.

(౪) సోమనాథుడు బసవపురాణమును రచించిన అనతికాలముననే భీమకవి క్రీ. శ. ౧౩౬౯ లో కన్నడించినాడు. దీనినిబట్టి ఆలోచించినా సోమనాథుడు రెండో ప్రతాపరుద్రుని కాలమువాడే అవుతాడు.

(౫) సోమనాథుని పండితారాధ్యచరితరచన కనతికాలముననే శ్రీనాథుడు క్రీ. శ. ౧౩౯౫ ప్రాంతమున పద్యకావ్యముగా వ్రాసినాడు. శ్రీనాథునికంటె సోముడు ౭౦,౮౦ ఏండ్లు పూర్వుడయినా రెండో ప్రతాపరుద్రుని కాలమువాడే అవుతాడు. కన్నడ భీమకవి తెనుగుశ్రీనాథుల కాలమునాటికే బసవపురాణ పండితారాధ్యచరిత్రములు ప్రసిద్ధి కెక్కియుండ వనడము ఆగ్రంథముల ప్రాశస్త్యమును గుర్తింపకుండడమే అవుతుంది.

(౬) కన్నడములో పద్మణాంకకవి సోమనాథుని కించుమించు సమకాలికుడయిన కెరెయపద్మరసును గూర్చిన కన్నడగ్రంథమును క్రీ. శ. ౧౩౮౫ లో వ్రాయడాని కాతనియెడల గల పరిచితభక్తియే కారణము. కాబట్టి పద్మణాంకునికి పద్మరసు ౫౦,౬౦ సం. రములకు పూర్వుడు కాజాలడు. అట్లు చూచినా పాల్కురికి సోమనాథుడు రెండో ప్రతాపరుద్రుని కాలమువాడే అవుతాడు.

(౭) కరస్థలి విశ్వనాథయ్య విశ్వేశ్వరాచార్యుడు కాడనిన్ని, సోమాచార్యుడు సోమనాథుడు కాడనిన్ని తమ్మయ్యగారు వ్రాసిన వ్రాత సమంజసముగ లేదు. ఆ శాసనము లున్న ప్రదేశము, ఆ శాసనముల కాలము, ఆ నామముల సాదృశ్యము, విషయసాదృశ్యము వీటి నన్నిటినిబట్టే ఆలోచిస్తే నే నూహించినది కేవలము పొరపాటు కా దని సహృదయులు గ్రహింపగలరు. నా యూహ సరియైన దయితే నేను చూపిన లెక్కన కారణముల కిది ఉపబలకముగా ఉంటుంది. కాకతీయరాజులకు ఇష్టలింగార్చకులయిన వీరశైవులే గురువులుగా ఉన్నారని పెద్ద అక్షరములతో ప్రకటించిన తమ్మయ్యగారు గణపతిదేవుని గురువయిన విశ్వేశ్వరాచార్యుడు వీరశైవుడు కాక శుద్ధశైవుడని యెట్లంగీకరించినారో తెలియదు. విశ్వేశ్వరాచార్యుడు శుద్ధశైవుడు కాడు. గోళకిమఠము వీరశైవ మఠమే; గోడగి అన్నా గోళకి అన్నా ఒకటే. గోడగి త్రిపురారి ఆమఠమునకు సంబంధించినవాడే. కోణంగి ఆట లాడడముచేత గోడగి అనే యింటిపేరాతనికి కలిగిం దని సోమనాథుడు చెప్పడ మొక కవిత్వమే కాని వాస్తవము కాదు. కోడగ మాడితే 'కోడగి' కావలెనుగాని 'గోడగి' కాజాలదు. ఏదయినా యిట్టి చిలిపికారణములు చరిత్రను త్రోసిపుచ్చజాలవు.

(౮) "పరిచితగురుపరంపర దేజరిల్లు"; "ప్రథితగురుపరంపర దేజరిల్లు" అన్నప్పుడు "తేజరిల్లుతున్నది" అని వర్తమానార్థబోధక మవుతుందిగాని అది ఆశీరర్థక మెంతమాత్రమును గాదు. ఈవిషయమై తమ్మయ్యగారు వ్రాసిన వ్రాత నాకు నచ్చలేదు.

(౯) శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ప్రకటించిన కాకతీయచక్రవర్తుల సామంతుడయిన అంబయదేవమహారాజు క్రీ.శ. ౧౨౯౦ సం.ర శాసనములో నుదాహృతులయిన రెంటాల మల్లినాథ దోచమాంబలు పాల్కురికి సోమనాథుడు తనకు సమకాలికు లని చెప్పుకొన్న అవే పేళ్లు గలవారు కా రనడానికి తమ యిష్టము తప్ప తమ్మయ్యగారు మరొక కారణము చూపలేదు. కాలనిర్ణయము మన యిష్టానిష్టముల ననుసరించి చేయరాదుగదా! సోమశేఖరశర్మగారు చేసిన నిర్ణయమునుబట్టిన్ని సోమనాథుడు రెండో ప్రతాపరుద్రుని కాలమువాడే అవుతున్నాడు.

శ్రీ తమ్మయ్యగారు తమ గ్రంథములో తామింతకుపూర్వ మచ్చటచ్చట ప్రకటించిన వ్యాసఖండములలోని సారాంశము నొకచోట చేర్చినారు. ఈవిషయములలో చాలావరకు శ్రీ ప్రభాకరశాస్త్రులవారు మొదలయినవారు చెప్పినవేకాని క్రొత్తవేమియు లేవు. అయినా, అన్ని విషయములను ఒకచోట చేర్చి గ్రంథరూపముగా ప్రకటించిన తమ్మయ్యగా రాంధ్రలోకమునకు కభివంద్యులే.

# తీరని బాధ

[ కథానిక ]

## శ్రీ గొల్లమూడి లక్ష్మీనారాయణ

"'రామయ్యపంతులంతటి అదృష్టవంతుడు ప్రపంచంలో మరొకడు ఉండడు. అంత అదృష్టానికి ఇంతవరకూ ఎవ్వరూ పెట్టిపుట్టలేదు' అని అనుకుంటారుకదూ మీరందరూ.

'ఆయన కేం, మహారాజు! తను తిని, పదిమందికి పెట్టగలిగినవాడు. పేరు ప్రఖ్యాతుల కేమీ కొదువలేదు.

'ఒకడికి కష్టం వస్తే, చూసి కరిగిపోతాడు. కష్టకాలంలో అయినవాడనీ, కానివాడనీ భేదం లేకుండా చేతనైన సాయం చేస్తాడు. ఆఖరికి, ఎంతటి బీద బ్రాహ్మడు చచ్చినా శవాన్ని మోస్తాడు' ఇలా అనుకుంటారు మీరంతా......"

పేరుప్రఖ్యాతులు బాగా ఆర్జించి, పెద్దతనం మీదపడగా న్యాయవాదివృత్తిలోంచి విరమించుకున్న రామయ్యపంతులు, ఎదురుగావున్న గోడకు తగిలించిన పుష్పాలంకృతమైన ఒక యువకుడి చిత్రాన్ని రెప్పార్పకుండా చూస్తూ, వేదాంతుడిస్వరంలో అలా అనర్గళంగా చెప్పుకుపోతున్నాడు.

"నాకు దిగు లేమీ లేదనీ, సర్వం సలక్షణంగా వుందనీకూడా మీరు ఊహించుకుంటారు.

"అవును, మీరు అనుకుంటున్నది కొంతవరకు నిజమే. కాని మానవుడన్నాక దిగులంటూ ఉండక పోదు. నాకూ ఓ దిగులు వుందనీ, దానికీ ఓ కారణం ఉందనీ ఎవ్వరూ కలలోనైనా అనుకోరు. ఆ దిగు లేమిటో, ఆ విషయ మేమిటో నా కొక్కడికే తెలుసు. నే నొక్కడినే బాధపడుతుంటాను. ఎన్ని సంవత్సరాల నుంచో ఆ బాధ గడ్డకట్టుకుపోయింది. ఏవిధానైనా తీరటంలేదు. ఏ క్షణంలోనైనా, నా హృదయాన్ని పిండుతోంది. నా ఇప్పటి దయాదాక్షిణ్యాలకు మూలమంతా నా విచారానికి కారణమౌతున్న సంఘటనే.

"ఇదంతా ఎందుకు చెప్పతున్నానంటే నీవు యౌవనంలో ఉన్నావు. నా యీ బాధకి కారణమయిన సంఘటన యౌవనంలోనే జరిగింది. యౌవనంలో మూర్ఖాభిమానం, దురహంకారం ఎవడికైనా ఉంటాయి. అప్పుడు, ఎవడికి వాడే 'నేనే సరియైన దోవలో నడుస్తున్నాను. నాది అంతా న్యాయం' అనుకుంటాడు. అంచేతే నీకు చెప్పటం.

"అసలువిషయం చెప్తాను విను. చలపతి నాకు చిన్నినాటినుంచీ మిత్రుడు. మా మైత్రికి ఎక్కువగా దోహద మిచ్చింది—మేమిద్దరం ఒక క్లాసు చదవటం. చలపతి మాకు చాలా దూరపుబంధువు. ఆ బంధుత్వం విషయం బయటికి వచ్చింది స్నేహం ప్రారంభమైనాక. మా యిద్దరి మైత్రీ చాలామందిని ఆకర్షించింది. అసూయపడ్డవాళ్లుకూడా కొందరు లేకపోలేదు. ఎక్కడికెళ్లినా కవలల్లా మాజంట ఉండాల్సిందే.

"మాయిద్దరిభావాలూ సాహచర్యంతోపాటు అలా ఏకీభవించేవి. ఒకరు ద్వేషిస్తే మరొకాళ్లం తప్పకుండా అక్కర్లేకనే ద్వేషించేవాళ్లం. ఒకరికి నచ్చితే తప్పకుండా

మరొకోహారికి ఆవస్తువే నచ్చేది. అలా మేమిద్దరం మనసా ఏకీభవించాం. అడవిలో స్వేచ్ఛగా ఒకదానికొకటి కౌగిలి వేసుకుని, అల్లుకుపోయే లతలు గుర్తుకువస్తాయి, మా స్నేహం గుర్తుకువస్తే.

"పదిహేను పదహారేళ్లవరకూ అలాగే ఉండే వాళ్లం. కాని, ఆతర్వాత మే మంతగా ఏవిషయంలో నైనా ఏకీభవించలేకపోయేవాళ్లం. అతను మారాడని నే ననుకునేవాణ్ణి. నేను మారానని వా డనుకునేవాడు. ఎవ్వరూ మారలేదు. ఎవళ్లకి వాళ్లే అహంకారం పెంచుకున్నారు—'వాడు చెప్పింది నే నెందుకు ఒప్పుకో వాలి?' అని.

"వాళ్లు మాఅంత భాగ్యవంతులు కారు. అంత మాత్రాన రెక్కాడకపోయినా, పస్తుండాల్సినఅవసరం లేదు.

"'డూ, డూ బసవన్న' పద్ధతిగాకుండా మా యిద్దరిమధ్యా ఏ విషయంమీదపట్టినా వాదనలు జరుగు తుండేవి. ఆవాదనల్లోనూ చలపతి బాగానే వాదించే వాడుగాని కాస్త తొందరపాటుమనిషి. వెంటనే మనిషి నిందకి దిగేవాడు. నే నేమీ అనుకోనని తెలిసే అనుకో. వాణ్ణి నిందించినా ఏమీ అనుకోనేవాడు కాడు. ఎంచేతంటే, ఎప్పుడూ అంటూండేవాడు—'కపటమంటూ నాదగ్గిర పనికిరాదు. మనసులో ఉన్నది బయటికి అనేయాల్సిందే' అని. కాని వాడుగూడా ఆ తర్వాత మారిపోయాడు.

"నేను నా శక్తికొద్దీ సాహిత్యసేవ చేశాను. నేను రచించిన గ్రంథాలన్నీ 'చలపతి' వ్రాసినట్లుగా చలామణీఅయినాయని నీకు తెలుసు. ఈ రచనా భ్యాసం అతనితో స్నేహముండగా ప్రారంభమైంది. వాడూ వికసిస్తూన్న మొగ్గ— చిత్రకారుడు, కవి.

"తిండీ, నిద్రా మరిచిపోయి వాదించుకునే వాళ్లం. అలాంటి వాదనల్లో ముఖ్యమైంది ఒకటిచెప్తాను.

'సాహిత్యమన్నాక, ఏదన్నా ప్రయోజనంతో ఒక విషయం, నీ పాఠకులకి తెప్పదలచుకుని రాయాలి చలపతీ!' అన్నాను—అతను కథ ఒకటి వినిపించాక.

'అంటే? నీ వనుకున్నది నాకు స్పష్టంగా అర్థం కాలేదు.' అన్నాడు చలపతి.

'ఏమీ లేదు. నీవు కథ ఒకటి వ్రాశావంటే పాఠకులకి ఒక నీతి బోధించటానికే నంటాను. లేకపోతే సాహిత్యంతో లోకానికి కేం పని?' అన్నాను నేను.

'అదిగో అక్కడే పప్పులో కాలేశావు.ఏది నీతి, ఏది న్యాయం నీ వెలా చెప్పగలవు? నీ కేమి తెలుసని? నీవు ఒకటి న్యాయ మంటావు. మరొకాడు అది అన్యా యమంటాడు. నీవు న్యాయ మని సమర్థిస్తూ కథ ఒకటి వ్రాస్తావు. అప్పుడు నీవేం చేస్తున్నావన్నమాట?— పాఠకుడి స్వాతంత్ర్యాన్ని నాశనంజేసి, ఒక గొర్రెలా నీ సిద్ధాంతాని కనుగుణంగా మార్చుకుంటున్నా వన్న మాట'—నొక్కిచెప్పాడు చలపతి.

'అయితే, నీదృష్టిలో, వాల్మీకి ప్రభృతులంతా అలా ప్రజలను గొర్రెలమందగా మార్చేవారనేనా?' —అడిగాను నేను.

'అక్కడే మీరంతా పొరబడేది. వాల్మీకికిన్నీ మీకున్నూ పోలికేమిటి అసలు? నక్క వాతలుపెట్టుకొని 'నేనూ పులినే' అంటే అవుతుందా? వాల్మీకి సకల ధర్మాలూ తెలిసినవాడు. ఏది ధర్మమో, ఏది నీతో తెలిసినవాడు. వారంతా ద్రష్టలు. వారికి స్వార్థాలు లేవు. ఉద్రేకాలు లేవు. పండిపోయిన ముదుసలులు.

'అంతదాకా ఎందుకు? నీవు యౌవనంలో చేసిన రచన వార్ధక్యంలో చదువుకుంటే, మరు క్షణాన్నే తగలబెట్తావు. మన మేం సర్వజ్ఞులం కాం. మన కేం తెలుసని, మన సిద్ధాంతాలు ఏం సరియైనవని ప్రపంచానికి చెప్పబోతాం. అక్కడే మీ గర్వం, మీ అహంకారం కనిపిస్తుంది. పంతులూ! నీవు చెడి పోతున్నావు. నీబుర్రలో పురుగు ప్రవేశించింది. నీవు పుట్టుకతోనే గర్విష్ఠివి. దాంతో ఆ పిచ్చసిద్ధాంతా లన్నీ వంటపట్టున్నాయి. సాహిత్యం ఎప్పుడూ మాండ లిక ప్రయోజనాలకోసం పాటుపడ్తుందని, వర్గాభివృద్ధి కోసం కృషిచేస్తుం దని, ఏది చదితే అది నీతి అంటూ నెత్తిన రుద్దుతుం దనీ అనుకోబోకు. ఏది నీతి అని చెప్తాం? ఈ ప్రదేశంలో నీతి ఇంకో ప్రదేశంలో అ

నీతి. 'విశ్వశ్రేయః కావ్యం' అనే మూడు మాటలు సరిగ్గా అర్థంచేసుకో !' గుక్క తిప్పుకోకుండా ఉపన్యాస మిచ్చేవాడు చలపతి.

"కాని నాకుమాత్రం, అప్పట్లో చలపతి చెప్పిన వన్నీ గగనకుసుమాలుగా ఉండిపోయాయి. అతని ఆశయాలన్నీ గాలిమేడ లనిపించాయి. ఎంచేతో, నే నేకీభవించలేకపోయేవాణ్ణి. ఏవిషయంలోనైనా, మాకు భేదాలు వస్తే, అదంతా, ఇక నా భాగ్యానికి అంటగట్టేవాడు. నాకు మండిపోయేది.

"ఎలా అయితేనేం, ఇలాంటి చిన్నచిన్న విషయాల్లోనే మాలో విభేదాలు పొడసూపినాయి. చాలా చిన్నవి. పుట్టగొడుగుల్లాంటివి. మా స్నేహం మాత్రం తొణకలేదు. మనసులోమాత్రం కొన్నికొన్ని విషయాల్లో నొచ్చుకున్నాను.

"బి. ఎ. మే మిద్దరం కలిసే చదివాం. చలపతి అపామాషగా చదివాడు. అంతగా శ్రద్ధపుచ్చుకోలేదు. రిజల్ట్సు వచ్చినపుడు చలపతి స్వగ్రామంలో వున్నాడు. నేను పాసయ్యాను. చలపతి 'గ్రూప్'లో తప్పాడు. పేపరు చూస్తుండగా చుట్టూ మాస్నేహితులు మూగి వున్నారు. ఎవ్వడూ నేలమీద నిలవటంలేదు. చలపతికి 'గ్రూప్'లో పోయిందనగానే, అంతా ఆశ్చర్యపోయారు. 'అరె ! వాడు, తప్పడ మేమిట్రా ! మంచి తెలివిగలవాడుగదా ? ఆఁ. ఏమిటే, ఈ చదువుక్కాడా పెద్ద...అని అంటూం డేవాడు' అన్నారు. 'తెలివితేటలు ఇక్కడేం పనికిరావురా ! లేనిపోని పిచ్చిరాతలన్నీ పరీక్షలప్పుడుగూడా చూసుకుంటూ, నా అంత తెలివిగలవా డెవ్వ డని విర్రవీగితే ఏ మవుతుందిలే' అన్నాను. అన్నప్పుడు ఇలా అంటున్నానని తెలియకుండానే అనేశాను. ఆతర్వాత అన్న మాటలు మరిచిపోయాను. ఆ పొంగులో ఆ ఉద్రేకపు మాటలు పొంగిపొర్లాయి.

"మద్రాసు కెళ్ళి, 'లా' కాలేజిలో సీటు సంపాదించి ఇంటికి వచ్చాను. రాగానే, ఇంట్లోవాళ్లు, చలపతి వచ్చాడనీ, జ్వరం తగులుతున్నదనీ చెప్పారు."

"చూడటానికి వెళ్ళాను. మంచంమీద పడుకుని ఉన్నాడు. నేను రావటం చూసి అటువైపు తిరిగి పడుకున్నాడు. మంచంమీద కూచొని, వంటిమీద చేయి వేశాను. వళ్లు వేడిగా ఉంది. స్పృహలోనే వున్నాడు. 'ఎన్నాళ్లనుంచి ? ఏం జ్వరం ? ఇత్యాదులన్నీ అడిగాను. కాని వాడు కదలలేదు ; మెదలలేదు. నిశ్చలంగా నేలవంక చూస్తున్నాడు. తప్పాడని దిగులు ఏమైనా ఉందేమోనని 'పోతే పోయిందిలేరా. దిగులు పెట్టుకోబోకు.' అన్నాను. దానికీ మాట్లాడలేదు. 'ఏంరా, మాట్లాడవేంటి ? ఎంచేత ?'—అడిగాను. ఊహుఁ. పావుగంటసేపు కూచుని ఎంతకీ మాట్లాడకపోతే 'ఏమన్నా, తప్పు చేస్తే, క్షమించరా !' అని లేచి వచ్చేశాను. నాకళ్లు చెమ్మగిలినాయి.

"కొన్నాళ్లకి వాడికి జ్వరం తగ్గింది. మామూలుగా తిని తిరుగుతున్నాడు. నేను 'లా' చదువుదామని మద్రాసుకు రేపు బయలుదేరుతా ననంగా, చెప్పివద్దామని వాళ్ల యింటికి వెళ్ళాను. విచారంగా పాడుతున్న పాటొకటి వినిపిస్తోంది వాళ్ల యింట్లోనుంచి. అది చలపతి పాడుతున్నదే. ఆవిషయం నేను గట్టిగా చెప్పగలను. చలపతిని పిలవమని వాకిట్లో కూర్చున్న వాళ్ల చెల్లిని అడిగాను. లోపలకి వెళ్లివచ్చి 'లేడు' అని చెప్పింది ! కాళ్లీడ్చుకుంటూ వెనక్కి తిరిగాను. కళ్లవెంట నీళ్లు తిరిగాయి. చలపతి చెప్తూం డేవాడు ; విరోధం రాగూడదుగాని, వస్తే కలకాలంఉంటుం'దని. ఆమాటలు జ్ఞాపకం వచ్చి, నేను తపించిపోయేవాణ్ణి. ఎంతటి స్నేహితుడు ఎలా మారిపోయాడు ! ఏమిటి నేను వాడికి చేసిన అపకారం ? బుర్ర తిరిగిపోయేది. అంతా అయోమయంగా ఉండేది. నేను ఇప్పుడు మా స్నేహం చెడటానికి ఎవరు కారకులో చెప్పబోవటం లేదు. ఎవరిది తప్పోగూడా చూపించబోవటం లేదు. ఒకళ్లని ఒకళ్లం తప్పుగా అర్థంచేసుకుని ఉండాలి.

"నేను 'లా' చదివాను. ప్రాక్టీసుచేయటం మొదలుపెట్టాను. వాడు బి. యిడి. చదివి స్కూల్లో టీచరుగా చేస్తున్నాడు. ఇద్దరమూ ఒకే ఊళ్లో.

"అప్పుడప్పుడు తటస్థపడుతూం డేవాళ్లం ఇద్దరం. ఎప్పుడన్నా 'ఏంరా ?' అని పొడిగా పల్క

రిస్తాడేమో, పోయి కౌగిలించుకుందా మనిపించేది. నాకూ పల్కరించుదామనే అనిపించేది. నాలుకవరకూ వచ్చేది. కాని అత నల్లా చూసీచూడనట్లు వెళ్తున్నప్పుడు పల్కరించటానికి వెనుకంజవేసేది నామనసు. ఇద్దరం తడబడుతూ నడిచేవాళ్లం. తటస్థపడ్డప్పుడు చలపతీ, నా మాదిరిగానే, పల్కరించుదామని ప్రయత్నించి, పల్కరించలేకపోతున్నాడని అనుకునేవాణ్ణి. మాయిద్దరి మాటలూ కలిగివచ్చే సుముహూర్తంకోసం కాచుకు కూర్చునేవాణ్ణి.

"లోపల ఎంత ప్రేమ దాచుకున్నా, ఎదుటివాడి నిర్లక్ష్యం చూస్తే, ఎవరికైనా ఆ ఎదుటివాడి మీద నిర్లక్ష్యం పుట్టుకొస్తుంది. చలపతి అంతగా బిగిసివుంటున్నప్పుడు, నేను వాడి స్నేహంకోసం ఎంచేత అంతగా తాపత్రయపడాలి? అనే తర్కం నాలో బయలుదేరింది. నాలో చాలా మార్పు వచ్చింది.

"కొంతకాలం గడిచిపోయింది. దినకృత్యాలల్లో ఈస్నేహాలు, ఈవిరోధాలు అన్నీ అడుగున బడిపోయినాయి.

"చలపతి నాకు వారానికి మూడునాల్గుసార్లన్నా కనిపించేవాడు. ఊళ్లో లేడేమో నను కున్నాను—పదిహేనురోజులనుంచీ కనిపించకపోతే. ఇద్దరు ముగ్గురు పాతస్నేహితుల్ని విచారిస్తే వాడికి 'టైఫాయిడ్' అని తెలిసింది! ఆ వార్త వినంగానే, మా సంబంధబాంధవ్యాలన్నీ తిరగపోసినట్లయింది. మనసు కలికింది. వెళ్లి చూస్తే?............ వెనక వాడికి జ్వరమొచ్చినపుడు వెళ్లటం; వాడు తృణీకరించటం—నామనసుకు కల్లోలం చేసింది. వెళ్ల బుద్ధి కాలేదు. నాకుభయమూ వేసింది—ఈసారి పురుగును చూసినట్లు ఎంతగా చూస్తాడోనని...పూర్వం జ్వరంలో వచ్చిన మార్పు ఈసారి జ్వరంలో పోతే బాగుండు ననుకున్నాను. ఆమార్పు మాయమవుతుం దనీ, చలపతి నావాడు అవుతాడనీ, జ్వరం తగ్గాక నన్ను పల్కరిస్తాడనీ దృఢంగా విశ్వసించాను. మళ్లా మే మిద్దరం జీవితాలల్లో, ఎలా సహకారంగా వెళ్లు తేనదీ ఆనందంగా ఊహించుకున్నాను. ఈ నాలుగురోజుల్లో మనం బయటపడడ మెందుకు? వాడు ఎలాగూ పల్కరిస్తాడు. మనం ముందరగా పల్కరించి, వాడి దృష్టిలో అలుసుకావట మెందుకు? మాట్లాడటం వాడు మొదట మానేశాడు కాబట్టి, పలకరించినా వాడే ముందరగా పలకరిస్తాడు. స్నేహితులంతా పోయి చూసి వస్తున్నారు. నాకూ చెప్పారు, చూసిరమ్మని. నేను 'ఆఁ' అంటూండేవాణ్ణి.

"ఇరవైయోరోజు......ఒక్కరోజు ఆగితే... మళ్లా నా చలపతి...

"ఆరోజు సాయంకాలం కోర్టునుంచి వచ్చి, విశ్రాంతి తీసుకుంటున్నాను. ఏవేవో ఆలోచనలు... అకస్మాత్తుగా 'రామన్నయ్యా!' అని కేక వినిపించింది. లలిత వచ్చి, నావళ్లోకి వాలింది. 'రామన్నయ్యా, అన్నయ్య నిన్నొకసారి వచ్చి, వెళ్లమన్నాడు.' అన్నది నా మొహంలోకి చూస్తూ.

'నన్నా! చలపతి రమ్మన్నాడా!......... ఎల్లాగుంది అన్నయ్యకు? డాక్టర్లు తగ్గిం దంటున్నారు కదూ?'

'అలాగే వుంది! డాక్టర్లు ఏమీ చెప్పరు. మా కందరికీ దిగులుగా ఉంది'—విచారంగా అన్నది.

'దిగు లెందుకు? తప్పకుండా తగ్గుతుంది చలపతికి. ఎల్లుండికల్లా నిన్నెత్తుకోడూ?' అని ముద్దుపెట్టుకొని 'నీ వెళ్లు. నేను వీలుచూసుకుని వస్తా నని చెప్పు!' అని చెట్టుసరిగా చెప్పి పంపాను.

"అలా చెట్టుసరిగా పైకి అన్నానేకాని, నా మనసు పరిపరివిధాల ప్రవహించింది. లలిత మాటలు చూస్తే, చలపతిరోగం ఏమీ సుముఖంగా లేదు...... నా హృదయం స్పందించింది. వాడు నోరారా పిలిచాడు. ప్రాణస్నేహితుడు...మనసులు అలా అతుక్కుపోయాయి. ప్రపంచంలో అంతకన్నా దగ్గిరవాడు లేడు......వాడి స్నేహం పోయినందుకు ఎలా విలపించాను! మళ్ళీ వాడితో మాట్లాడి, హృదయంలో వున్న క్షోభంతా తొలగించుకుని ఏడుద్దామని ఎంతగా తాపత్రయ పడ్డాను!

"ఏమిటో...అలా ఆలోచనలు సాగిపోయి నాయి, తీరా చూసుకుంటూ రోడ్డుమీద నడుస్తు న్నాను......అప్రయత్నంగా! చూపు కానింది చల పతిఇల్లు. అటూయిటూ చూసి గబగబా అడుగులు వేసు కుంటూ నడిచాను. ఇంకో పదిగజాలు చలపతి ఇంటి వీథివాకిలికి...నేను తేలిపోయాను. చలపతి ఎలా ప్రవ ర్తిస్తాడా అని నా మనసు ఆటుపోటుల్లో ఉంది. గుమ్మం దృష్టిలో నుంచుకొని గాలిలో ఈదాను. మా మిత్రుడు గోపాలం కనిపించాడు. ఎవళ్లకైతే నాకూ చలపతికీ మాటలు లేవని తెలుసో, వాళ్ల కళ్ల ఎదుట నాఅంత నేను మొట్టమొదటగా చలపతిని చూడ టానికా?......అవమానం!

"మొహం తిప్పాను. ఏదో పనిఉన్నవాడిలా చరచరా, చలపతియింటివంక చూడకుండా నడుద్దా మనుకున్నాను. కాళ్లు పట్టుకుపోయినాయి. ఆలస్య మైంది నడక.

'అరేయ్, పంతులూ!' అంటూ భుజంమీద చేయి వేయనేవేశాడు గోపాలం. భుజాలు ముడుచు కున్నాను. 'చలపతికి చాలా సీరియస్‌గా వుందిరా! నే నిప్పుడే చూసివస్తున్నాను. అయినా, చూసివద్దాం రారా, ఇద్దరం' అని నన్ను వెనక్కి తిప్పాడు. 'ఇప్పుడు కాదురా — మాఅమ్మ తలనొప్పితో చాలా బాధపడుతోంది. 'ఆస్ప్రో' కొనుక్కురావాలి. వీలైనప్పుడు వస్తాలే. అయినా, మధ్య నీబలవంతం ఏమిటిలే!' అని విదిలించుకొని వచ్చేశాను. గోపాలం బొమ్మలా నిలబడ్డాడు.

"ఇక ఆరోజుసాయంకాలం వెళ్లలేదు. రాత్రీ వెళ్లలేదు. మర్నాడు ప్రొద్దున్నే వెళదా మను కున్నాను. ఏవేవో వ్యధ ల ఆ లో చ న లు నా మనసును మథించాయి. అన్నం తినలేదు. నిద్రపోదా మని ప్రయత్నించాను. నిద్ర పట్టలేదు. కాని అనుకో కుండానే మైకం కమ్మింది—నిద్ర కాదు!

"ఏవేవో పీడకలలు—జంతువుల పీకలు తెగ కోస్తున్నారు...ఎవరో? అంతా భయంకరంగా వుంది. పెళ్లికూడా—ఎవరిదో జరిగిపోతోంది. వికటాట్టహాసాలు......అన్నీ......కుక్కల ఏడు పులు......మనుష్యరోదనమూ స్వల్పంగా బాహ్య స్మృతికి అందుతోంది.

"శరీరమంతా కంపనం కలిగించే ఆ పీడకలలే నన్ను ఒక్కసారిగా లేచి కూచోపెట్టాయి. ఇంట్లో గోలగా వుంది. మాఅమ్మా, నాన్నా ఎక్కడికో ప్రయాణ మవుతున్నారు.

"'ఎంత లేపినా, లేవవేంరా? చలపతి చని పోయాట్ట!' చైతన్యం శూన్యం... ఏమి విన్నానో అర్థం కాలేదు. అలాగే నోరు తెరిచి చూస్తున్నాను. పావుగంట అయింది, ప్రాణంపోయి. 'వెళ్దాం రామ్మడూ లే!' అన్నది మాఅమ్మ. బ్రహ్మ ఎంతటికళితనశిలలోంచి తొలిచి, నన్ను తయారుచేశాడో — అలా ప్రతిమలా కూర్చున్నాను. కాని ఎక్కడో భయంకరలోకంలో విహరిస్తోంది నామనసు. 'ఏమిటీఇదంతా, నే కంటున్న పీడకలల్లో ఇది ఒకటా?' అనుకున్నాను. 'రావూ?' అడిగింది అమ్మ. 'వద్దు, వద్దు. చలపతికి చావా! వద్దు' అని పీడకలల్లో అనుకుంటున్నట్లుగా, చేయి కళ్లకు అడ్డంపెట్టుకొని తల అడ్డంగా ఊపేను. మాఅమ్మా, నాన్నా బయలుదేరారు. మా పెంపుడుకుక్క నావంక ఒకసారి చూసి 'కుంయ్ కుంయ్' అంటూ తోక ఆడిస్తూ నాపాదం నాకింది. అదీ కదిలింది...... చలపతిని చూడటానికి! కుక్క వెళ్లింది.... చలపతి కళేబరాన్ని చూడటానికి......!

"కాకుల గోల. తెల్లవారింది— చైతన్యం వచ్చింది. రాత్రి జరిగిందంతా బాగా అర్థమయింది. చలపతిఇంటికి చాకు లేకుండానే పరుగుతీశాను.

"పాడెమీద పడుకోబెట్టారు చలపతిని. చలపతి దగ్గిరికి వచ్చాను. వణికిపోతున్నది శరీరం ... పిచ్చి చూపులు చూశాను. ఎవరో నన్ను దూరంగా తీసుకెళ్లి కూచోపెట్టారు......

"పాడె లేచింది. లేచి, ఒకాయన్ని తోసి, కాళ్లవైపు పట్టుకున్నాను. హృదయంలో కన్నీటి కుండలు బద్దలయినాయి. నిరంతరం, దోవపొడుగునా కన్నీళ్లు కారినాయి. ఇదంతా ఊహించి చెప్తున్నాను.

అప్పుడు నే నేమి చేస్తున్నానో, ఇతరు లేంచేస్తున్నారో నాకు తెలియలేదు. బతికున్నప్పుడు నీలిగి, చలపతితో మాట్లాడలేదు. చలపతి చనిపోయాక శవం మోయ టానికి హాజరయ్యాను. ఇదే నన్నెక్కువగా బాధ పెట్టేది.

సూర్యాస్తమయంవరకూ, నేను స్మశానంలో ఆకాలిపోతున్న శవంవంక, మంటవంక, పొగవంక, బూడిదవంకా చూస్తూ ఉండిపోయాను. ఎంతమందో ఏమిటేమిటో, నాచెవిలో అన్నారు. నా కర్థం కాలేదు. నే నక్కడనుంచి కదలలేదు.

"కాలరథం శరవేగంతో పోతోంది. నాజీవితం బూకాపట్టుతోంది. కాని, చలపతీ— నేనూ; మామైత్రీ నాకర్కోటకత్వమూ, నా అహంకారం... అన్నీ కళ్లకు కట్టినట్లు స్పష్టంగా స్మృతిపథంలో నిత్యమూ సంచరిస్తుంటాయి.

"నిత్యమూ చలపతి వచ్చి, నాతో ఎంతో ఆప్యాయంగా మాట్లాడుతుంటాడు. అప్పుడప్పుడు ఇలా అంటాడు: 'పంతులూ! నీవంత రాతిగుండెవాడ వని నే నెన్నడూ అనుకోలేదు. నీకూ, నాకూ మధ్య మాట్లాడక పోయినంతమాత్రాన ఏమంత విభేదాలు ఉన్నట్లు నా మీద అంతగా కాఠిన్యం వహించావు! కాని, నిజానికి, నీ హృదయం నాకు తెలుసు. నిన్నేమీ నే ననను. కాని నన్ను మాత్రం నీజీవితంలో చేరి పేయబోకు!'

"పదిమందిమధ్యలో సాధారణంగా కళ్లనీళ్లు రావు. హృదయం ద్రవించిపోతుంది. అప్పుడప్పుడు, లోకదృష్టిలో అర్థం లేకుండా, నాకళ్లవెంట నీళ్లు రావటం జడ్జికళ్లల్లోనూ, మిత్రుల కళ్లల్లోనూ, భార్యాబిడ్డల కళ్లల్లోనూ పడేది.

"ఇదో తీరని బాధ, అవ్యక్తమైన వ్యథ, కనబడని గాయం—అశాంతికి కారణం...

"చలపతిఫోటోమీద పడి, కన్నీరు మున్నీరుగా ఏడుస్తే, కడవలకొద్దీ కన్నీరుకారిస్తే, తాత్కాలికంగా ఉపశాంతి కలుగుతుంది.

"నాకూ, చలపతికీ భేదం లేదు. నాప్రతిబింబమే అతను. నేను కన్నీళ్లు కారుస్తున్నానని అతను కన్నీళ్లు కారుస్తున్నాడు — చూశావా, ఆ కన్నీటిచారలు!"



# ప్రాచీనఖగోళము

## ౧౦. కాలము

శ్రీ వేలూరి శివరామశాస్త్రి

కొన్ని వేలవేల యేండ్లవెనుక నాక్షత్రమగు సౌరవత్సరము వాడుకలో నుండియుండును. సూర్యుడు స్థిరమగు నొక నక్షత్రమునుండి బయలుదేరి మరల నా నక్షత్రమునకు వచ్చు కాలము నాక్షత్రవత్సరము. ఆ సౌరవత్సరమున కారంభ మెపుడో మనకు తెలియదు. ఇది ఊహామాత్రము.

పిదపకాలమున మహావిషువమునాడే సంవత్సరారంభ మయియుండును. సూర్యుడు విషువరేఖనుండి క్రమక్రమముగా ఉత్తరమునకు పోవుచున్నట్లు మనకు కనబడును. అదియే ఉత్తరాయణమునకును, ఋతువునకును, మాసమునకును, యజ్ఞమునకును ఆరంభము. అటుపిమ్మట నీసంవత్సరారంభము చిత్రా ఫాల్గునపౌర్ణమాసికి మారెను. సంహితాజ్యోతిస్సంహితలలో దీనికి సూచన లున్నవి.

ఒక నాక్షత్రవత్సరమునకును, ఒక అయనాంత వత్సరమునకును ఇంచుమించు ఇరువది నిమిషములు వ్యవధాన ముండును. నాక్షత్రవత్సరమే కాలమునకు మాపకమేని సుమారు రెండువేలయేండ్లకు ఋతువు లొక చాంద్రమాసము వెనుకకు బోవును. దీనివలన సంవత్సరారంభము మార్పవలసియుండును. ఇట్టి మార్పున కిది కారణమని మనకు విస్పష్టమగు ప్రమాణము దొరకదు. ఆయా కారణములను మన మూహించుకొనవలసినదే.



ఇటుతరువాత లగధాచార్యుడు సుమారు —౧౩౩౪వ సంవత్సరమున తనకు ముందు ప్రచారములోనున్న పూర్ణిమాంతమాసమును అమాంతమాసముగా నిర్ణయించెను.1 అనగా ఋతువు అప్పటికి చాల వెనుకబడెను. దీనికి కారణ మయనచలనము. లగధాచార్యుని వేదాంగ జ్యోతిషము చెప్పిన రవి ఉత్తరాయణమున ప్రవేశించినంత సంవత్సరారంభము. రవి ఉత్తరాయణదినమున ధనిష్ఠ యందును, దక్షిణాయనదినమున ఆశ్లేషామధ్యభాగమునను ఉండెను. అపుడు చాంద్రమాసతిథి నక్షత్రములతో విషువముగాని, అయనముగాని, యుగాదిగాని గణింపబడుచుండెడివి. ఐదేండ్లకొక యుగము. అనగా ఐదవయేట మాఘశుద్ధప్రతిపత్తున ఉత్తరాయణము. శ్రావణశుక్లసప్తమి దక్షిణాయనము. వాయువిష్ణుమత్స్యపురాణములు ఈ పంచాంగమునే అనుసరించెను.

శ్రౌతసూత్రములుకూడ గవామయనము మొదలగు సాంవత్సరికయజ్ఞములను నాడే ఆరంభింపవలయునని చెప్పును.

మహాభారతమున మరల నొక మార్పు చూపట్టును. ఆకాలమున ఋతుచక్ర మొకపక్షము వెనుకబడెను. అపుడు మార్పు జరపుటకు ప్రయత్నలోపము కలుగలేదుకాని దానిని లోకు లామోదింపకపోయినటులు తోచును. అది సాక్ష్యరూపముగా మహాభారతముననే మణిగిపోయెను. రెండవ ప్రకరణము చూచునది.

ఈ మార్పులు జరిగినపిమ్మట—3వ శతాబ్దిలో మరియొక మార్పు కనబడుచున్నది. అపుడు ఆషాఢము చివర కర్కాటములో వత్సరారంభము. అనగా వర్షర్తువుతో దక్షిణాయనముతో వర్షారంభము. అర్థశాస్త్రమున కాలమానాధ్యాయము చూచునది. దీని కుపోద్ఘాతముగా సూర్యప్రజ్ఞప్తి ఆషాఢమునుండి ఋతువుల నారంభించుచున్నది. సూర్యప్రజ్ఞప్తిలో వర్షాశరద్ధేమంతవసంతగ్రీష్మము లయిదే ఋతువులు. వర్షర్తువుతో నైన యీ వర్షారంభము వేదములందుగాని, జ్యోతిషసంహితలందుగాని, వేదాంగజ్యోతిషమునందుగాని లేదు.

ఈ పైమార్పులు జరిగినపిదప ఆరవ క్రీస్తుశకమున వరాహమిహిరుడు నక్షత్రారంభము అశ్వినినుండి చేసెను. దీనికి కారణ మిదియగు :

శీతర్తువాదిఋతు వని సంహితలలో పరిగణిత మయినటులు బృహత్సంహితలోని ఆదిత్యచారాధ్యాయమువలన తెలియనగును. అనగా ఆసమయమునందు మకరముతో సంవత్సరారంభము. లగధునికాలమున గూడ మకరముతో సంవత్సరారంభము. ఆ వ్యవస్థయే వరాహమిహిరుని కాలమువరకును, అనగా సుమారు రెండువేల యేండ్లవరకును వాడుకలో నుండెను. తన సమయములో విషువము రేవతీశేషభాగమునను, కర్కాటక్రాంతి పునర్వసునక్షత్రమునందును 2 అగుట చూచి వరాహమిహిరు డశ్వినిని నక్షత్రాదినిగా నిరూపించెను. అపుడు విషువమునుండి సంవత్సర మారంభింపబడెను. ఫాల్గునచైత్రములు వసంతర్తువుగా పరిగణింపబడెను. ఆనాడు వరాహమిహిరు డేర్పాటుచేసిన యీవ్యవస్థ నేటికిని వంగాదిదేశములందు వాడుకలో నున్నది.

## ఋతువులు

వేదములం దెచటనో చంద్రునిమాట యున్నను ముఖ్యముగా సూర్యుడే ఋతుకారకు డని కలదు. ఋతువులు మూడని ఒకచోటను, ఐదని ఒకచోటను,

1. — ఈ గుర్తు క్రీస్తుశకమువెనుక యనియు, + ఈ గుర్తు క్రీస్తుశకము పిదప యనియు గమనించునది. ధనిష్ఠను Alpha Delphini అని కొందరును, Beta Delphini అని మరికొందరును పరిగణించి నక్షత్రముల అంశముల యొక్క లెక్కలో కొలదిభేదము లూనుటచే లగధుని కాలము ఆయాయా మతములలో భేదించెను. అదియు ఈషద్భేదము.

2. పునర్వసునక్షత్రమున పాదవిభాగ మితడు చెప్పలేదు.

ఆ రని ఒకచోటను, ఏ డని ఒకచోటను వేదములలో నచటనచట కనిపించుచున్నది. ఐతరేయబ్రాహ్మణము, తైత్తిరీయసంహితాబ్రాహ్మణములు 'హేమంతమును శిశిరమును ఒక ఋతువుకింద జమకట్టవచ్చును గాన అయిదే ఋతువులు' అని అనుచున్నవి.

శతపథబ్రాహ్మణమున షడృతువిభాగ మిట్లు కలదు: మధుమాధవములు వసంతర్తుమాసములు. ఈ కాలమున తరుగుల్మలతాదులు పూచును. శుక్రశుచులు గ్రీష్మర్తుమాసములు. ఈ కాలమున సూర్యుని కిరణములు వేడిగను, వాడిగను ఉండును. నభో3 నభస్యములు వర్షర్తుమాసములు. నభస్సు లనగా మేఘములు, ఇషోర్జములు శరదృతుమాసములు. ఈ సమయమున ఖాద్యములను ధాన్యములు పండబారుచుండును. ఊర్జ మనగా ఖాద్యము. సహ4 స్సహస్యములు హేమంతర్తుమాసములు. ఈ ఋతువు ప్రాణుల నన్నిటిని తన శక్తికి వశలను జేసికొనును. తపస్తపస్యములు శిశిరర్తుమాసములు. ఈ ఋతువునందు ద్రవ్యములు గట్టిపడును.5

---

3. కాళిదాసు మేఘదూతలో 'ఆషాఢస్య ప్రథమదివసే' నభఃకాలములోనిది. అనగా నాడు చాంద్రాషాఢ శుక్లప్రతిపత్తు. మరియు ఋతువుబట్టి నేటి ఆషాఢము. ఈదినము అంబువాచి. దక్షిణాయనారంభము. విశేషము లేనిదే ఇట్టి మాసతిథి గ్రన్థన మనావశ్యకము. చాంద్రాషాఢము సౌరశ్రావణము. 'నభః ఖం, శ్రావణం నభాః,' 'శ్రావణేకు స్యాన్నభాః' అని అమరసింహుడు. అనగా సౌరశ్రావణమున దక్షిణాయన మాయెడిది. వరాహమిహిరుని సమయమునను అంతయే. ఇట్లే కుమారసంభవమునందలి 'సహస్యరాత్రీ రుదవాస తత్పరా' (౫ సర్గ) అను శ్లోకమువలన నేటి సౌరమాఘమున ఉత్తరాయణ మని తెలిసికొనుచున్నాము. నేడు ౨౨ దినముల వెనుక నిది వచ్చుచున్నది. కావున కాళిదాసు +౫౦౦ ఏండ్లకు పిదప లేడనవలెను. వరాహమిహిరుని కన్యసహితపూర్వమును పంచాంగము నవలంబించి చూచినచో +300 అబ్దములకు పిదప నున్నాడని అనుట కెట్టి అవకాశము లేదు.

4. 'సహ్యంతే శక్త్యా యుజ్యంతేఽత్ర ప్రాణిన ఇతి సహాః. 'సహః శక్తా', దీనియందు ప్రాణులు శక్తియుక్తు లగుదురు. తదుక్తం వైద్యశాస్త్రే—'దక్షిణాయనం వర్షా శ్శరద్ధేమంతా. తేషూత్తరోత్తరం బలం వర్ధతే' ఇతి. దక్షిణాయనమునందు వర్షర్తువుకంటె శరదృతువందును నంతకంటె హేమంతమందును ప్రాణులకు బలము వృద్ధి బొందు నని వైద్యశాస్త్రమునందు జెప్పబడినది' అని లింగాభట్టు అమరకోశమున వ్యాఖ్యానించెను. ఇది మార్గశిర్ష పర్యాయము. మూలాభిప్రాయమును వ్యాఖ్యానాభిప్రాయమును గమనించునది. ఈ మాసమునందు మకరాయనము. నాటగోలె తపోమాసము. ఇందు సౌరశిశిరర్తుప్రారంభము. ఇది తొల్లి మాఘమాసముగా నుండెడిది. ఇపుడు మార్గశిర్షములో నగుచున్నది. తపస్తపస్య మధుమాధవ శుక్రశుచి మాసములు ఉత్తరాయణ మాసములు. నభోనభస్య - ఇషూర్జ- సహస్సహస్యమాసములు దక్షిణాయనమాసములు. అయనవిషువములవలన ఈ పండ్రెండు నెలలు అపుడు నిరూపింపబడుచుండి యుండవచ్చును. ఇవ్వేళ సాయననిరయనవిచారమున కాట్టే ఫలము లేదు. ఈ ఋతుమాసములు అమలులోనికి రాకమునుపు అయనగతి తిన్నగా తెలియమి పండ్రెండు సౌరమాసములను దెలుపుటకు ద్వాదశాదిత్యుల పేరులు పుట్టియుండును. అవే ల్లివి: వసంతమున ధాత-అర్యమ. గ్రీష్మమున మిత్ర-వరుణ. వర్షర్తువున ఇంద్ర- వివస్వత్. శరత్తున పర్జన్య-పూష. హేమంతమున అంశ (శ)-భగ. శిశిరమున త్వష్ట్ర - వి(జి)ష్ణు. పురాణకాలమున వైవానిలో రెండు మూడు పేర్లకు పర్యాయభంగ మాయెను. అపుడు వానకారును ఇంద్రాదిత్యమాసము వివస్వదాదిత్య మాస మనియో, లేక నభోమాసము నభస్యమాస మనియో వాడుకొనుచుండియుందురు.

౫. ఋత్వయనములను సాయనమానముచేతను, మాసములను నిరయనమానముచేతను చూచుచో మకరాయనము శిశిరాది, మీనాయనము వసంతాది, వృషభాయనము గ్రీష్మాది, కర్కాటాయనము వర్షాది, కన్యాయనము శరదాది, వృశ్చికాయనము హేమంతాదియు నగును. వరాహమిహిరుడు నాటి సాయనమానముచే ఫాల్గునచైత్రములు వసంత మని అనెను.

.ఇక మాసములగురించి: వసంతాది వత్సరాది యగుచో వసంతాద్యమగు మాఘము చాంద్రవత్సరారంభము. మకరాయనము గల చాంద్రమాసము వత్సరాది యగుచోని మార్గశీర్షము వత్సరారంభము.

ఈ శతపథబ్రాహ్మణమునందే యింకొకచో — 'రథగృత్సరథౌజస్సులు వసంతర్తుమాసములు. రథస్వనరథచిత్రములు గ్రీష్మర్తుమాసములు. రథప్రోతాసమర్థులు వర్షర్తుమాసములు. తార్క్ష్యారిష్టనేములు శరదృతుమాసములు. సేనజిత్సుషేణులు శీతర్తు మాసములు. తపస్తపస్యములు హేమంతర్తు మాసములు' అని కలదు.

ఈ శతపథమునందే మరియొకచో ఋతువు లయిదని కలదు. ఈ గణనమునందు హేమంతము లేదు. అందే మరియొకట మూడే ఋతువు లని కలదు. నాలుగు నెలలొక ఋతువుగా గొని యిట్లు చెప్పియుండవచ్చును. లేక మూడు ఋతువు లున్న ప్రాంతములో నున్న విషయమిది కావచ్చును. అందే ఇంకొకచోట 'ఋతువు లారే కాని పదమూడవ మాసములో, అనగా మలమాసములో రేయుంబవళ్లు నొక ఋతువుగా గ్రహించి ఋతువులే డనియు ననవచ్చు'నని కలదు.

మధుమాధవాదినామములు చాలకాలము క్రిందట ప్రచారములో నుండెను. పిదప నవి మారి చైత్రవైశాఖాదులు వాడుకలోనికి వచ్చెను. ఈమార్పు ఎపుడు జరిగియుండును?

మధుమాధవాదిపదములు ప్రకృతిధర్మమును చెప్పును. అనగా ఆకాలమున చెట్లు పూచును. ఆ పూవులలో తేనెయుండును అను నీరీతి వ్యుత్పత్తికలవి. ఇక చైత్రవైశాఖాదిపదములు చిత్రానక్షత్రముతో కూడిన పున్నమ కల నెల యనియు, విశాఖానక్షత్రముతో గూడిన పున్నమ కల నెల యనియు ఈరీతి వ్యుత్పత్తి కలవి. కావున మధ్వాదిపదములకంటె చైత్రాదిపదములకు జ్యోతిర్వివేకముతో సంబంధ మున్నది. దీనినిబట్టి వ్యతిరిక్తప్రమాణము దొరకనంతవరకును మధుమాధవాది వ్యవహారము ప్రాచీన మని అనుకొనవచ్చును.

వసంతము ఋతుముఖముగా పరిగణితమయినపుడు (తైత్తిరీయసంహితాబ్రాహ్మణాదుల సమయము) మధుమాధవాదినామములు చైత్రవైశాఖాములకు మారి యుండును. పురాణములందును, సాహిత్యగ్రంథములందును చైత్రవైశాఖములు వసంతర్తుమాసము అని కలదు. కాని అటుతరువాత జ్యోతిషసిద్ధాంతములు ఫాల్గునచైత్రములను వసంతర్తుమాసములనుగా చెప్పెను. ఏ జ్యోతిశ్శాస్త్రముగాని, ఏ సాహిత్యగ్రంథముగాని వైశాఖజ్యేష్ఠములను వసంతర్తుమాసము లనిగాని, ఫాల్గునచైత్రములను హేమంతర్తుమాసము లనిగాని చెప్పలేదు. కావున వెనుక నెప్పుడో చైత్రవైశాఖములు వసంతర్తుమాసము లని వాడుకలో నుండె ననియు, అంతకు వెనుక ఆ చైత్రవైశాఖములే మధుమాధవమాసములుగా ప్రచారములో నుండెననియు తేలుచున్నది. ఇప్పుడు ఉత్తరదేశములో ఫాల్గునచైత్రములే వసంతర్తువని వ్యవహారము.

అయనచలనమున జేసి వసంతర్తువింత వెనుకకేగనని విస్పష్టముగా తెలియుచున్నది. అయనచలనపు లెక్కనుబట్టి సుమారు నాలుగయిదువేలయేండ్ల నడుమ ఈమార్పు జరిగియుండు నని చెప్పవచ్చును. కాగా ఈ చైత్రవైశాఖాదినామములు శకాబ్దారంభమునకు సుమారు రెండువేలయేండ్లవెనుక. ఆకాలమున వసంతము ప్రథమర్తువు. ఆగ్రయణేష్టియు అర్ధవార్షికయజ్ఞము మొదలగున వన్నియు అపుడే చేయబడవలయు నను వ్యవస్థ నా డేర్పడెను. 'సంవత్సర మొక పిట్ట. వసంతము దాని తల. గ్రీష్మము దాని కుడిరెక్క. శరత్తు ఎడమరెక్క. వర్షర్తువు తోక. హేమంతము పొట్ట' అని తైత్తిరీయబ్రాహ్మణము వసంతమును ఋతుముఖమునుగా వర్ణించెను. మరియు తైత్తిరీయసంహితలో వసంతము ఋతుముఖ మని కలదు. అపుడు ఫాల్గునపూర్ణిమ సంవత్సరమున కారంభకమై యుండెను.

సూర్యసిద్ధాంతము శిశిరమును మొదటి ఋతువుగను, హేమంతమును చివర ఋతువుగను చెప్పెను. ఆర్యభటుడు లగధాచార్యుని వ్యవస్థనే అంగీకరించెను. ఆరవ శతాబ్దివాడగు వరాహమిహిరుడు ఫాల్గునమునుండి విషువమునుండి సంవత్సరారంభము చేసెను. దీనినిబట్టి చూచినచో ప్రాచీనసూర్యసిద్ధాంతమునుండి ఆర్యభటుడీ యంశము చేకొనియుండు నని ఊహింపవచ్చును.

భాస్కరుడు సిద్ధాంతశిరోమణిలో వసంతర్తువును మొదటి ఋతువునుగా గ్రహించి వరుసగా అన్ని

ఋతువులను కవులకన్న మిన్నగా వర్ణించుకొనుచు బోయెను.

ఇపు డొక్కసారి మనము వెనుదిరిగిచూచినచో ప్రాచీనజ్యోతిషికులు - సంవత్సరారంభమునకును, ఋత్వారంభమునకును మాసారంభమునకును, ఎంత పరిశ్రమించిరో, మరియు అయనచలనమునుగురించి వారు చూపిన ప్రజ్ఞ యంత్రములకుగూడ ఎంత ఆశ్చర్యము కలిగించునో తెలిసికొనగలము.

మన దేశములో నిపుడు చైత్రమాసముతో సంవత్సరారంభము, వసంతర్త్వారంభమునుగదా, ఈ పై భేదమంతయు నేమిటి? అని సామాన్యపాఠకునకు తోచవచ్చును. కావున మన దేశములో వాడుకలో నున్న కాలమానమును కొంచెము చూపుదుము.

చాంద్రసౌరభేదముచే సంవత్సరము రెండు విధములు. అమావాస్యనుండి అమావాస్యవరకుగల కాలము చాంద్రమాసము. పండ్రెండు చాంద్రమాసములొక చాంద్రసంవత్సరము.

సూర్యుడు రాశిచక్రము తిరిగివచ్చు కాలము సౌరసంవత్సరము. సాయననిరయనభేదముచే సౌరసంవత్సరము రెండు విధములు. మేషాయనమునుండి (మార్చి ౨౦) మేషాయనమువరకు నగు కాలము సాయనసౌరసంవత్సరము. మేషసంక్రమణమునుండి (ఇపుడు ఏప్రిల్ ౧౩ లో నగుచున్నది) మేషసంక్రమణము వరకు నగు కాలము నిరయనసౌరసంవత్సరము. ఆంధ్రులును, మహారాష్ట్రులును వ్యవహరించు ప్రభవాది సంవత్సరములు చాంద్రమాసములచే నగుచున్నవి. వీనిలో అధికమాసములును, క్షయమాసములును పరిగణనమున్నది. అట్లగుటవలన ఇవి నిరయనసౌరసంవత్సరములే ఐనవి. పూర్వకాలమున మన దేశమునందు సాయనవ్యవహారము నిరయనవ్యవహారముగూడ నున్నటులు కనబడును. ఈ రెంటిలో సాయనవ్యవహారమిపుడు లోపించెను. ప్రకృతము నిరయనసౌరసంవత్సరమే వాడుకలో నున్నది. మనకు నిరయనసంక్రాంతులచే మాసనిర్ణయము నిరయనమేషారంభము అశ్విన్యాదిని స్థిరము.




[దీనిలో దక్షిణాయన వృత్తార్ధములో అథోముఖముగా నున్న శరచిహ్నను ఊర్ధ్వముఖముగా గ్రహించునది.]

## నవ్యవైజ్ఞానికులు

మేము వ్యవహారములలో నున్న క్రీస్తుసంవత్సరములు సాయనములు. ఇంగ్లాండు దేశమున ఋతువులు నాలుగు. మన గ్రంథములలో మూడు, ఐదు, ఆరు, ఏడు ఋతువులని యున్నదిగాని నాలుగని యొచటను లేదు. ఇది గమనింపదగిన విషయము.

భూమియక్షము సూర్యునికేసి ౨౩½° డిగ్రీలు వంగియున్నది. మరియు నా యక్షము ఎప్పుడును ధ్రువదర్శనము చేయుచుండును. భూకక్ష అండాకృత్యాకారము. కావున భూగోళమున ఋతువులు కలుగుచున్నవి. దేశభేదముచే, మరియు భూచలనముచే ఋతువులలో మార్పు కలుగుచుండును. మనదేశమున ఋతువులారు.

వాసంతవిషువము మొదలుకొని మూన్నెలలవరకు రవి ఉత్తరముగ జరగుచున్నట్లు కనబడును. అపుడు పగళ్లు పెరిగి రేయి తరగుచుండును. ఉత్తరధ్రువము క్రమక్రమముగా-రవిదెస మొగ్గుచుండును.

జూన్ ౨౧ టవ నాడు కర్కాటకరేఖ సూర్యునకెదుట నుండును. ఇదే కర్కాటాయనము. కర్కాటసంక్రాంతి జూలై ౧౬. ఉత్తరకపాలమున సంవత్సరమంతటిలో ఈ ౨౧ వ జూన్ దినమున పగలు హెచ్చు. రేయి లోచ్చు. ఈనాడు లండనులో ౩-౪౫ నిమిషముల కుదయము. ౮-౧౮ అస్తము. నా ఉత్తరధ్రువసమీప భూమిలో ఇరువదినాలుగుగంటలును పగలు. ఇది మనకు గ్రీష్మము.

జూన్ ౨౨ నుండి సూర్యుడు దక్షిణమునకు తిరుగును. భూమధ్యరేఖ సెప్టెంబరు ౨౨ న సూర్యున కెదురగును. ఈ కాలమున ఉత్తరకపాలమున పగళ్లు




ఈ పటమున ఆరు ఋతువులు కనబడును. మార్చి ౨౦ లేక ౨౧ వాసంతవిషువము మేషాయనము. నాడు ధ్రువద్వయము రవికి సమదూరమున నుండును. ఈనాడు రేయుంబవళ్లు సమము. ఉదయాస్తములు సరిగ తూరుపు పడమటలనే జరగును. ఇది ఈ దేశమున వసంతము.

తరగును, రేలు పెరుగును. ఈనాడు మరల ధ్రువద్వయము రవికి సమదూరములో నుండును. ఈనాడును రేయుంబవళ్లు సమము. ఇక యామ్యకపాలమున ఎండలు మొదలు. రేలు తగ్గి పగళ్లు హెచ్చును. ఇది మనకు శరదృతువు.

సెప్టెంబరు ౨౩ మొదలుకొని మార్చి ౨౧ వరకు యామ్యకపాలమున ఎంత లెక్కుడు. డిసెంబర్ ౨౧ న మకరము రవి కెదురు. మనకు ఏడాదిపొడు గులో నేడు పగలు తక్కువ. రేయి ఎక్కువ. నేను మకరాయనము. (జనవరి ౧౩ మకరసంక్రాంతి) మకరాయన మగు మార్చి ౨౧ నాడు లండనులో ౪-౬ నిమిషముల కుదయము. ౩-౫౧ నిమిషములకు అస్తమయము. ఇది మనకు హేమంతము. నేఁడు దక్షిణ ధ్రువప్రాంతమున ౨౪ గంటలును పగలే. ఉత్తరధ్రువ ప్రాంతమున ౨౪ గంటలును రాత్రియే.

## వారములు

మన దేశమున రవిసోమాదిసప్తవారవిభాగమున కొంతమాత్రము ప్రయోజనము లేదు. దీనికి మూలము ఫలజ్యోతిషమున విశ్వాసము. వారమును మరచుచో దాని నుద్ధరింపగల నైసర్గికోపాయము లేదు. సప్తసంఖ్య వలన పక్షముగాని మాసముగాని సంవత్సరముగాని సమానముగా విభజింపబడదు. సప్తవారవిభాగము అవైజ్ఞానికము. ఎన్నిదినములచే పక్షవిభాగము తొల్లి చేయబడుచుండెడిదో చెప్పజాలము. అష్టకము గణించి రెండుభాగములుగా చేయబడుచుండవచ్చును. అష్టకము మీద నాదరమున కది యే కారణము కావచ్చును. తరువాత పంచరాత్రము, లేక పంచాహము గణ్యమగుచుండెను. ఈ విభాగము వైజ్ఞానికము. పక్షమాససంవత్సరముల దినసంఖ్య 'ఐదు'చే విభాజ్యము. దక్షిణ-అమెరికాలోని పెరు దేశమునందలి ఇంకా జాతివారి పూర్వపురుషులు పంచాహముచే మాసవిభాగము చేయువారని తెలియుచున్నాము. నేటి రుషియా సప్తాహము వదలి పంచాహము నవలంబించె నని వినికి. కౌటిల్యుని అర్థశాస్త్రమునందు సప్తవారవిభాగము లేదు. పంచరాత్రవిభాగ మున్నది. యవనఫలజ్యోతిషమునకు అంగభూతమగు సప్తవారవిభాగ మీ దేశమునకు దిగుమతియాయెను. ఇది +౧ వ శతాబ్దిలోనో +౨ వ శతాబ్దిలోనో. వాయుపురాణమునందెచటనేని రవి సోమాది వారముల పేళ్లు లేవు. అమరకోశమునందును లేవు. కావున దిగుమతియయిన యీ సరకు తొందరగా మన దేశమున పాతుకొనలే దని యూహింపవచ్చును.

## దినము

కాలమాపకమునకు దిన మనునది ఏకకము (Unit). ఇది మార్పరాని దని పలువుర తలపు. కాని తెలివిమీరినకొలదిని పలురకము లగు దినము లేర్పడెను. మొదట నాక్షత్రదినము. ఒక నక్షత్రము ధ్రువము చుట్టును ఒకసారి తిరుగుకాలము (౨౩ గంటల ౫౬ నిమిషముల ౪౦.౯ సెకనులు) నాక్షత్రదినము. సామాన్య వ్యవహారములో సౌరదినమే సహజము. సూర్యుడొక మధ్యాహ్నమునుండి మరియొక మధ్యాహ్నమునకు వచ్చుకాలము సౌరదినము (True Solar). కాని యిది ఋతువుతోపాటు మారును. పొడుగుపొద్దు గల దినమునకును, పొట్టిపొద్దు గల దినమునకును ౫౧ సెకనులు తేడా. పలుశతాబ్దులనుండి దీనికే నిత్యవ్యవహారము.

లంకలో సూర్యోదయము దినారంభముగా ఆర్యభటుడు చెప్పెను. వరాహమిహిరుడు నడిరేయి నుండి దినారంభము స్వీకరించెను. ఈ దేశ సూర్యోదయమునుండియు మధ్యాహ్నమునుండియు సూర్యాస్తమునుండియు నడిరేయినుండియు దినారంభము కనబడుచున్నను సూర్యోదయమునుండియే దినారంభము పరిగణితమగుచున్నది. 'ఉదయా దుదయం వారః'. దీని యంతర్భాగములు కొంచెము పరికింతము.

'ప్రాహ్ణము మధ్యాహ్నము అపరాహ్ణము సాయాహ్నము' అను నాలుగు భాగము లొకటను, 'ఉష మధ్యాహ్నము అపరాహ్ణము సాయాహ్నము సంగవము' అను ఐదు భాగము లింకొకటను ఈదినములో కనిపించును. సంగవ మనగా పాలుపితుకు కాలము. దినము ౧౫ ముహూర్తములు. రాత్రి ౧౫ ముహూర్తములు. ౧౫ ప్రతిముహూర్తము లొక ముహూర్తము. ఇంతియే కాక కాలము కాష్ఠాకలానిమేషాదులచే పరిచ్ఛిన్నము చేయబడెను. మహాభారత మహోరాత్రములను లవకాష్ఠాకలాముహూర్తాములచే విభజించెను. మరియు నాడికాపలమాషద్రోణాఢకాది విభాగములే కాక యింకెన్నియో కలవు. '౩౦ ముహూర్తము లొక అహోరాత్రము. ౧ ముహూర్తము = ౧౫ ప్రతిముహూర్తములు లేక ౩౦ త్రుటులు. ౧ త్రుటి = ౩౦ కలలు. ౧ కల = ౩౦ లవములు. ౧ లవము ౧౨ నిమేషములు' అని అథర్వశ్రుతి.

ఇక కాలప్రవాహము నెరుగ వలెదము. సంహితలందును, బ్రాహ్మణములందును యుగముల మాట కలదు. ఋగ్వేదమునందు ప్రకృతార్థమున యుగపదము లేదని అనుకొనువారు అథర్వవేదమునందు మాత్రము చూచి తృప్తిపడవలెను. ఏదో ఒక కాలవిభాగమును జెప్పు యుగమహాయుగవ్యవహారము వైదికవాఙ్మయమునందంతటను గలదు. తైత్తిరీయబ్రాహ్మణము అయిదేండ్లు ఒకయుగ మని చెప్పెను. వేదాంగజ్యోతిషమున లగధుడు దానిని పదిలపరచెను. ఆ యేండ్లకు ఇవి పేళ్లు: సంవత్సరము పరివత్సరము ఇదావత్సరము ఇద్వత్సరము లేక అనువత్సరము. నాలుగేండ్లు ఒక యుగ మనియు, ఆరేండ్లొక యుగ మనియు గూడ గొందరి కభిప్రాయమున్నది. ఆరవ ఏటి పేరు ఇదు వత్సరము. ఈ యుగముల ఉద్దేశముగూడ ఈ అయిదారేండ్ల నడుమ నొక అధిమాసమునుగాని, మలమాసమునుగాని యిరికించుటకై యున్నది. ఏదేశమునందును వాడుకలేని అనంతకాలాలోచనము భారతీయులలో కనబడును. నిత్యవ్యవహారములో దానికి ప్రయోజనము లేకున్నను తుదమొదలు లేని యీ కాలమును శాస్త్రీయవ్యవహారమున నుపయోగించుటలు చేసి ప్రాచీనకాలజ్ఞులు తరతరములవారిని కృతజ్ఞతాపాశముచే బంధించిరి.

‘రేయింబవళ్లకు రవియే కారకుడు. ఇవి రెండువిధములు. ఒకటి మానవులకు. రెండవకటి దేవతలకు. పగలు పనికి. నిసి నిద్రకు. మానవుల ఒకనెల పితౄళ్లకు రేయింబగలు. ఈ నెలలో వెన్నెలరేలును, చీకటిరేలును ఉండును. వెన్నెలరేలు పనికి. చీకటిరేలు నిద్రకు. మానవుల ఒక ఏడు దేవతలకొక అహోరాత్రము. ఇదియు ఉత్తరాయణ మనియు దక్షిణాయనమనియు విభక్తము. ఉత్తరాయణము వారికి పగలు; దక్షిణాయనము రాత్రి. దేవతల ౪,౦౦౦ ఏండ్లు కృతయుగము. దీని ఆదని ౪౦౦ ఏండ్లు. అంతమున ౪౦౦ ఏండ్లు. పదపటి త్రేతాద్వాపరకలియుగములు క్రమముగా దేవతల మూడువేల రెండువేల ఒకవేయి యేండ్లు. వీని ఆరంభశేషాంశములు క్రమముగా మూడు రెండు ఒక నూరు ఏండ్లు. ఈ నాలుగుయుగముల సమిష్టి బ్రహ్మకొక దినము. రేయియు నంతే. ఈ కాలమునకు ౭౧ రెట్లు కాలము ఒక మన్వంతరము. లెక్కపెట్టరేని మన్వంతరములనడుమ సృష్టిప్రలయములు సంభవించిపోవుచున్న’ వని మనువు చెప్పెను.

సూర్యసిద్ధాంతము ప్రథమాధ్యాయమున నిటులున్నది: ‘౧౨ సౌరమాసము లొక సౌరవత్సరము. ఇది దేవతల కొక దినము. దేవతల ఒక అహోరాత్రము అసురులకు[4] ఒకరాత్రిందివము. ఇట్టి ౩౬౦ అహోరాత్రములు దేవతలకును, అసురులకును ఒక యేడు. ఇట్టి ౧౨,౦౦౦ ఏండ్లు కృతత్రేతాద్వాపరకలిసమిష్టి. ఈ నాలుగు యుగములును, వీని సంధ్యాసంధ్యాంశములు కలసి ౪౩,౨౦,౦౦౦ సౌరవత్సరములగును; వీని పదింట నాలుగు పాళ్లు, మూడు పాళ్లు, రెండు పాళ్లు, ఒక పాలు క్రమముగా కృతత్రేతాద్వాపరకలియుగములు; వీనిలో ఆరవ పాలు యుగసంధ్యాసంధ్యాంశములు; ఈ నాలుగు యుగములు కలిసి ఒక మహాయుగము. ౭౧ మహాయుగములు అనగా ౩౦,౬౭,౨౦,౦౦౦ సౌరవత్సరములు ఒక మన్వంతరము. అనగా ఒక మనువు ఉండు కాలము. ఈ మనుకాలశేషమున ౧౭,౨౮,౦౦౦ సౌరవత్సరములు (ఒక కృతయుగసౌరాబ్దపరిమాణము) మన్వంతరసంధికాలము. ఇట్టి పదునాలుగు మన్వంతరములును, వీని సంధికాలములును కలిసి ఒక కల్పము. దీని ఆరంభమున సంధికాలము కృతయుగముతో పాటు.’

ఈరీతి కాలవిభాగము వేదములలో నెచటను లేదు. పదపటి పురాణములందును, సంహితలందును కలదు. కల్పకల్పనలో నొక విశేష మున్నది.

౧ కల్పము=౧౪ మన్వంతరములు+౧ కృతయుగము=౧౪ (౭౧ మహాయుగములు+౧ కృతయుగము)+౧ కృతయుగము; ఒక మహాయుగము=౧౦ × ౪,౩౨,౦౦౦ ఏండ్లు; కృతము × ౪ × ౪,౩౨,౦౦౦ ఏండ్లు; ఒక మన్వంతరము ౭౧౦ × ౪,౩౨,౦౦౦ + ౪ × ౪,౩౨,౦౦౦ ఏండ్లు; కావున ఒక కల్పము = (౧౪ × ౭౧౪ + ౪) × ౪,౩౨,౦౦౦ ఏండ్లు = ౪౩౨ ౦౦౦ ౦౦౦౦.

ఇందు ౭౧౪ ను గుణకముగా గ్రహించుటలో అయనాంశవిచారము కలదని బ్రేనేండ్ మొదలగు పాశ్చాత్యపండితులు భావించిరి. ౭౧౪ ఏండ్లలో ౧౦ డిగ్రీల అయనాంశమును ఒకయేడాదిలో ౫౦.౪ సెకనుల అయనాంశమును ఉండును. కావున కల్పకల్పనము జల్పనముకాదు; మరి అయనాంశపరిమాణము భాగగర్భితముగా వ్యాకరించుటయే.

౪. ఉత్తరమేరువాసులు దేవతలు. దక్షిణమేరువాసులు అసురులు.

# కృష్ణరాయబారము

శ్రీ పున్నవ లక్ష్మీనారాయణ

కర్మసిద్ధాంతము సంగీకరించినవారైనను భగవంతుడు మనకు పనులు చేసిపెడతాడని అంగీకరించరు. ప్రతికార్యమునకు పురుషకారము అను పాల్లును, దైవము ఒకపాలు నని భారతమే చెప్పుచున్నది. ఈ దైవసహాయముగూడ ఫలప్రాప్తియందు తోడ్పడును గాని కార్యకరణమును గాదు. భగవంతుడైయున్న కృష్ణుని కీ సహాయముననా యని వాదించువారికి ఈ విషయము మరచిపోవుచున్నారు. కనుక మనము శ్రీకృష్ణుడు సంధిపొసగించుటకు మానవ్యప్రయత్నములో చేయగలిగినదంతయు చేసినాడా, లేదా యనిమాత్రమే చర్చించవలసియున్నది. దుర్యోధనుడు సంధికి ఒప్పుకొనడని అందరు అనుకొనే విషయమే. ఉత్తరగోగ్రహణ సమయమున మొట్టమొదటి సారి భీష్మద్రోణులు సంధి ప్రశంస దెచ్చినప్పుడు దుర్యోధనుడు రాజ్యభాగమీయనని స్పష్టముగ జెప్పినాడు. ద్రుపద పురోహితుడు రాయబారమునకు వచ్చినప్పుడును, ధృతరాష్ట్రుడు తనతో సలహాపడినప్పుడెల్లను, సంజయుని రాయబారమునకు బంపునపుడును, అతడు తిరిగివచ్చి ధర్మరాజు ఐదూళ్లయినను పుచ్చుకొనుటకు ఒప్పుకొని సంధికి సుముఖుడైయున్నాడనియు, లేనిచో భీమార్జునసహాయముగ మహాయుద్ధమునకు సంసిద్ధుడయి యున్నాడనియు, పాండవులకు కృష్ణసహాయముండుటచే వారికి విజయము తప్పదనియు చెప్పినప్పుడుకూడ ససేమిరా అన్నాడుగాని సంధిమాటలాడలేదు. చివరకు వ్యాస భగవానుడు ధృతరాష్ట్రునిచే నాహ్వానింపబడి పాండవపక్షమున శ్రీకృష్ణుడుండుటచే వారికి విజయము తప్పదనియు, సంధి చేసికొనవలసినదనియు సలహాయిచ్చినపుడు శ్రీకృష్ణుడు అర్జునునికి స్నేహితుడట, ఈ స్వల్ప కార్యానికి ఆయనను నేను ఆశ్రయిస్తానా అన్నాడు. ప్రాయోపవేశసమయమున రాక్షససభలో విన్నదానిని బట్టి కృష్ణుడు తమపక్షమునకు శత్రువనియు, అతడు తన విజయమునకు భంగము చేయలేడనియు తలచెను. మీదు మిక్కిలి వ్యాస సంజయ ధృతరాష్ట్రులతోడి సంభాషణలను బట్టి పాండవులకు శ్రీకృష్ణుడాధారమనియు, అతడు రాయబారమునకు వచ్చినప్పుడు దారిలోనో, లేక హస్తినాపురములోనో పట్టుకొని గాని, లేక విషప్రయోగము జేసిగాని చంపివేసినయెడల పాండవులు నిరాధారులై యుద్ధమే తలపెట్టరని నిశ్చయించుకొని తత్ప్రయత్నములు జేసినాడు.

ఇక ధర్మరాజునకు దుర్యోధనుని నిజస్థితియంతయు దెలియును. ప్రపంచచరిత్రలో గాంధీమహాత్మునితో పోల్చదగిన వ్యక్తి ధర్మరాజొక్కడే. తన హక్కులు వదలడు. సంధి కెప్పుడూ సిద్ధమే. ధర్మమార్గము దప్పడు. అహింస ఉత్తమసాధనముగ స్వీకరిస్తాడు. లోకచరిత్రలో యుద్ధములు, రాయబారములు జరిగినప్పుడెల్లను రెంటి నిమిత్తము ప్రయత్నములు ఏకకాలముందే జరుగుతుంటవి. రాయబారములు జరుపుతూ యుద్ధప్రయత్నములు చేయుటను సంధిపొసగుటకు ప్రతిబంధకము కాదా యని ప్రశ్నింపవచ్చును. యుద్ధప్రయత్నములు సంధి పొసగుటకు ప్రతికూలము కావని నా సమాధానము. పైగా యుద్ధప్రయత్నములే సంధికి తోడ్పడతవనియు చెప్పవచ్చును. శత్రువు బలవంతుడుగ నున్నప్పుడు సంధి పొసగనిచో యుద్ధము సంభవించి అపజయము కలుగునేమో యని సందేహము కలిగి సంధి జరుగుట కెక్కువ అవకాశమిచ్చును.

కృష్ణుడు రాయబారమునకు బయలుదేరునప్పటికే భరతఖండములోని రాజులెల్లరును ఏపక్షమున నెవరు చేరునదియు తెలిసిపోయినది. సామాన్యదృష్టితో జూచువారలకు ఉభయసైన్యములును తమకే విజయము గలుగునని భావించుచుండిరి. ఉభయపక్షములలోని

వీరులయొక్క బలపరాక్రమములను లెక్కించుకొనుచు ఎవరు ఎవరిని జంపవలయునో వాటాలు వేసికొను చుండిరి. ఉభయపక్షముల తేడాలు చెప్పుమని దుర్యోధనుడు సంజయు నడిగితే, అటు కృష్ణు డున్నాడు, మీవైపున అతనికి ఈడు ఎవ రని అన్నాడు. అందు చేతనే కృష్ణుని చంపితే మనము తప్పక గెలుస్తా మను కున్నాడు దుర్యోధనుడు.

ధర్మరాజుకు దుర్యోధనుడితో సంధి కుదురు తుందని నమ్మకము లేదు. కృష్ణుడు సంజయునితో సంధికి నేనే వస్తానని చెప్పేటప్పటికి ధర్మరాజు కాళ గలిగింది. ఐ దూ ళ్లిచ్చినా చాలునని ఇది వరకే అన్నాడు. ఇప్పుడు నీయిష్టము వచ్చిన షర తులతో సంధిచేసికొని రమ్మనమని సర్వాధికారము కూడ యిచ్చాడు. అన్నిటికంటే ఆశ్చర్య మేమంటే: కౌరవుల మాట యెత్తితే నిప్పులుచెరిగే భీముడు "పాడు యుద్ధము వద్దు. ఏలాగయినా సంధిచేసికొని" రమ్మ న్నాడు. అర్జునుడుకూడ ఆలాగే మెత్తబడి మాట్లా డాడు. కుర్రవాడు నకులుడుకూడ సంజయుడు రాక పూర్వ మున్న యుద్రేకము తమ మనస్సులలో లేదనియు, ఏలాగయినా సంధి కూలవేసికొనిరావలసిన దనియు విసుగుతో చెప్పాడు. ద్రౌపది మొదట తీవ్రంగా మాట్లాడినా చివరకు జారి నామనసులో వున్న క్రోధంకొద్దీ మాట్లాడితి నని, మీ అందరికీ యుక్తమని తోచినప్రకారము చేసికొనిర మ్మన్నది. సాత్యకి, సహదేవులు మాత్రం బిరగబడ్డారు. పెద్దశిరం గులు సద్దుమణిగితే చిన్న టపాకాయలు పేలి ప్రయోజనమేమి? కాని కృష్ణుడికే ఆశ్చర్యం వేసింది. సంధి కుదరక తాను తిరిగి వస్తే వీళ్లంతా యుద్ధ మక్కరలేదు, అడవులకే తిరిగిపోదా మని అనేటట్లు కనుపడ్డది. ఇది రహస్యసంభాషణగూడ కాదు. యుద్ధా నికి తోడువచ్చిన రాజలోకమంతా విన్నది. వారంతా నిరుత్సాహపడి వెళ్లిపోతా రని భయపడవలసినట్లు కను పడింది. ఈ మాటలే శత్రువులే వింటే సంధికి పోయి నప్పుడు నీళ్లుకూడ పుట్టేటట్లు లేదు. సంధికి పోయి ప్రయోజనమే ఉండ దనుకున్నాడు. కూలబడిపోయిన భీమార్జునులను లేవదీసి కర్రలతో పోటుబెట్టి నిలుపబెట్టాడు. తిరిగి యుద్ధరక్ ప్రాణంపోశాడు. నేను రాయబారానికి వెళ్లితే సంధి అయితీరుతుందని మీ రనుకుంటున్నారు. ౧౦౦ కి ౯౯ పాళ్లు యుద్ధమే ఖాయమన్నాడు. అప్పుడు సమావేశమయిన రాజులంతా సంతోషించారు.

ఇదంతా జరిగి తీరా ప్రయాణంకాబోయేసరికి పెద్ద చిక్కొకటి తటస్థించింది. ధర్మరాజుయొక్క శుద్ధ సాత్వికబుద్ధికి రాబోయే పెద్ద విపత్తు గోచరమయింది. దుష్టులయిన కౌరవులు కృష్ణుని ప్రాణానికే మోసం తెస్తా రని గోచరమయింది. అసలు ప్రయాణమే వద్దన్నాడు.

"కుటిలమతు లవినీతులు క్రూరకర్ము
లట్టి నీచుల కడకు నిన్ననుపజాల!
నీవు సంకటపడియేడు దేవపదవి
యైన నే నొల్ల నొంటి యందరును బుడుగు".

అని ధర్మరాజనేరకు కృష్ణుడు గ్రహించి "నీ భావము నే గ్రహించాను. నాకు కోపము వస్తే నన్నెది రించగలవాం డెచ్చట నున్నాడా? అయినా ఆత్మరక్ష ణకు తగిన ఏర్పాట్లతోనే వెళ్లుతా"నని తన శంఖచక్రాది యుద్ధసాధనములు రథములో బెట్టించుకొని, తనకు శిష్యుడును, అతిరథశ్రేష్ఠుడు నయిన సాత్యకిని అంగరక్ష కునిగా వెంట దీసికొని బయలుదేరాడు. వెళ్లుతూ కృష్ణుడు ధర్మరాజుతో ఆఖరున చెప్పిన మాటలు గమ నింపదగియున్నవి:

"అన విని, కౌరవులకును మీ
కును హితము ప్రియంబు జేయగోరియు కుంతీ
తనయాగ్రజు పని ధృతరా
ష్ట్రునికడకుం బోయెదను కడుం బ్రీతి మెయిన్"

ప్రయాణమాతూ చెప్పిన యీ పద్యములోని భావమును బట్టి పైన భీమార్జునులను యుద్ధమునకు బురి కొల్పిన వాక్యములు సంధిపొసగుటకే యనియు, సంధి పొసగించు విషయమై అయనభావమేమియు మారలే దనియు స్పష్టపడుచున్నది.

ఉపప్లావ్యంనుంచి ప్రొద్దుననే బయలుదేరారు. సాయంకాలానికల్లా వృకస్థలం చేరుకున్నారు. ఇది పూర్వం యాదవుల పట్టణం. ఊరివారంతా వచ్చి ఆహ్వా

నించారు. వూళ్లో జనసమ్మర్దంగా వుంటుంది; రాత్రి వూళ్లో నిద్రించనన్నాడు. వూరిబయట బహిరంగస్థలములో డేరాలు వేయించుకొని వూళ్లోకి బోయి ముఖ్యులను జూచి పొద్దుగూకేవరకు డేరాలకు వచ్చి భుజించి యచ్చట నిద్రించారు. ఉదయం తిరిగి ప్రయాణం సాగింది.

కృష్ణుడు వస్తున్నాడని హస్తినాపురంలో తెలిసింది. ఊరంతా ఉత్సవం సాటించారు. బ్రహ్మాండంగా అలంకారాలు చేయించారు. కొన్ని మైళ్ళ దూరములో వున్న వృకస్థలంలోనే పందిళ్లు వేయించి ఆహ్వానాలు చేశారు. కృష్ణుడు ఏవి కావాలంటే అవన్నీ బహుమతులిస్తా నన్నాడు ధృతరాష్ట్రుడు. ధర్మరాజుకు ఐదూళ్లే యివ్వలేని వాడవు, ఇన్ని యెట్లా ఇస్తావని దెప్పాడు విదురుడు. లంచాలకు కృష్ణుడు లొంగడు; అతడు కోరిన సంధిమరతు లంగీకరించవలసిం దన్నాడు భీష్ముడు. మర్యాదలు చేస్తాగాని,లంచములూ ఇవ్వను; ధర్మరాజును భాగమూ పెట్ట నన్నాడు దుర్యోధనుడు. మరియు ఇంకొక రహస్యంకూడా బయటపెట్టాడు దుర్యోధనుడు. ముందు తన ప్రాయోపవేశసమయములో రాక్షససమాపములో జరిగిన విషయములు ఇట్లని చెప్పకుండా బయట పెట్టాడు. పాండవుల కేడుగడయయిన కృష్ణుని పట్టి బంధించితే, రెక్కలు విరిగిన పులుగులై పాండవులు తనకు లోబడుతారనీ, యాదవ, పాంచాల ప్రభృతులయిన పాండవబంధుమిత్రులు తనకు వశులవుతారనీ, అప్పుడు తను లోకమునకెల్ల ఏలిక నవుతాననీ చెప్పివేశాడు. ఇది జగద్ద్రోహమని తిట్టాడు ధృతరాష్ట్రుడు. ఇంతపని యితడు చేసినను, చేయలేకున్నను ఈ దుష్టవాక్యములు విననేలే నని లేచిపోయినాడు భీష్ముడు.

ఇంత జరిగినను ఏమియు జరుగనట్లే ఆహ్వానపు టేర్పాట్లు జరుగుతున్నవి. పెద్ద కొలువుకూటం సభకోస మలంకరించారు. దుర్యోధనదుశ్శాసనభవనాలలో కృష్ణసాత్యకులకు బస లేర్పాటుచేశారు.

అక్కడ శ్రీకృష్ణుడు వృకస్థలములో ఊరిబయటి డేరాలలోనే నిద్రించి తెల్లవారి కాల్యాలు తీర్చుకొని బయలుదేరాడు. దారిపొడుగునా ఆహ్వానములు జరిగినవి. ప్రతిమజిలీలోను పిండివంటలు, పండ్లు దుర్యోధను డుంచజేశాడు. అవన్నీ శ్రీకృష్ణుడు పుచ్చుకున్నాడుగాని ఒక ముక్కగూడ తానుగాని, తనవాండ్లుగాని తినలేదు. హస్తినాపురం చేరారు. ధృతరాష్ట్రదుర్యోధనులు దప్ప తక్కినవారందరు స్వయంగా వచ్చి ఆహ్వానించారు. హస్తినాపురమంతా పొంగివచ్చి ఆదరించింది. సరాసరి ధృతరాష్ట్రునింటికి బోయినారు. అన్యోన్యం కుశలప్రశ్నలు జరిగినతర్వాత శ్రీకృష్ణుడు లేచి విదురునింటికి వెళ్లి, తాను తరువాత పోవలసిన ఇతర చోట్లకు వెళ్లుతా నన్నాడు. ఎవ్వరూ కాదనలేదు. దుర్యోధన దుశ్శాసనుల ఇండ్లలో బసలు ఏర్పాటుచేశామని చెప్పలేదు. ఇదివరకు జరిగిన విషయము లందరికీ తెలుసును గనుక మాట్లాడలేదు. ఇప్పటి విమర్శకులు మాత్రము కొందరు దుర్యోధనుడు తరువాత అన్నట్లే సంధిసేయ వచ్చినవాడు దుర్యోధనుడింట్లో బసచేసి నట్లయితే సంధికి అనుకూలంగా వుండే దని అంటారు. కాని పైసంవత్సరములలో, అది సాధ్యమే కాదన్నీ, మహావిపత్తులకు కారణ మయ్యేదని అనుకుంటాను.

విదురుడు కృష్ణునికి పరమభక్తుడు. ధృతరాష్ట్రుని మంత్రులలో నొకడయినను కేవలధర్మాత్ముడు. అధర్మపక్షాన కత్తిబట్ట నిరాకరించాడు. విదురునిచేత కత్తి పట్టించకపోతి నని చివరకు దుర్యోధనుడు విచారపడ్డాడుగూడాను.

అయితే భీష్ముడింటికి ఎందుకు బోలేదు? రామాయణములో విభీషణుడు, భారతములో భీష్ముడు వైష్ణవసంప్రదాయములో ఒకదర్జావారేగాని శరణాగతిలో తేడా వున్నది. విభీషణుడు రాముని ప్రతిపక్షములో నిలువలేక పరుగెత్తివచ్చి రాముని పాదాల శరణుజొచ్చాడు. భీష్ముడు కృష్ణునిమీద తీవ్రంగా బాణాలు గొట్టి దెబ్బకు నొచ్చి బాధపడుతూంటే చూచి ఆనందంలో మునిగిపోయినాడు. భీష్మునిలో పురుషకారము లేదు. కృష్ణుడు ఏది చేస్తే అదే మంచిది. అంపశయ్యపై నుండి ఇట్లు ప్రార్థించినాడు :

“శరణాగతుండ భక్తుడ
పరమపదము గోరెదను, తిరంబుగ నన్నుం గా
బరికించి యేది మేల
య్యెరవు దొరకొనంగ జేయవే పరమాత్మా.”

అన్నాడు. ఈ శరణాగతికి ప్రాతికూల్య మని పేరు. కృష్ణుడు విదురుడింటికి పోయి సామాను లచ్చట పెట్టి కుశలప్రశ్న లయినతరువాత వంట చేయించమని విదురునితో చెప్పి, కుంతీసదనమునకు పోయి ఆయమ నూరార్చాడు. ఆమె కచ్చటి సంగతు లన్నీ తెలుసునుగనుక తన బిడ్డలను కత్తిమీద ఆధార పడి జీవించమని సలహా చెప్పింది. ఆ మాటలకు భీష్మా దులు గాబరాపడ్డారు. అంతట దుర్యోధనుడింటికి పోయినారు. సకలమర్యాదలు సక్రమముగా జరిగినవి. మాటల సందర్భములో ఏమేమి కంటకములు, కూరలు చేయించమంటారని ఆచారప్రకారము దుర్యోధను డడిగాడు. ఇక్కడ భోజనము చేయ నొల్ల నని చెప్పి వేశాడు. కారణ మడిగితే క్రింది జవాబిచ్చాడు:

"పగవారి యింట గుడిచిన
నగు దను కనుమాన మమృతమైనను దాగం
బగతురకు గుడువబెట్టగ
దగ దొడళుల కెప్పు డెవ్విధము వాటిలునో?"

అప్పటి పరిస్థితులలో దీనిపై వ్యాఖ్యాన మనవ సరము. తరువాత విదురుడింటికి పోయి భోజనాలు సుఖముగ జేశారు. కొంతసేపు విశ్రాంతి దీసికొన్న తరు వాత విదురుడు సవినయముగా కృష్ణుని దగ్గరకు వచ్చి కూర్చుండి యాయనతో "ఈ సంధినిమిత్తము నీ వెందుకు వచ్చావు? నీమాట వాండ్లు వినరు. నీవు వస్తున్నావని విని వాండ్లంతా సభజేసి, పాండవుల కేమియు నియ్య వద్దని నిశ్చయించుకున్నారు. పైగా వాండ్లు దుష్టులు. రాయబారమునకై నీవు సభకు పోనేవద్దని గట్టిగా జెప్పాడు. ఇందులో కృష్ణుడికి క్రొత్త విషయము లేవీ లేవు. మొదట ధర్మరాజునకు కలిగిన అనుమానములే విదురుడు ధ్రువపరిచాడు. కాని ఈ పరిస్థితులలోగూడ తాను వచ్చిన పని నిర్వహించ బూనుకున్నాడు కృష్ణుడు; కురుపాండవవంశమునకును, వారితో గూడిన రాజలోకమునకును రానున్న వినాశమును నివారింప బూనుకున్నాడు; పాండవపక్షపాతియయిన విదురు నింటిలో జరిగిన రహస్యసంభాషణలో వెల్లడించిన కృష్ణుని భావములు ఆయనయొక్క నిజోద్దేశమును వెల్లడించుననియు, ఏమాత్ర మవకాశ మున్నను సంధి కుదుర్చుమని చెప్పిన ధర్మరాజుకోర్కను నిర్వ హించబూనినా డనియు స్పష్టము కాగలదు. కృష్ణునికి సంధి యిష్టము లేదనియును, పైగా యుద్ధమును ప్రేరే పించినా డనియును చెప్పు విమర్శలకు తావు లేదని నిశ్చయింపవచ్చును.

ఆ భావముల నీక్రింది పద్యములు వెల్లడించు చున్నవి:

ఎరుగుదు నేను సుయోధను
కొరగామియు నతనితోడ గూడిన నృపు లం
దరు పగ మనమున నిడుకొని
అరుగుట యును సంధి పొసగ దనియు మహాత్మా.

పుడమియెల్ల నొడ్డగెడపయి గజవాజి
సమితముగా గడంగి యుగ్రమృత్యు
ముఖము మొరగ దివురు మూర్ఖత మాన్పుట
అధికమయిన పుణ్య మనఘచరిత.

మానవచ్చునే యంటేని—
కొరకొని పుణ్యము బాసము
నరు డర్థిం జేయుచుండ నడుమ నొకట న
శ్వరవెడలి తప్పినను ద
త్పరిణతి ఫల మొందు నండ్రు ధర్మవిధిజ్ఞుల్.

చుట్టములలోన నొప్పమి పుట్టినప్పు
డడ్డపడి వారితోడ గొట్లాడిరైన
దాన యుడుపంగ జొరకున్న వాని క్రూర
కర్ముడని చెప్పుదురు కర్మకాండవిదులు.

కావున నీ రెండు తెరగులవారికి శాంతి గావింప బ్రయత్నించువాడ.

మహాసభకు వేళయింది. విదురుడు సభకు పోవ ద్దన్నా పోయి తన ధర్మము నిర్వర్తించడానికే నిశ్చ యించుకున్నాడు. స్వరక్షణయత్నములుమాత్రము విడువలేదు. సభలో తన కమర్చిన ఎత్తయిన రత్నపీఠము మీద గూర్చున్నాడు. ఒకపక్కను సాత్యకిని, రెండవ వైపున యాదవుడయిన కృతవర్మను కూర్చోబెట్టు కున్నాడు. వెనుక కుర్చీలో విదురు డాసీనుడై చేతులు రెండూ ముందున్న కృష్ణుని కుర్చీపై వేసుకున్నాడు. స్వరక్షణకై యిష్టులను చుట్టూ కోటవలె అమర్చు

కున్నాడు. ఎదురుగా వేదికపై సింహాసనములమీద ధృతరాష్ట్రుడును, దుర్యోధనుడును కూర్చున్నారు. ఇట్లమరిన సభలో శ్రీకృష్ణుడు మేఘగంభీరధ్వనితో నుపన్యసించాడు.

సంధి పొసగించుటకై సామదానభేదదండో పాయము లనే చతురుపాయములను ప్రయోగించాడు. సామవాక్యములకు గాని, హేతువాదమునకు గాని దుర్యోధనుడు లొంగడని తెలియును. సహృదయులగు భీష్మద్రోణాదులగు సభ్యుల హృదయములుగూడ మరల్ప వలసియున్నది. పాండవులది న్యాయపక్షమనియు, బలవంతులయినను యుద్ధమునకు కాలుద్రవ్వక సౌమ్యమార్గముననే వ్యవహారమును పరిష్కరించుకొన గోరుచున్నారనియు, అన్నివిధములుగ కౌరవులదే అక్రమమనియు వారి సహాయమునకు వచ్చిన రాజులకెల్ల తెలియపరచవలసియున్నది. కృష్ణుని యుపన్యాసము రాళ్లనకూడ కరగించునట్లున్నను అది యంతయు వృథాశ్రమ యయినది. సామోపాయము నిరర్థకమయినది. కార్యనిశ్చయము సత్పురుషులయిన భీష్మాదిపెద్దల చేతులలో లేదు. దుష్టచతుష్టయమువారి మాటే చెల్లుబడియవుచున్నది. పేరునకు అధికారము ధృతరాష్ట్రుని చేతియందే యున్నను అతడు కొడుకుయొక్క నిశ్చయమునకు భిన్నముగా పోజాలడు. ఆయనకు ఓడిపోయి సర్వనాశ మవుతామేమో యని భయ మున్నదిగాని గెలుస్తామేమో యని ఆశగూడ వున్నది. సభకు హాజరయిన మునిముఖ్యులును సౌమ్యముగను, తీవ్రముగను గూడ సంధి చేసికొనవలసిన దని చెప్పారు. దుర్యోధనుడు లేచి కృష్ణుడు చెప్పినదాని నెత్తుకొనక మునులకీ క్రింది విధముగ జవాబుచెప్పాడు:

"మునులార, నన్ను విధి యే
మని మును పుట్టించె నట్టు లయ్యెడుగాకీ
విన జవిగాని పలుకులకు
బనిగలదే; యుడుగు డింక బహుభాషణముల్".

దుర్యోధనుని అవినయవాక్యములకు మునులు కోపింతురని భయపడి ధృతరాష్ట్రు డందుకొని, "మునులారా, తమ సద్బోధలు విని యాచరించు భాగ్యమునకు నే నోచుకొనలేదు. క్షమింపుడు. శ్రీకృష్ణా, నీవు ఇహపరములు రెండూ కలిగే మార్గ ముపదేశించావు. నామాటలు పిల్లవాడు వినడు. వాడు మందబుద్ధి. నీవు నాకు ఆత్మబంధుడవు. దయార్ద్రచిత్తుడవు. మహానుభావుడవు. సౌమ్యమార్గమున వాడిని నీవే వినిపించి వృద్ధుడనయిన నన్ను రక్షించు"మన్నాడు.

ధృతరాష్ట్రుడి యీజవాబుతో సభవారి కాళ్లు చల్లబడ్డవి. అతడు స్వతంత్రించి యేమీ చేయడని తేలిపోయింది. దుర్యోధను డెవరు చెప్పినా వినడని అందరికీ తెలుసు. కాని శ్రీకృష్ణుడు నిరాశచెందలేదు. తిరిగి ధర్మాలుపన్యసించడం మొదలుబెట్టాడు. నయానా, భయానాకూడ చెప్పాడు. అర్జునుని ఎవరూ గెలవలే రన్నాడు. ఉత్తరగోగ్రహణయుద్ధమే దానికి తార్కాణ మన్నాడు. ఇప్పుడు తన సహాయముకూడ అతని కుంటుందన్నాడు. చివరకు దానోపాయముకూడ అవలంబించాడు. ప్రస్తుతము భాగమేమీ పంచి యీయ నవసరములేదు. యావత్తురాజ్యమునకు ధృతరాష్ట్రుడే రాజుగాను, ధర్మజ దుర్యోధనులు యువరాజులుగాను ఏలుకోం డన్నాడు.

ఈ మార్గము సభలోని పెద్దల కందరికీ నచ్చింది. దీని నొప్పుకొనవలసినదని భీష్మద్రోణులు నొక్కి చెప్పారు. ధృతరాష్ట్రుడుకూడ పైకి బాగానే వున్న దన్నాడు. కాని, అంతరంగములో దుర్యోధను డొక్కడే యువరాజుగా నుండి పాండవులు కలిసి అనుభవిస్తూవుండటానికి కొడుకును నొప్పించ నను కున్నాడు. అప్పుడు దుర్యోధనుడు లేచి తన మామూలుమనోనిశ్చయమునే మిక్కిలి సౌమ్యముగను, చతురతతోను, అనాయకునివలెను జవాబుచెప్పాడు. ఆ జవా బిది:

"అయ్యా, ధర్మరాజు జూదరి. ఒకటికి రెండు సార్లు శకునివెంట బడి జూదమాడి సమస్తము బోగొట్టుకొని అడవులలోను, అజ్ఞాతముగను కష్టాలుపడ్డాడు. ఈ పాపమంతా నానెత్తిన చుడతా రెందుకు? దీనితో నా కేమి ప్రమేయ మున్నది? దీనిలో నా తప్పే మున్నది? ఇప్పుడు లోకములోనున్న నా శత్రురాజు లందర్నిని పోగుచేసికొని నాప్రక్కను శిబిరము వేసి, నా

గొంతుమీద కత్తి పెట్టి షరతులు ఒప్పుకుంటావా, లేదా అని నిర్బంధిస్తే నే నేమి జవాబు చెప్పను? నేనూ రాచబిడ్డనే. నాకూ పౌరుష మున్నది. ఈ పరిస్థితులలో దేవేంద్రుడు దాడెత్తివచ్చినా నేను లొంగి సలాం పెట్టలేను. నా సేనాముఖమున నిలిచి వీరునివలె ప్రాణములు వదలి, ఈలోకములో పేరు, పరలోకములో స్వర్గసుఖము పొందదలచుకున్నాను. మొదటి జూదమప్పటిలాగ మాతండ్రి ధర్మజునకు రాజ్యభాగమిచ్చివేశానంటే నే నొప్పుకోను. అప్పటివలె కుఱ్ఱవాడిని గాదు. అది సాగనియ్యను. అదీగాక, మా ఉభయపక్షములకూ మన స్సెప్పుడూ కలియలేదు. ఇప్పుడు వారు క్రోధావేశులై యుండుటచేత అసలే కలియదు. కలిసివుండడమూ, భాగమియ్యడమూ రెండూ జరగవు."

అందుమీదట కృష్ణుడు లేచి, సామవాక్యపద్ధతి వదలి తీవ్రంగా దుర్యోధను డిదివరకు చేసిన దుర్ణయాలన్నీ వర్ణించాడు. అందుకు దుర్యోధనుడు కోపము తెచ్చుకొని మిత్రులతోసహా లేచిపోయినాడు. వెనుక కంసుని వధించి తండ్రి ఉగ్రసేనునకు పట్టము గట్టినట్లు ఇప్పు డేల చేయలే దని కొందరనవచ్చును. కాని కౌరవపక్షమువా రెవ్వరును దానిని కోరలేదు. కృష్ణుడు సూచించినను అంగీకరించలేదు. ధృతరాష్ట్రుడు వ్యతిరేకించాడుగూడాను. ఇది దైవికముగ జరగవలసిన పని. పురుషకారము లేనిది భగవత్కృప రాదు. అందుచేతనే అందరు నశించారు.

తిరిగి దుర్యోధనుని పిలిపించి గాంధారిచేత సలహా చెప్పించారు. అదియును నిరర్థకమయినది. దుర్యోధనుడు తిరిగి లేచిపోయి మిత్రులను పోగుజేసికొని కృష్ణుని బట్టి చెరపెట్ట బ్రయత్నించాడు. సాత్యకి యది కనిపెట్టి సభకు వెల్లడించాడు. కృష్ణు డంతట లేచి ధృతరాష్ట్రునితో నాకు శెలవిప్పించు, వెళ్లుతా నన్నాడు. ధృతరాష్ట్రుడు దుర్యోధనుని తిరిగి పిలిపించాడు. పెద్దలందరు ఈ దుర్నయానికై అతనిని చీవాట్లుపెట్టారు. కృష్ణుడు విశ్వరూపం చూపించాడు. అదీ ప్రయోజనం లేకపోయింది. భీష్మాదులు చూచి ఆనందించారుగాని, రాక్షసశక్తులు వారి నావేశించడంచేత కృష్ణునివైపు చేరలేదు. ధృతరాష్ట్రుడూ మారలేదు. దుర్యోధనాదులు "కృష్ణుడు మేజిక్ చేశాడు. ఈ కనికట్టుకు మేము భయపడ" మన్నారు.

అప్పుడు కృష్ణు డందరిదగ్గిరా శెలవు దీసికొని సభ విడిచిపోయినాడుగాని ఇంకా సంధిప్రయత్నం మాత్రం విడువలేదు. తన ప్రయత్నం విఫలం కావడానికి కారణం యోచించాడు. కౌరవసభలో పెద్దలకు పరపతి లేదనీ, 'కర్ణుడు లేని భారతమా' అన్నట్లు కర్ణుడొక్కనిమీదనే కౌరవు లాధారపడియున్నారనీ, అతనిని చీలదీసినచో సంధి పొసగుననీ యోచించాడు. కర్ణుని స్వభావ మెరిగినవాడు గనుక అతనిని దూరముగ తీసికొనిపోయి అతని జన్మవృత్తాంతము జెప్పి, ధర్మరాజుభాగమునకు అతనిని పట్టాభిషిక్తుని జేసి ద్రౌపదిని పట్టమహిషిని చేస్తాను, దుర్యోధనుని విడిచి రమ్మన్నాడు. కర్ణు డంగీకరించలేదు.

అంత కృష్ణుడు సంధి కాదని నిశ్చయించుకుని ధర్మరాజుదగ్గిరకు వెళ్లి జరిగినది నివేదించాడు. అంత పాండవులు సభజేసి సంధి పొసగనందున యుద్ధము ప్రకటించారు.

సంధికై కృష్ణు డిన్ని ప్రయత్నములు జేసినను, అన్నీ తెలిసిన గాంధారి కడుపుదుఃఖమునకు వశమయి కృష్ణుడు యుద్ధ మాపలే దని శపించడంమాత్రం చిత్రం!

# నేటి లలితకళలు

## శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

ప్రాచీనభారతదేశమున ఆధ్యాత్మికప్రవృత్తికి లలితకళలు అంకితమీయబడినవి. కాలక్రమేణ ఈదశ క్షీణించినను, నృత్యగీతములు నేడును భగవదారాధనలో వినియోగింపబడుట చూచుచున్నాము. భాషావైవిధ్యముచే జనులలో నానాత్వము, భిన్నవర్గీకరణ, యున్నను, నృత్యగీతములు మాత్రమే ప్రజలనందరను ఏకత్రి చేర్చునవి.

నృత్యకళలో నేటికిరకమును ప్రధానముగా మూడురకముల నర్తనములు కన్పించుచున్నవి. దాక్షిణాత్యనృత్యము, ఔత్తరాహనృత్యము, మణిపురీనృత్యము అనునవి ముఖ్యములు. దాక్షిణాత్యము వీనిలో నతిప్రాచీనమైనది. బర్మా, సిలోన్, జావా, సుమత్రా, బోర్నియో, చీనా, జపాను లలోనికి కూడా వ్యాపించిన దీ దాక్షిణాత్యనర్తనమే. ఈ నృత్యమున ముఖ్యముగా షడ్రసము లభివ్యక్తీకరింపబడుచున్నవి. వీనిని పితృప్రేమ, శృంగారము, స్నేహము, శౌర్యము. హాస్యము, ఉత్సాహము అనవచ్చును. ఇవి సార్వజనీనములగు భావములు. నాట్యశాస్త్రములో నిట్టి భావము లనేకములు ప్రపంచింపబడినవి. నర్తకున కే లక్షణము లుండవలెనో కూడ భరతుడు వివరించినాడు. మంచి ఆకారము, లయతాళములలో కుశలత్వము చాల అవసర మనినాడు. వీనితోబాటు తన్మయత్వము నందగల శక్తికూడ ముఖ్యము. అనగా నృత్యావసరమున బాహ్యలోకజ్ఞాన ముండరాదు. నృత్యకళతో తాదాత్మ్య మందినగాని, నర్తకుడు రాణించలేడు.

నృత్తకళకు కూడ నొక భాష కలదు. ఈభాష అభినయాత్మక మైనది. ఈఅభినయమున హస్తవిన్యాసమున కెక్కుడు ప్రాముఖ్య మిచ్చునది కథకళి నర్తనము. ఈ విన్యాసమునే 'ముద్ర' యందురు. దీనిలో హస్తపాదవిన్యాసములు సమకోణములలో ఉండునే గాని, వక్రత్వమున నుండవు. దీనిలో గల శక్తి, స్పష్టముగా నభివ్యక్తముచేయజాలు లయకు దోహదమొసగునది. కావుననే ఒకే ఒక నర్తకుడు లేడిగాను, వెంటనే వేటకాడుగాను కాగలుగుచున్నాడు. ఇదేరీతిగా నిశోభ శివతాండవమునగూడ కన్పించుచున్నది. ఈనృత్యమున దేశకాలాదులు విస్మృతములు కాగా, అలౌకికానుభూతి కలుగుచున్నది. భారతదేశమున కాగ్నేయమందలి మణిపూరినృత్యము విశుద్ధమైనది. వైష్ణవసంప్రదాయమున బయలుదేరిన భక్తిశృంగారరసభరితమగు ఆత్మప్రవృత్తి దీన గలదు. కీర్తనలతోబాటు గావించబడు ఈ నాట్యము కృష్ణభగవానుని ఆరాధనలో నిమగ్నము. అనగా ఇంద్రియప్రవృత్తిగాని, కామముగాని ఈ నృత్యమున కన్పించవు. కన్నులతోగాని, కనుబొమలతోగాని, జఘనదేశచలనముతోగాని కన్పించు భావగాంభీర్యము, చతురిమ ఇట కనిపించవు. కాని ప్రకృతిగతసౌందర్యానుభూతి మాత్రము విశిష్టముగా తొలుకాడును.

ఔత్తరాహుల నాట్యకళలో హిందూముస్లిం చిత్రకళల సమ్మేళన మున్నది. అక్బర్ కాలమున నుద్భవించిన ఈ నాట్యము పర్షియాదేశమునుంచి తీసికొని రాబడిన దని చెప్పవచ్చును. కావుననే ఔత్తరాహులగు సామాన్యప్రజలలో నీనాట్యము చూపట్టదు. దీనిలో ఇంద్రియవిషయకమగు సంచలనమే విశిష్టమైనది. ఆత్మప్రవృత్తి కిట తావులేదు. మామూలు ప్రజానీకముయొక్క ఆదరాభిమానముల జూరగొన్న నాట్యము లనేకములు భారతభూమిలో గలవు. కులాచారములనుగాని, ప్రకృతిలోని మార్పులనుగాని సూచించున వివి.

ఇవేగాక కొందరు వ్యక్తులు నాట్యకళను పోషించుటకూడ కలదు. ఉదయశంకరుని బృందము, వారి నాట్యము జగద్విదితమే. కథకళియొక్క హస్తపాద విన్యాసముతో బయలుదేరి, భరతనాట్యముయొక్క భావగాంభీర్యమును సమన్వయించుకొని, మణిపూరి నృత్యముయొక్క లక్ష్యమును సాధించ యత్నించినాడు. కాని ఔత్తరాహుల నృత్యమందలి విషయలోలుపతో యత్కించిత్తుగా ప్రవేశించుటచే నీతని నాట్యమునకు సమగ్రత్వము లేదు. ఈ కొరత దీర్పనెంచినవాడు రామగోపాల్. ఏమైనను ఒకానొకనాడు నృత్యమున ముందంజవేసిన భారతదేశము నేడు ఈ లలితకళలో వెనుకాడుట విషాదకరము. బహుశః దేవదాసీల చేతులలో ఈ లలితకళ యుండుటవలన ఈ ప్రమాదము సంభవించినదేమోనని యెంచవీలగుచున్నది.

౨

శిల్పము ప్రతిమలను, విగ్రహములను చేయుటలోను, దేవాలయాదిగృహనిర్మాణమునను ఉపయుక్తమైన లలితకళ. చక్కని గృహములు, భవనములు ఉండుటకూడ దేశముయొక్క గొప్పదనమును, దేశమందటి ప్రాణమును సూచించుటయే. ఈ నిర్మాణకళద్వారా దేశ మనేకవిధముల నభివృద్ధిజెందగలదు. ప్రాచీనకాలమున భారతదేశములో నీ వాస్తుకళ (Architecture) మతవిషయకములగు దేవాలయములను, చైత్యములను, స్తూపములను, మసీదులను నిర్మించుటలోను, ప్రభువుల ప్రాసాదములలోను అభివ్యక్తమైనది. వీనిలో నత్యుత్తమములు సాంచీస్తూపములు, ఫతేపూర్ సిక్రీలోని ద్వారము, అహమ్మదాబాదులోని మసీదు, టాజ్ మహల్ మొదలైనవి. మొగలులు తెచ్చిన పారసిక్ వాస్తుకళ, ఆధునికకాలపు పాశ్చాత్యవాస్తుకళ, భారతీయ సంప్రదాయమున నేడు పూర్తిగా సమ్మేళనమందినవి.

ప్రస్తుతపు ఢిల్లీనగర మున్న స్థలమున ప్రాచీనకాలమున అనేకనగరములు కట్టబడినవి. ఒకదానివెంట నొకటిగా నేడు నగరములు కట్టబడినవి. ప్రస్తుతపు ఢిల్లీ యెనిమిదవది. దీనిలో ప్రాక్ప్రతీచీకళలు మిళితములైనవి. లలితకళల చరిత్రలో నీ సమ్మేళన మతివిశిష్టముగా మన దేశమున గన్పట్టుచున్నది. కావుననే వాస్తుకళను ఇతిహాసమునకు, శిల్పమును ప్రబంధమునకు పోల్చవచ్చును. ఘనీభవించిన సంగీతము వాస్తువని, మూక కవిత్వము శిల్పమని కొందరు విజ్ఞులనినారు. అనగా కవితలో కాలద్రుతి (Movement of Time) కన్పించగా, శిల్పమున స్థలచైతన్యము చూపట్టును.

చిత్రకళ ప్రప్రథమమున గుహలలోను, దేవాలయముల గోడలమీదను కన్పించుచున్నది. ఇచటనే ప్రాచీన శిల్పముగూడ ఉత్పన్నమైనది. బాహ్యపదార్థమున మానవాకృతిని నిర్మించుటయే శిల్పముయొక్క మొట్టమొదటి యుద్దేశము. మానవాకృతిని అనుకరించుట లక్ష్యముకాకపోవుటచేతనే నగ్నచిత్రములు బయలుదేరినవి. కాగా భావనకు చాల వదలివేయబడుచున్నది. శిల్పముననే శక్తిస్థైర్యములు కన్పించుచున్నవి.

జీవితమును వ్యాఖ్యానించువానిలో శిల్పమొకటి. జీవితమందలి ఆంతరంగిక అర్థమును, భావమును అభివ్యక్తముచేయు శిల్పకళ సూక్ష్మము, సుల్లలితము నగు భావములను చేబట్టయత్నించినది. భావము, చిత్తద్రుతి, సౌందర్యము, లయ మొదలగున వన్నియు నీ కళలో జేరుచున్నవి. కాని శిల్పమున వాస్తవికత కంతగా తావు లేదు. తన్మయీభావనము లలితకళలలో ప్రధానముగుటచే, శిల్పమున సహితము తన్మయత్వము, అసంగత్వము ముఖ్యములు. కావుననే భారతీయశిల్పమున అభినయాభివ్యక్తికి ప్రధానస్థానమున్నది. ఈ అభినయావస్థద్వారా శరీరమును విస్మరించరా దను నుపదేశమును చేయునట్లు ప్రతిమలు జూపట్టును. పైగా మన శిల్పములలో ముఖ్యముగా మందహాసము జూపబడుచున్నది. ఇది భారతీయుల విశిష్టగుణమని ఈ శిల్పముల జూచినపుడు మనకు స్ఫురించకపోదు. శిల్పము చాలకాలము మనదేశమున ఆధ్యాత్మికవిషయమునకై ఉద్దేశింపబడుచువచ్చినది. చైతన్యప్రతీతిని కలుగజేయు నేటి శిల్పులలో శ్రీ దేవీప్రసాదరాయచౌధరిని ఎన్నకతప్పదు.

## 3

లలితకళలు చాలవరకు భావనాజగమునసే నిలచిపోవునని, వాస్తవికజగమును విస్మరించునని సామాన్యముగా జనుల అభిప్రాయము. ప్రపంచచరిత్రలో ననేకసంగ్రామములు, సంక్షోభములు తటస్థించినవి. అవి ఇంకను సమసిపోలేదు. నానాటికి మానవుని అవస్థ భరింపరాని దగుచున్నది. ఎంత భావనలో నిమగ్నుడు కాదలచినను, చిత్రకారుడు బాహ్య జగములోని విషాదపరిస్థితిని మరచిపోలేడు. భారతభూమిలో నేడుకూడ చిత్రకారులు ప్రస్తుతపరిస్థితులచే నాకృష్టులై దేశకాలస్థితి నవగాహనము చేసికొని కళలో సమన్వయపరుప యత్నించుచున్నారు. ఇట్టివారు కొంద రీమధ్య కలకత్తాప్రాంతమున బయలుదేరినారు. వీరిలో ముఖ్యుడు రతీన్ మైత్ర అను చిత్రకారుడు. సంప్రదాయసిద్ధమగు భావనాజగతిని పరిత్యజించి, పాశ్చాత్యులు తిరస్కరించినదానిని చేపట్టి, వీరందరు వాస్తవికతకు దోహద మొసగుచున్నారు. వీరికి వంగదేశమందలి క్షామము బాగుగా చేయూత నొసగినది. వాస్తవికజగత్తును గమనించి, అందలి బాధ నవలోడనము చేసికొని, ఆ బాధను సహింపజాలక చిత్రించుచున్న వీరు ప్రాచీన సంస్కృతిని పూర్తిగా మరచినారు.

సంప్రదాయములపై నెదురుతిరిగిన చిత్రకారులనేకులు మన దేశమున నేడు చూపట్టుచున్నారు. ఆదర్శజీవితమును భావించి చిత్రించుటను పరిత్యజించి, వాస్తవముగా నేటి జీవిత మెట్లున్నదో చిత్రించవలె ననువారు వీరు. కాని వీరి చిత్రముల రూపములలో నీవాస్తవికత చాలవరకు మృగ్య మనవచ్చును. రూపనిర్మాణమున వీరు ప్రసిద్ధులు, నిపుణులుగూడ. రేఖానిర్మాణమున, వర్ణవిన్యాసమున, వర్ణిక నుపయోగించుటలోను వీరు తీసికొను శ్రమ అపారము. ఈశ్రమవలన వీరు అభివ్యక్తము చేయదలచిన భావము వీరే విస్మరించుటగూడ కలదు. అంతేగాక సంప్రదాయాదుల ప్రోద్బలమునగాక, ఆత్మవృత్తిద్వారా చిత్రించుచుంటి మని వీరి విశ్వాసము. కాగా భారతీయసంస్కృతిలో విశిష్టములగు భావములను సహితము వీరు వదలివేయుట శోచనీయము. జాతీయ సంస్కృతికి, లలితకళలకు సన్నిహితసంబంధ మున్నదని మనము విస్మరించరాదు.

ప్రజానీకమున కందుబాటులో నుండి, వారిచే తేలికగా అవగాహనముచేసికొ నబడునట్లు చిత్రించువారింకొక వర్గము. వీరిమార్గదర్శకుడు జమినీరాయ్. ఈమార్గగాముల చేతులలో outline కు విశేష ప్రాముఖ్య మున్నది. కాని ఈ రేఖావిన్యాసము సాంప్రదాయికముమాత్రమేగాక, విశిష్టత లేనిదికూడ నని జ్ఞప్తియం దుంచుకొనుట మంచిది. కంటి కింపుగా కన్పించినను, వీరి చిత్రములు హృదయమునుగాని, బుద్ధినిగాని, రేకెత్తించలేనివి. సునిశితములు, సుకుమారములు నగు భావముల కీ చిత్రములలో తావు లేదు.

ఇక సంప్రదాయమును వీడజాలని చిత్రకారులున్నారు. వీరి మూలపురుషుడు అవనీంద్రనాథ టాగూరు. ప్రప్రథమమున జాతీయసంస్కృతిని పునరుజ్జీవితము చేయనెంచి వీరు చిత్రించినారు. కాని రానురాను వీరి చిత్రములలో పునరుక్తి బయలుదేరినది. వీరి భావములలోను, రూపములలోను నవ్యతగాని, అభివృద్ధిగాని నేడు కన్పించదు. బాహ్యజగత్తులోని దుర్భరపరిస్థితులను లెక్కజేయక, తమతమ, భావనాజగత్తులలోనే వీరు నిలచిపోవుట విషాదకరము. కాని సంప్రదాయమును పరిత్యజించిన చిత్రకళ రాణించదని మాత్రము వీరిచిత్రములు ఋజువుచేయుచున్నవి.

పాశ్చాత్యచిత్రకారు లీమధ్య వాస్తవికతను, భావనాజగములోని ఆదర్శత్వమును వదలి, సౌందర్యమీమాంసామాత్రములను చిత్రములద్వారా నభివ్యక్తపరుప నెంచినారు. కళాకారుని భావన, దర్శనలు రూపము నందుచుండుటచే మానసికప్రత్యక్షమునకు విషయమగు జగమంతయు కళాప్రపంచమే ననినారు. ఈ విధముగ చిత్రకళ భారతదేశమున గత రెండువేల వర్షములనుండి వచ్చుచున్నది. కాని నేడు మన దేశమున చిత్రకళలో జరుగుచున్న మార్పు స్వాభావికముగా వచ్చినదో, లేక పాశ్చాత్యకళను అనుకరించుట వలన వచ్చినదో చెప్ప వీలులేదు.

## ౪

చిత్రకళనుగురించి విచారించునప్పుడు గొప్ప చిత్రమునకు, మంచిచిత్రమునకు భేద మున్నదా, లేదా అని విమర్శింపవలెను. మంచి చిత్రములనుగూర్చి ఆలోచించుచో గొప్పచిత్రములు వెంటనే స్ఫురించగలవు. అజంతాగుహాలలోని చిత్రములు, ఎలిఫెంటాలోనివి, 'మడోనా' చిత్రములు మంచివి, గొప్పవికూడాను. అనాగరకుల చిత్రములను జూచునప్పుడవి ఆనందము నీయగలిగి, మంచివిగానే కన్పించును. కాని యవి గొప్పవి కావని వెంటనే తోచుట సహజమే అట్లే ఆధునికచిత్రకారుని బొమ్మలనుచూచి, ప్రాచీనులగు టర్నర్ మొదలగువారి చిత్రములతో పోల్చి, నవీనులవి మంచివి కావనుట పొరబాటు. చిత్రమును విమర్శించుచో ఏ చిత్రమున కాచిత్రమే తీసికొనబడవలెగాని, పోలికలు పనికిరావు. వర్ణికావిన్యాసముతో, ఛాయాతపములతో రూపనిష్పాదన కలుగగా, వ్యక్తిలో నుత్పన్నమగు భావస్పందనమే చిత్రముయొక్క మంచితనమునుగాని, గొప్పదనమునుగాని చెప్పగలిగినది.

లలితకళల విచారణలో మూడు ముఖ్యవిషయము లున్నవి. అనాత్మీయశక్తి మొదటిది. అనగా, లలితకళలకు పరమావధిగాని, పరమప్రయోజనముగాని తత్తద్విషయమగు చిత్రకళయొక్క అనుభూతియేగాన కళ నిరపేక్షము, స్వతస్సిద్ధము, స్వయంపోషకము నని యాశక్తి యొక్క భావము. ఇక కళాకారుని శక్త్యుపహితమగునది రెండవ లక్షణము. కళాకారుని ఆత్మీయత, ఆత్మాభివ్యక్తి, స్వోద్దిష్టలక్ష్యము ఇం దుండును. ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసములు ననుసరించి లలితకళలలో ఎక్కువ తక్కువలీ లక్షణమున వివేచింపబడును. ఉత్తానాత్మవిషయముల నతిక్రమించి, దేశకాలపరిచ్ఛిన్నత్వమును దాటి చిత్రించగలిగిన శక్తి మూడవది. ఇట్టి కళాకారుడు ద్రష్ట, దార్శనికుడు అగుచున్నాడు. గొప్పచిత్రకళలో నీ మూడువిషయములును సమన్వితములై కన్పించుచున్నవి. అనగా నీ మూడుశక్తుల సమ్మేళనమువలన నిష్పన్నమగు రూపమే లలితకళ యనవచ్చును. కాగా, రూపనిష్పాదనలో కుశలత్వము, భావలావణ్యయోజన అనునవి ముఖ్యములు. తద్ద్వారా లలితకళలో జీవము, లేక చైతన్యము మూర్తీభవించవలెను. ఈ చైతన్యప్రతీతికి సంప్రదాయము చక్కగా అవగాహనముచేసికొనబడవలెను. ఇట్టి భావముతో నవనీంద్రుడు బయలుదేరినాడు. లలితకళాసంప్రదాయమును బాగుగా తెలిసికొని దానిపై భవిష్యత్కళను నిర్మించవలె నని యెంచు నవీనులలో 'భాను' ఒకడు. సంప్రదాయమును జాతీయసంస్కృతిని మరువక, పైజెప్పిన మూడు శక్తులను సమన్వయపరుపజాలినదే ఉత్తమచిత్రకళ.



# ఆంధ్రదేశపు జానపదగీతములు

●

**శ్రీ కవికొండల వెంకటరావు**

లోకంలో అపౌరుషేయాలుగా పేర్కొనబడుతూవున్న వేదాల్లాంటివి నరోవాక్కు 'ఫోక్ సాంగ్' ఒక్కటే. ఈ 'ఫోక్ సాంగ్' అన్న ఇంగ్లీషుకు నే నొకప్పుడు గావించుకున్న తెనుగు పర్యాయపదం 'మహాజనగానం'. సర్వసాధారణంగా దీనినే జానపదగీతిక అని, పల్లెటూరిపాట అనీ ఇలా ఆంధ్రదేశంలో వాడుతూఉన్నారు. అయితే జనపదం అన్న పదానికర్థం పల్లెటిపట్టు అనిమాత్రము. కాని ఈ గీతికలు పల్లెలకు సంబంధించినవి కావచ్చు; పట్నాలకు సంబంధించినవీ కావచ్చు. ఏమైనా వాటి విలక్షణం ఒక్కటే. ఆగీతిక ప్రజాయత్తమై యుండాలి. అది రచియించిన కవి ఎవరో, ప్రచారము గావించిన ప్రభు వెవరో వెల్లడికాదు. మనం పీల్చే గాలిని బోలి, రుచిచూచే అడవిలోని పండును బోలి, మనకు తెలియకుండా మనల నానందమగ్నులుగా చేయాలి. తరతరాలనుంచి మన కనుశ్రుతంగా దఖలు పడుతూవున్న సొత్తుగా, సూక్తిగా తోచాలి.

"కమ్మోరి సిన్నోడ, సిరిసిరి మువ్వా" అనిగాని,

"జంబైలా జొన్నకొడ్డి" అనిగాని,

"లాల్బావుటోయి బాయి లాల్బావుటోయి" అనిగాని,

"నా మగడు బండిమీద నాగులేరు పంచదార
పిల్లల్లె లేలే లే లిల్లే" అనిగాని,

పొలంమీద కూనిరాగంగా విన్నప్పుడెక్కడ నుండి వచ్చిందీ తెలియని గడియలు నాజీవితంలో ఎన్నో ఉన్నాయి. మరెన్నో ఈ పాటలు కొండల మధ్య పాడితే లోయ అంతా ప్రతిధ్వనించి తీరుతుంది. నీటిపాయమీద పాడితే అలలన్నీ మిలమిల మనక మూసవు. మనం లోలో మననం గావించడం అంటూ వస్తే వొళ్లంతా గరిపొడిచిందన్నమాటే.

ఈ ఫోక్‌లోర్‌ను స్టోర్ చేసుకుంటూ వాడుకోవడంలో ఆంధ్రదేశం ఏ ఇతరదేశాలకూ ఎంత మాత్రం తీసిపోదు. విచారంలోను, బాధలోను జనసామాన్యాన్ని ధైర్యవంతులుగా చేసి, వారిలో ఆశ, ఆనందం గొలిపేవి ఈ పాటలే.

"నీళ్లులేని నిండు జలధిలో వాలలాడిరి బాలలు
పీలులేని వలలు వేసిరి జ్ఞానులు.
గొడ్డె ఒకటి అయిదుపులుల
గొట్టి రక్తము తాగగా
రాతికింద చింత వొకటి
రాలుగాయలు గాయగా"

అని తత్వం చితారు మేళవించి పాడుతూంటే అర్థంకాకపోయినా ఆ ముక్క లట్టుకు ఐహికసంసారాన్ని మరిచిపోతాం.

తీవ్రంగా ఆలోచిస్తే సంగీతానికి మూలం మహాజనగాన మనే నా వూహ. సామవేదమన్నది ఒకప్పుడు సర్వసామాన్యంగా వినబడివున్నదనే. అనాది ఋషుల ఆశ్రమాల్లో ప్రతీ రెమ్మ, కొమ్మ దాన్ని ఆలాపించిందనే నా నమ్మకం. అయితే క్రమేపీ మానవుల్లో బూర్జువాలు ('క్లాసెస్') అనీ, బీడిమూక ('మేసెస్') అనీ ఎలా విభజన బలిసిపోయిందో అలాగ్గానే గానంలోకూడా 'ఆర్టు మ్యూజిక్' అనీ, 'ఫోక్ మ్యూజిక్' అనీ—అనగా శాస్త్రకట్టు అనీ, గవాయి అనీ కేటాయింపులు వచ్చేశాయి. ఇక్కడ విదేశాల్లోని సందర్భం కొంచెం పరిశీలిస్తే తేలే సారాంశం ఒకటి వుంది, గమనించదగ్గది. ఈ రకపు పాటలు జాతీయాశయాలకు, జాతీయావేశానికి సంబంధించి వుంటాయనీ, వాటిని పెంపొందించే ఒకానొక దేశీయసంస్థ అవసరమనీ.

ఈలా పైకి తీసుకురావడంలో ఒక్కొక్కప్పుడు అనాదినుండీ వచ్చిన ఏస, బాస తప్పించి కొందరు కొందగు పాడడం కద్దు; ప్రచురించడం కద్దు. అచ్చు గుద్దే పనిఒట్టు కది కొంతవరకు అవసరము కూడా కావచ్చును. కాని ఏలా విన్నవాని నల్లా ఉంచేస్తూ ఉపయోగించుకోవడమే మంచి దని నా అభిప్రాయము. ఒకప్పుడు వీళ్లల్లో పాడబడితేనేగాని దొరకని బొబ్బిలిపాట, పల్నాటివీరగాథ మన కిప్పుడు ప్రతీ పుస్తకభాండాగారంలోనూ లభిస్తూవుంది. ఆ పుస్తకాలు చదువుతూంటే మన చేతి బొటనవ్రేలిని మనమే ఆడించేం. మన బుజం మనమే మీటుకునేం. ఎంత ఆడించినా, ఎంత మీటించినా ఆ పాటగాళ్లు పాడినట్లుండదేమో ?

"బాలున్నెత్తే యెత్తుకున్నది దేవీమల్లమ్మ
చెక్కిళ్లయినా దువ్వినాదిరా చేరి ముద్దులాడి
... ... ...
బంగారంపు గజ్జెలు రాజా తీయించినాది
మాఱువేషమే వేసినాదిరా బాలునికై రేను"

వేయించి, పెద్దదాది వెంకటలక్ష్మిని పిలిపించింది.

"చీరికపేలిక కట్టబెట్టెను వెంకటలక్ష్మికి
మాడుచెక్కలే మసిబొగ్గులే దుత్తను వేసింది
వడినిండా వరహాలు కట్టెను దేవీ మల్లమ్మ
అమ్మా, దేరా దేరా దేరా కాడా భిక్షమెత్తుకోని
రాజారంబు జేరవలెను వెంకటలక్ష్మి"

అని పిల్లణ్ణి అందిచ్చింది. భద్రం భద్రం భద్రం అంటూ... కాలుణ్ణిగురించి అంత జాగ్రత్త ఆమె తీసుకొంది అంటే కారణం మరోపాటలో ఆంధ్రులకు కనిపించగలదు. బాలచంద్రయుద్ధగాథను వినండి:

"మానాభిమానముల్ మగటిమి మించ
ప్రబలించగలవారు బాలురె సుమ్మ
బాలురె పెద్దలు బల్లిదుల్ వారె
బాలురకే వృద్ధి పరికించిచూడ
పెద్దలు మతిచెడి పిరికిపారుదురు
కీర్తికైన మన అపకీర్తికైన
బాలురపై నుండు భారమంతయును."

ఇదే నిజమైన ఆంధ్రావేశం, ఆంధ్రాన్నప్రాశమూను. కాదంటారా ?

ఈ పాటలను సేకరించి అందలి నిగ్గు, నిరుకు ఏర్చి పేర్చి చూపించడమనేది అదో పెద్దపని అనుకోండి. మూల మూలలా దేశమన్నట్ట తిరుగుతూ గాలించాలి, పరిశోధించాలి. ఈ అడుగడుక్కీ ఆకలి రోజుల్లో ఎవరి కంత తీరుబాటూ, తీటానూ. నే నిప్పుడు పాడితే, ఎందుకొచ్చిన పాటలు, ఈ డివ్వనా గుడ్డివ్వనా అని అడిగే వారు కూడా వుండవచ్చు. చర్వితచర్వణంమాట ఏలా వున్నా, అయితే ఆ పాటలందు ఆ కవులు చూపిన ఋతువుల మర్యాద, వృత్తుల విచక్షణ, ప్రణయాది సంరక్షణ, ఎన్ని మాట్లు అనుకున్నా అనుకోతగ్గవే అని నా అభిప్రాయం.

ఒకప్పుడు వానదేవుణ్ణి జగదేకవీరుడా అని సంబోధించారు.

"మోటలవా రంత మొత్తుకుని చచ్చిరి వానదేవుడా
నాగళ్లవా రంత నరుకుకుని చచ్చిరి వానదేవుడా
గుంటకలవారంత గుద్దుకుని చచ్చిరి వానదేవుడా
ఇగనైన గురువవు జగదేకవీరుడా, వానదేవుడా!"

అని వఱుపులప్పుడు అలా అన్నవాళ్ళే, మెఱుపులప్పుడెలా పాడారో వినండి:

"తొలకరి ఒక మబ్బు తొంగిచూచింది
మబ్బులో ఒక మెఱుపు మెఱసిపోయింది
పెఱటిలో ఒక జల్లు కురిసివెలిసింది
జల్లులో నా మనసు జారిపోయింది."

వృత్తులను వెంటాడిస్తూ వింటే వినబడేవి ఎన్నో ఉన్నాయి:

"రామోరామ రామయ్యా
బండొచ్చి వేస్తోంది రాజా
ఈయేడె మే మడిగినాము
మేము సాయిలాళ్లము కాము రాజా
మేము పంబలాళ్లము కాము రాజా"
"రాజు లేనప్పుడు సారంగూడా
రారాద పోరాద సారంగూడ"
ఇలా వేళవేళలు వినవస్తాయి.

మరిచుట్టరికం చదువు చూరగొనే ఈసుద్దువినండి:

"గిద్దల గిరి కొండలనడుమ
ముద్దుల మేనత్తకొడుక
దాపపెట్టుకు దప్పికాయెనోయి వారి ఓబలేశ !"

ఇలా ఇలా అసలు ప్రణయందగ్గఱ కొచ్చేటలికి వనితను కవ్వించే ఘట్టాలు ఎన్నో ఉన్నాయి:

"నవ్వుతూ మాటాడి
కవ్వించిపోతాడు-చందమామోయి
బంగారుమొలతాడు
పైపైన మెఱసింది-చందమామోయి
వుంగరాల జుట్టు
రంగైన మగవాడె-చందమామోయి
ఆ మగవాని కౌగిట
మరణించినా చాలు-చందమామోయి"

ఎప్పుడు చూచినా ఆంధ్రదేశాన్ని ప్రణయమే ఉఱ్ఱూతలూగించింది అని అనుకోకండి ఒకొక్కప్పుడు విచారం సూచించే చరణాలు వినిపిస్తాయి.

"దూడమ్మ దూడదూడ
నీకైనా ప్రాపతము లేదా
దూడమ్మ దూడదూడ"

బహుశా దూడ చచ్చిపోతే వ్యవసాయదారుడు పడ్డ దుఃఖం వెలిపోత అనుకుంటాను ఆ యుదంతం. ఇటు వినండి:

"ఆ వేళ సాదగుడు ఏమని మ్రొక్కు
పందుం సాంబ్రాణి ధూపమునీ మ్రొక్కు
అచ్చ కర్పూరాలు ఆరతులనీ మ్రొక్కు"

ఇది ఆంధ్రవీరుడు యుద్ధానికి పోబోయే ముందు మ్రొక్కిన మ్రొక్కులపాట అనుకుంటాను.

ఏపాటైనా ఈ పాటలను రచించిన కవుల పేర్లు మనకు మృగ్యములు. పేర్లు తెలిస్తే దాన్ని ఈరకపు పాటగా మనం గుర్తించడమే అసంభవం. నేడీ కార్యక్రమంలో వినడమే తటస్థించివుండి వుండదు.

అయితే వర్తమానకవులయొక్క కొన్ని కొన్ని పాటలు ఈ శ్రేణికి చెందతగ్గవి లేకపోలేదు. నా మిత్రుడు శ్రీ అడివి బాపిరాజు వ్రాసిన "గుఃళ్ల చెల్లాయి కూతురు కడు చక్కం దని చూతురు" అన్నది ఒక టిప్పణే నాకు తట్టుతూవుంది. మరి శ్రీ బసవరాజు అప్పారావు కీర్తిశేషుడు కావడంచేత అతగాని పాట "గుత్తొంకాయ కూ రొండాను బావా"అన్నది మనం చూస్తూవుంటేనే ఫోక్ సాంగ్ గా మారిపోయే సూచన కానవస్తూంది. నాపాటలలో కొన్ని ఫోక్ సాంగ్స్‌గా మారిపోతే మేలు. నే నూరూ పేరూ లేకుండా వున్నా ఫరవాలేదని అనిపిస్తూవుంది.

"సుక్కలో సుక్కొడిచి మొక్క మామిడి నిలిచె
లేడిచూపులపిల్ల లెగవేమే !
బేడిశాలాకళ్ల నగవేమే ?
చందమా మీదాక సందవెన్నెల ధాళ
చూపించి చూపించి సామ్మసిల్లాడొ్
చిమ్మచీకటి చింత సెట్టంకా
చిన్ని కాటుకరేక నా ఒంకా ;—
పైగుగాలికి పూల వాసనలు ననమొల్ల
వలపించి వలపించి నిలిచిపోనాయల్లె
హద్దు పద్దులులేని ఆకసములో
ముద్దులా కన తెప్ప మిణుకొమెలో ;—
పరవతాలను మ్రోత పక్షికూసిన కూత
ఉండుండి వినిపించి యూరకొన్నది యిట్టె
తలపులో నెదో క్రొత్త తలపు నిలుప
సుక్కలో సుక్కొడిచి మొక్కమామిడి నిలిచె ;
లేడిచూపులపిల్ల లెగవేమే ?
బేడిశాలా కళ్ల నగవేమే ?"
అన్న పాట నాదే.

ఇదంతా మహాజనగానంగా మారే దెప్పుడో. అదంతా కాలపురుషుని చేతిలో వుం దనుకుంటాను.*

* ఆలిండియా రేడియో - మద్రాసు వారి అనుమతితో.



వేలూరుకోట దేవాలయములోని ఒక విగ్రహము

# గర్భకవి - అక్కరలు

## శ్రీ దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డి

అక్కరలు యుద్ధమల్లుని బెజవాడశిలాశాసనము లోను, నన్నయభట్టుభారతములోను కనబడు చున్నవి. నన్నెచోడకవి కుమారసంభవములో అక్కరలను పేర్కొనలేదు. కాని, వ్రాసినట్లు లక్ష్యము లున్నవి.

### మధ్యాక్కర

చంపకమాలావృత్తములో పాదాంతమందలి నాలుగు రగణములు—"జిష్ణునం, నేలపై, క్రమ్మ ఱన్, అయ్యనిన్"—లోపించినచో అది మధ్యాక్కరగా మారుచున్నది. పద్యార్థములో యుద్ధవర్ణన చెడదు.

"మురిపెడి రూపులన్ మురిసి
 మ్రొగ్గెడి రూపులు మ్రొగ్గి
తిరిగెడి రూపులం దిరిగి
 త్రెళ్లెడు రూపులు త్రెళ్లి
పొరలెడు రూపులం బొరలి
 పోయెడి రూపులం బోయి
మరలెడు రూపులన్ మరలి
 మ్రగ్గెడి రూపులు నయ్యె.*"

దీనిని నన్నయమధ్యాక్కరతో మొదట పోల్చుట యుక్తము.

"ధరణి జరాచరభూత
 సంఘంబు - దమ విషవహ్ని
నరగంబు లేర్చుచు నునికి
 కలిగి ప-యోరుహగర్భ
 డురగవిషాపేతజీవ
 సంజీవ - నోపదేశంబు
గరుణ గశ్యపునకు నిచ్చె
 నఖిలలోకహితంబుపొంటె."†

యతిస్థానములో ఒక గణము—నాలుగు + అయిదు—తేడా లేనిచో ఇవి రెండును సమకాలిక ఛందస్సు లన వీలున్నది. గర్భకవితలో ఇంతమాత్రము స్వేచ్ఛ లేకపోదనుట కిది విశిష్టలక్ష్యము. ఛందస్సులలో కూడ గర్భకవి—అక్కరలక్షణమ్మే విధింపబడినది. "మనృయయు, మధురయుం, ద్రిగణయుతుల" చెల్లును.

### అంతరాక్కర

పై మధ్యాక్కరలో పాదాంతమందు రగణములు చేర్చి, పాదాదిలో రెండు ఇంద్రగణములు విడిచిపెట్టినచో, అది అంతరాక్కర కాకపాదు.

"మురిసి మ్రొగ్గెడి రూపులు
 మ్రొగ్గి జిష్ణునం
దిరిగి త్రెళ్లెడు రూపులు
 త్రెళ్లి నేలపై
బొరలిపోయెడి రూపులం
 బోయి క్రమ్మఱన్
మ్మరలి మ్రగ్గెడు రూపులు
 నయ్యె నయ్యనిన్."‡

ఇది తేటగీతి కాబోలన్న పాదాంతమందలి 'గురువు' హెచ్చుగా ఉన్నది. అంతరాక్కరకును, తేటగీతికిని వ్యత్యాస మీ గురువువల్ల కనిపెట్ట వీలున్నది.

గణముల కూర్పు మారినచో దీనిలో హెచ్చు గురువు లేదనుట కవకాశ మున్నది.

---

*. కుమార ౧౧-౬౫ 'చ.' పద్యము.

† భారత. ఆది ౨-౧౮౧ 'మధ్యా' పద్యము.

‡ కుమార. ౧౧-౬౫ 'చ.' పద్యము.

"సూర్య చంద్ర
ఇం*ద్ర ఇంద్ర."

లేక—

"సూర్య ఇంద్ర
ఇంద్ర *చంద్ర గ."

"త్రిగణాంతము-యతి" అన్నప్పు డిట్టి వ్యత్యాసము లేర్పడును. "ఏకోనాక్షరత్రిగణ మంతరమున్—యతి" చెల్లును. ఇది లక్షణగ్రంథములకంటె విలక్షణముగా ఉన్నది.

## అల్పాక్కర

పై పద్యాక్కరలలో అల్పాక్కరకూడ గోచరించుచున్నది.

"మురిసెడి రూపులుం
మురిసి మ్రొగ్గ
దిరిగెడి రూపులుం
దిరిగి త్రెళ్లె
బొరలెడి రూపులుం
బొరలిపోయె
మరలెడు రూపులుం
మరలి మ్రగ్గ."

దీనిలో ఛందోభేద మేమిన్ని లేదు.

---

* కుమారసంభవవిమర్శము, ౧౩౫ పుట. "అక్కరలు" శీర్షిక.

ఇట్లిది అక్కరగర్భితవృత్తమయినను, దీనికాపేరు పెట్టక చంపకమాలపేరు పెట్టుట యుక్తమగునో, కాదో? నిర్ణయము కావలెను.

తన్మూలము:

"మురిసెడి రూపులున్ మురిసి
మ్రొగ్గెడి రూపులు మ్రొగ్గి జిల్గనం
దిరిగెడి రూపులుం దిరిగి
త్రెళ్లెడి రూపులు త్రెళ్లి నేలపై
బొరలెడు రూపులుం బొరలి
పోయెడి రూపులు బోయి క్రమ్మఱన్
మరలెడు రూపులుం మరలి
మ్రగ్గెడి రూపులు నయ్యె నయ్యనిన్."

(కుమార. ౧౧-౯౯ 'చ.' ప.)

"నన్నిచోడుడు నన్నయ్యకు బూర్వుడో, తత్సాంప్రింతమువాడో యయినచో నక్కర - లుపయోగించియుండుట సహజము." * కనుకనే, పై గర్భకవి తాక్కర లుపయోగించినా డనుట సహజము. అక్కర లుపయోగింపని తిక్కనాదికవులకంటే—అక్కరలు వ్రాసిన చోడ(చోడ)కవి పూర్వు డగునే కాని "అనంతర కాలమువాడు" కా డన వీలున్నది.

భాషాతత్వకాల మెట్లు తారుమా రగుచున్నదో కనుగొనుడు.



# అన్నదమ్ములు

[కథానిక]

●

శ్రీ బలివాడ కాంతారావు

'పరువునష్టం దావా వేసితీరాలి. మన పరువు ప్రతిష్ఠల్ని కులంలో యిలా కాల్చేస్తుంటే...'

'బావగారూ! యెంత చిన్నవాడైనా యిలా సంచరిస్తుంటే యెంతకాలం సహిస్తారండీ? చిన్నమ్మాయికి మహారాజులాంటి సంబంధం కాకుండా చేసిన వాడిని యేం చేసినా తప్పుందా?'

'మీరందరూ వేద్దామంటే నా అభ్యంతరం యేమీ లేదు.'

'అమ్మయ్యా! యిన్నాళ్లకు వచ్చిందండీ అభ్యంతరం లేదన్నమాట! శాంతం, శాంతం అనే యింతవరకూ తీసుకవచ్చారు' వియ్యంకునివేపు తిరిగి 'యీ కష్టాలు యిప్పుడు అనుభవించేది మనమే కదా అన్నయ్యా! చేతులారా కట్టించిన రెండంతస్తుల మేడ దానం చేశారు!'

'పోనిద్దూ చెల్లమ్మా! మేడకన్నా భూఆస్తే యెంతో లాభం. మరికొన్నాళ్లలో మనం ఒక మేడ కట్టించలేమా?'

'మనుషులిలాంటివారని చెప్తున్నా నన్నయ్యా! ఇంటిపెద్ద కళ్లు మూసే గుర్రపుకాసులు కొని దాచే వాడే. అల్లుడి చదువుక్రింద అంత డబ్బు తగలేశాడే— యేదీ సమిష్టి. వాళ్ల మనసుల్లో కుళ్లు వుంచుకొని వాళ్ల బాగు వాళ్లు చూసుకుంటూవుంటే యీయన కెందుకా తిన్ననని? తమ్ముడు అనగటంతో సరి, మేడ దానం చేశారు.'

'రత్నం! పోనీయవే. వేరైపోయినా మన కేం లోటొచ్చింది?'

'లోటు లేదండీ? ఆయన స్వంతయింట్లో వున్నాడు. నేడో రేపో కారు కొంటారట! మనం యెందుకు కొనలేం? మనకీ అద్దెకొంపగతేమిటి? మీ ధర్మమా అంటూ పైకొచ్చి, మీ గుండెనే బాకు నాటాడు. ఇంకా తమ్ముడనే అభిమానం చావదు' వియ్యంకునివేపు తిరిగి 'తమ్ముడు విడిపోతానని, ఆస్తి పంచమని బలవంతం చేసేవరకు నేనొక దెయ్యంలా కనిపించా నన్నయ్యా.'

ముక్కాళ్ల ముసలి; ముఖంనిండుగా పట్టె వర్ధనాలతో వరండాదగ్గర ఆగాడు.

'ఆలస్యం యెందుకూ? నాతల్లి కడుపులో చిచ్చుపోసినవాడు నా మర్దట. రేపే దావా వెయ్యాలి' రత్నమ్మ పౌరుషవాక్యాలను జారవిడిచింది.

'ఎందుకమ్మా యీకక్షలు ఒక్క తల్లిబిడ్డల్లో? విభక్తం అయిపోయారుకదా, పాతరోజులు మరిచి పోయి మంచిగా వుండండమ్మా!'

'మధ్యను మీ రెందుకు పుల్లంటి బుడ్డలా. ఇక్కడిదక్కడ పెట్టండి. రామా కృష్ణా అని ఒక మూల కూర్చోక.' కటుస్వరంతో అన్న మాటలు విన్న వకీలు చుట్టపొగమధ్యనుంచి ఒకసారి ఆశ్చర్యమైన చూపులను ప్రసరించి యేదో అనబోయి ఆగిపోయాడు.

టక్ టక్ మనే శబ్దంతో త్రోవ చూపించింది చేతిలోని కర్ర. గదిలోనికి పోయి తన మంచంమీద చారబడ్డాడు ముసలి.

౨

'ఏడుస్తున్నా వేం తాతయ్యా! అమ్మ అన్నం పెట్టలే?'

'ఆకలి లేదు నాయనా'

'ఆకలిలేనిదే ఏడుస్తా వేం తాతయ్యా?'

ఒడిలో కూర్చున్న ఐదేళ్ల మనుమడి ప్రశ్నకు డెబ్బయ్యేళ్ల తాతయ్య జవాబీయలేకపోయాడు.

'చాకలెట్ యిస్తాను, వూరుకుంటావా తాతయ్యా?'

తాతయ్య తల కాస్త ప్రక్కకు త్రిప్పగానే తను తాతయ్యపేరు చెప్పి ఒక ముక్క తినొచ్చని ఒడిలో నుంచి దుమికి పరుగెత్తాడు.

'అమ్మా, అమ్మా! తాతయ్యకి చాకలెట్ కావాలట'

'అబ్బా! ఉండరా...బడికి వేళైంది. వెళ్లు'

'తాతయ్యకు చాకలెట్ యిస్తే మరి యేడవరు'

'తాతయ్య యేడుస్తున్నారా?'

'నిజంగా యేడుస్తుంటే—చాకలెట్ యిస్తే'

రత్నమ్మ మామగారి గదిలోనికి వెళ్లింది.

'యీ యింట్లో యీదురోమని యెందుకీ రోదనం? యిక్కడ కొంతసేపు, అక్కడ కొంతసేపు. యే కొడుకునో ఒక్కడిని నమ్ముకొని వుండరాదూ?'

'యిద్దరూ నాకొడుకులనే అభిమానం కాల్చుకో లేనమ్మా!'

'అభిమానం. అభిమానం! అయితే యెప్పుడూ మాకీ గోల యెందుకూ?'

'నాస్థితిలో వుంటే నాకడుపుమంట తెలుసుకొనివుందువమ్మా.'

'మంట! యీ యేడు పెందుకు మాయింట్లో. మీకొడుకుకుటుంబం నిలవాలా?'

'రామరామ! వూరుకో అమ్మా, వూరుకో. ముసలివాళ్లకు దేవుడు అన్యాయం చేస్తాడు. కన్నీరు తప్పించి మిగతావన్నీ కరువుచేస్తాడు. ఆ కన్నీరుకూడా కరువుచేసుంటే నీకున్న కింత కష్టపడేది కాదు.'

'యేమన్నా నే చెడ్డదాన్ని. నిజం ఆడితే నిష్ఠూరం. చిన్నకొడుకుమీద అంత అభిమానం వుంటే యిక్కడి కెందుకు రావటం? అక్కడే వుండండి.'

పైమీది గావంచాతో కళ్లు ఒత్తుకొని 'ముసలి వాళ్ళు పిల్లలతో సమానం అమ్మా. కాలానికి పక్షపాతం వుండదు. అందరిమీదా దాని ప్రాభవాన్ని చూపిస్తుంది. ఒకనాడు నాకంట పడని కోడలివి యీనాడు నా బాగోగులు స్వయంగా చూస్తున్నావంటే అది కాలప్రభావం కాదమ్మా. వెళ్లమ్మా, బాబుని తలదువ్వి బడిలోకి పంపించు' అంటూ లేచి వీథి అరుగుమీదికి పోయి కూర్చున్నాడు—కోడలు యేదో గొణుక్కుంటున్నా వినిపించుకోకుండా.

3

ఒంటిగా మేడ యెక్కలేదు. యెవరైనా తోడుండాలి. మనుమరాలు రాధ గబగబా మెట్లు దిగి తాతయ్యదగ్గరకు వచ్చింది. పలుచని తెల్లనైన శరీరం, ప్రశాంతమైన ముఖవర్చస్సు, ప్రేమ వుట్టిపడే మాటలు—ఆమెభుజం వూతపట్టుకొని మేడ యెక్కాడు. రత్నమ్మకుకూడ రాధ అంటే అదొక వెర్రిప్రేమ—చాలా మంచిపిల్ల అని.

పడమటి సూర్యుని పవిత్రకిరణాలు తాతయ్య పాదాలపై పడి ప్రకాశిస్తున్నయ్.

'మనంకూడా వేద్దాం దావా. యెవరైతే నేం? కావలసింది న్యాయం.'

'వద్దండి. మీరుకూడా కోర్టెక్కితే నలుగురూ ఛీ ఛీ అంటారు.'

'నోరు ముయ్. వాడు నా కన్నయ్యాట! నా పిల్లకి, నాకూ ద్రోహాన్ని తలపెట్టాడు.'

'అవన్నీ మరచిపోండి. విడిపోయాంగా.'

'యెందుకు నాయనా, ఒకతల్లి బిడ్డలు యిలా కొట్లాడుకుంటారు?'—అక్కడే వున్న తండ్రి కలుగ చేసుకొని హితవును బోధించాడు.

'యిందులో కొట్లాట యేం వుందండి? వాడి పిల్లలకి పెద్దపెద్ద సంబంధాలుచేసుకొని ఒకే ఒక నా పిల్లని పేదయింటిలో పడవేస్తాడా? పెద్దకొడుకు—యింటి యజమానికి యిది సబబుగా వుందండి.'

'ఆ పిల్లల అదృష్టంరా అది. పేదయింటిలో పడవేసినా నీఅల్లుడికి వచ్చిన లోటేమిటి? సర్కారు వారి డాక్టరుగు; బుద్ధిమంతుడు. మొగసంతానం లేనందుకు ఆ పేదయింటిపిల్లడు కాబట్టి యిల్లరికం వచ్చాడు.'

'నేను కలుగజేసుకొని చదివించబట్టి సరి పోయింది. లేదా అంటే మీ రిలా ఆ కొడుకుపక్షాన మాట్లాడకపోయుందురు.'

'నిన్ను వృద్ధిలోనికి తెచ్చిందివాడేకదరా బాబూ! సమిష్టిగా వున్నపుడు యెవరు చదివిస్తే యేమిటని వూరుకున్నాడు. మధ్యనున్నవాళ్లు యిక్కడిదక్కడ, అక్కడిదిక్కడ పెడతారురా. మాటవరసకి అనుంటాడు. నిజంగా వాడు దావా వేస్తాడురా? కోర్టులెక్క డబ్బు తగలెయ్యటమే కాదు—పరువు నష్టందావా వేస్తే వున్న పరువును కాల్చేసుకుంటారు.'

'మీకు తెలీదు, వూరుకోండి.' కసురుతూ అన్న యీమాటల్లో విద్యుత్తు వుత్పత్తియై షాక్ తగిలినట్లనిపించింది. మెల్లగా లేచి మనుమరాలి గదిలోనికి పోయాడు. కళ్లలో నీరునింపిన రాధప్రక్కనే కూర్చొని ఆప్యాయంగా—

'యేమమ్మా రాధా! అలా...'

'తమ్ముడు రోజూ వచ్చి పెద్దక్క పెద్దక్క అని విడిచి పెట్టేవాడు కాదు తాతయ్యా. నిన్నటి నుంచి రానే లేదు. పెద్దమ్మ వెళ్లొద్దందేమో?'

'అయ్యో! తల్లీ! యింతా డబ్బుప్రభావమమ్మా. తల్లీ పిల్లలనీ, అన్నాతమ్ములనీ, అభిమానులనీ వేరుచేస్తుందమ్మా యీ హెచ్చుడబ్బు!'

౪

చలికాలం. సూర్యుడు కొంచెం మీదికి లేచాడు. చన్నీటిలో స్నానంచేసి గజగజ వణికి పోతున్నాడు తాతయ్య. 'రామా, కృష్ణా, కేశవా, నారాయణా...' అని బోసినోటితో వుచ్చరిస్తూ గదిలోకి పోయి ముఖాన్న పట్టెనామాలు దిద్దుకున్నాడు చేతిలో వణికే చిన్న అద్దాన్ని చూస్తూ.

'వేడినీరు స్నానం చేయలేకపోయారా?'

'వేడినీరు కృత్రిమమైనది నాయనా. స్నానం చేసినంతసేపూ వెచ్చగా వుంటుంది. తరువాత చలే కదా—నాయనా, యిలా ఒక్కసారి వస్తావురా?'

పెద్దకొడుకు తండ్రిదగ్గర కూర్చున్నాడు.

విరక్తిలేని కంఠస్వరంతో ఆప్యాయంగా అన్నాడు—'బాబూ! బుద్ధిమంతుడివి. న్యాయశాస్త్రం చదువుకున్నావు. తొందరలేదు. బాగా ఆలోచించి చెప్పు, నన్నేయింట్లో కాలం చెయ్యమంటావో?'

కొడుకు మొదట విస్తుపోయినా తరువాత ఆ ప్రశ్నలోని వ్యంగ్యాన్ని అర్థంచేసుకొని సిగ్గుతో తలదించాడు.

'తొందర లేదు. అవసరం వుంటే ఆఫీసుగదిలోని ఆ పుస్తకాలన్నీ తిరగవెయ్ నాయనా.'

చేతికర్ర త్రోవ చూపించింది. నడుంవంగిన నాన్న నడకను చూస్తూ అలా కూర్చుండిపోయాడు కొడుకు.

'పేరుపొందిన వైద్యుడివి. వూరిలో అందరి జబ్బులూ బాగు చెయ్యగలవేమో కాని నీనాన్న రోగాన్నే కనుక్కోలేవు. మరి నన్నెక్కడ కాలం చెయ్యమంటావ్? నీయింట్లోనా, నీఅన్నయ్యాయింట్లోనా? తొందరలేదులే. బాగా ఆలోచించి చెప్పు నాయనా!'—యీమాటలు విన్న చిన్నకొడుకు మొహంలో చెప్పదగిన మార్పేమీ గోచరించలేదు. పైగా ఆ మాటలు సరిగ్గా వినిపించుకోలేదనవచ్చు. ముసలివాళ్లు యేదో పిచ్చివేదాంతం మాట్లాడతారని ఆ ఎల్. ఎమ్. పి. డాక్టరు నమ్మకం!

౫

బ్యాండుమేళం. యింటినిండా చుట్టాలు. చాలా సందడిగా వుంది. తాతయ్య వీధిఅరుగుమీద కూర్చున్నాడు. 'నాయనా, యిలా రా' అని పిలిచాడు తాతయ్య. 'పెద్దవాడివి, తప్పు చెయ్యకురా' అన్నాడు. అడ్డుగా వచ్చింది కోడలు: 'మీరు వూరుకోండి. యిక బుద్ధులు చెప్పక్కరలేదు. కూతురుకడుపులో చిచ్చుపోసినవాడిని కూతురుపెళ్లికి తగుదునమ్మా అని వెళ్లి పిలుస్తాను?'

'శుభకార్యమమ్మా. యీక్షణమైనా విభేదాలు మరచిపోండి.'

'ఆయనమాటల కేమిటి? యిద్దరం యిక్కడ వుంటే యెలా? రండి' తీసుకపోయింది ధర్మపత్నమ్మ.

'ఒరే నరసింహులూ, యిలా రా నాయనా... పెద్దకుటుంబీకుడివి. యీనాటికైనా ఆలోచించురా. నీవియ్యంకుడిని యెలాగైనా చిన్నవాడిదగ్గరకు వెళ్లి పెళ్లికి రమ్మని పిలమనరా.'

'నామాట వింటారండీ మామయ్యగారూ ?'

'అయ్యో నాయనా! మధ్యను మీలాంటివాళ్లుండి వాళ్ళ మనసులు మరీ పాడుచేస్తున్నారురా!' యెత్తిగించి ఒకసారి చూచి వెళ్ళిపోయాడు నరసింహులు.

౭

'ఆరోగ్యం మహాభాగ్యం నాయనా. ఇంత రాత్రివరకూ ఆపుస్తకాలు తిరగవేసుక కూర్చోకు.'

'రేపు ఒకకేసు వుందండీ...'

'నాయనా! అమ్మాయిపెళ్లి అయిపోయింది కదరా' అంటూ యెదురుగా కుర్చీమీద కూర్చున్నాడు తండ్రి.

'బుద్ధిమంతుడివి. వున్న ఆస్తిఅంతా నీఒక్కడి చదువుక్రిందే యెందుకు పెట్టాను? నా తను వుండగా యిద్దరూ యిలా ద్వేషంతో మెలగటం చూడలేక పోతున్నాను. దాఖలుచేసిన కేసు వుపసంహరించుకో నాయనా.'

'వా డింకా చిన్నవాడండీ? పిల్లకు అంత గొప్పయింటి సంబంధం స్థిరమైతే యెలా విఘ్నం చేశాడో మీకు తెలీదా? అంతతో వూరుకోకుండా మేమేదో మాలకూడు తినేస్తున్నామనీ, మాయిల్లు పాని గొంపనీ అంటూంటే యెలా సహించమంటారండీ!

'నీకెదురుగా అన్నాడా? పోనీ, అన్నాడే అనుకొందాం. వాడుచేసిన పాపానికి శిక్షించేవాడు శ్రీమన్నారాయణమూర్తి వుండగా మానవమాత్రుడవు నువు దేవునిపని చేస్తాననటం బాగాలేదు. నీ తిన్నసైన త్రోవలో నీవు పో బాబూ. విద్వేషాలు పెరగటం వలన లాభం యెప్పుడూ వుండదు. తొందర లేదు. బాగా ఆలోచించు. నీ అంతరాత్మను ప్రశ్నించు.'

తండ్రిమాటలకు మౌనాన్ని దాల్చాడు.

'నాయనా! కాలం దగ్గరపడిందిగా. యీవేళ చెప్పరా, నన్నే యింట్లో కాలం చెయ్యమంటావో?'

కొడుకు తల దించాడు. సమాధానం తోచక మౌనం పొంచి వింటున్న రత్నమ్మ రంగంలోకి దిగింది. 'ఆ కాలానికి మన యిష్టాయిష్టాలు పనికి వస్తాయా? కొడుక్కి బాగా వేదాంతం బోధపరుస్తున్నారు. సన్యాసులం కాం!'

మెల్లగా లేచాడు. 'అమ్మా! పులి చాలా క్రూరమృగమమ్మా. తన పిల్లలను చంపి తినటానికికూడ జంకదు. విద్వేషం ఆవరించిన మనిషి అలాంటివాడే. నీ ఒక్క కొడుకు తప్పుచేస్తే, క్షమిస్తావా లేదా? నీ ఒక్క మరిదీ కొడుకుతో సమానం కాదమ్మా — క్షమించలేవా ?'

'చిన్నకొడుకు ముద్దు. ఏం అనలేరు. ఎటొచ్చీ మేం మెత్తగా కనిపిస్తున్నాంగా' రత్నమ్మ కటుస్వరంలో అన్న మాటలకు భర్త వెంటనే 'రత్నం! వూరుకో' అన్నాడు మందలింపుస్వరంతో.

'వినేవాడికే చెప్పాలని వుంటుందమ్మా. యీ కేసుల్లో ఫలానావాడి కొడుకులంటారే తల్లీ' అంటూ గదిలోనుంచి వెళ్లిపోయాడు.

౮

'ఒంటిగంట దాటింది. యింకా నిద్రపోరండీ' యెలుగెత్తి యేకకంఠంతో దైవప్రార్థన చేసుకొంటున్న తండ్రిగదిలోనికి వచ్చి ప్రశ్నించాడు పెద్దకొడుకు.

'నాయనా! నిద్రపోయేబదులు ఆ కాలంలో ఆ దేవుడ్ని ప్రార్థిస్తే నే చేసిన పాపాలను క్షమిస్తాడు.' మరల ప్రేమ వుట్టిపడే స్వరంతో తల దించియున్న కొడుకువేపు చూస్తూ 'చిన్నబుచ్చుకోకురా నాయనా. నిన్ను ఆస్తిపాస్తులమ్మి చదివించటంవల్ల యీపాపం అంతా నాకే చుట్టుకుందిరా. పెద్దకొడుకు చదువుకొని జ్ఞానవంతుడై పొట్ట పోషించుకొని చిన్నవాడిని పైకి తేస్తాడు; యిద్దరూ సఖ్యంగా వుంటారనుకున్నానురా. కాని యింకోలా జరిగింది. చదువు చెప్పించకపోయినా, ఆ నాగలిని నమ్ముకొనైనా సఖ్యంగా వుందురేమో? న్యాయశాస్త్రం నీకు న్యాయదృష్టిని ప్రసాదిస్తుందనుకొన్నా-కాని...' గొంతులో కంపం బయలుదేరింది.

కొడుకుశరీరం ఝల్లుమన్నది. తను అపరాధం చేశానని బాధపడ్డాడు. తండ్రిమీది సహజమైన అభిమానం, భక్తి కట్టలు తెంచుకొని ప్రవహించింది. దగ్గర కూర్చున్నాడు.

బిగబట్టిన పెదిమలు దగ్గరగా వచ్చిన కొడుకును చూడగానే విడిపోయాయి. గడ్డకట్టుకుపోయిన ఆవేదన

కొడుకు ప్రసరించిన తీవ్రకరుణాదృష్టులకు కరిగి అశ్రు రూపంలో రాల సిద్ధంగా వుంది.

'నీ తాతముత్తాతలనుంచీ న్యాయానికి పేరు పడిందిగా మన వంశం. నీ తాత ఆముదందీపంయెదుట చదివించిన రామాయణభారతాలలోని సారంతో యీపొట్ట చల్లగా వుండేది. కాని, యీ ముడుతలుపడిన పొట్ట యెంతగా మండిపోతున్నదో చూడు నాయనా' అంటూ కొడుకుతలను అభిమానంతో పట్టుకొని పొట్టకు ఆన్చాడు.

శ్వాస బిగబట్టి అంతవరకూ దుఃఖాన్ని ఆపుకున్న న్యాయవాదికళ్లు తడిసిపోయినై. ముఖం సిగ్గూ, ఆవేదనల్లో మునిగిపోయింది. జారిన రెండేరెండు కన్నీటి బిందువులు ముడుతల మధ్యనుంచి వడిగా జారిపోయాయ్.

మెల్లగా లేచి కూర్చున్నాడు తండ్రి. కొడుకు కన్నీటిని తుడిచి 'యెప్పటికైనా న్యాయానికి కట్టుబడతావని యిన్నాళ్లూ పొంగుతున్నాను' తండ్రిమాటలకు హఠాత్తుగా మధ్యనే అడ్డి అప్రయత్నంగా చేతులు జోడించి 'క్షమించండి. కేసు వుపసంహరిస్తాను. రెండో విషయం, మీ కలా న్యాయమని తోస్తే అలా చెయ్యండి' అంటూ నాన్నమీది అభిమానం ఆయన కాళ్లను బంధించినా తను వంశానికి అపకీర్తి తెచ్చానవనే బాధ పిశాచమై వెంటతరిమింది. తన గదిలో పరుపుమీద పడి హృదయాన్ని గట్టిగా నొక్కి పట్టుకున్నాడు.

౨

చిన్నవాడికి యెన్నివిధాల చెప్పినా వినిపించుకోలేదు. మొదట కేసువేసింది నీవేకదరా? లేనివి కల్పించి వాడిమీద అలా అనవసరంగా విరుచుకు పడ్డావ్. కృతఘ్నుడివిరా. నీయింట్లో నేను చావలేను. నాకు ఒక్కడేకొడుకును దేవుడు ప్రసాదించాడనుకుంటాను' హృదయం విప్పిచెప్పి పెద్దకొడుకుయింటికి చేరుకున్నాడు.

రత్నమ్మ వియ్యంకుని యింటినుంచి తిరిగి వచ్చింది. ఆరాత్రి గదిలో భార్యతో అన్నాడు— 'రత్నం, భూమి అమ్మటం నా కిష్టంలేదు. అంతే బంగారం నీవు మోయలేక పోతున్నావ్. కాసులపేరు, వడ్డాణం నా క్కావాలి.'

రత్నమ్మ యీమాటలు విని చకితురాలయింది. 'అలా చూస్తావేం? నీకు డబ్బు ప్రధానమా? వంశ మర్యాద నిలపటం ప్రధానమా?' అని ప్రశ్నించాడు.

రత్నమ్మ సబ్బురా లైంది. ఆమెజవాబుకు యెదురుచూడకుండానే అన్నాడు: 'నాకు కావలసింది యీ వంశమర్యాద నిలపటం. యెవరు అడ్డురానీ నా త్రోవలో నే పోతాను.' ఆరాత్రి స్వార్థం గెలిచా ననుకుంది. కాని అది నైతికవిజయం కాదు.

వేకువజామున తండ్రి హరినామస్మరణ వినగానే 'ఛీ! స్వార్థానికి త నెప్పుడూ తలవంచి దాసోహం అన'నని భీష్మించుకున్నాడు.

గృహంలో భీకరసంగ్రామం జరిగింది. అకస్మాత్తుగా తగిలిన చెంపపెట్టతో రత్నమ్మ అలా కూర్చుండిపోయింది.

'నాయనా! తప్పురా. గృహలక్ష్మి!' అంటూ కేక వేసి చెవులు మూసుకున్నాడు ముసలి.

బంగారం అమ్మి ఒకవేయి కోర్టులో కట్టి తిరిగి వచ్చాడు. కేసులగొడవ పోతే తను హాయిగా యీ లోకం విడిచిపెట్టవచ్చని తండ్రి ఆశించాడు. కాని, యీ గృహకలహం దావానలం అయింది. ఆశతో బ్రతికే గృహిణిని యిల్లువిడిచి పొమ్మన్నాడు.

ఈగలభా చూచి మృత్యువులోనే తనకు శాంతి వరిస్తుందని ముసలిమస్తిష్కంలో ఆలోచన ప్రవహించింది. మాటిపోటులు తప్పించి, కర్ణకఠోరమైన మాటలకు గుండె పగిలి పెద్దపెట్టున యేడ్చుకుని కుమిలి పోయాడు. యిదంతా ఆశయొక్క ప్రభావమని సంభావించుకుని కొడుకున్యాయప్రవర్తనను శ్లాఘించి కోడలు చేసిన అపచారాన్ని మరచిపోడానికి ప్రయత్నించేవాడు.

తమ్ముడు కేసు వుపసంహరించలేదు. వాదనల వరకూ వస్తే వంశమర్యాద భస్మమైపోతుంది. అన్నయ్య తమ్ముడు కల్పించిన నేరాలకన్నిటికీ ఒప్పుకున్నాడు. నగ లమ్మి పరువునష్టానికి పరిహారం కట్టాడు. యీ గృహకలహానికి యిదే యెదురుగా కనుపించే కారణం!

౩

లోకులు చేత లెత్తి నీది తప్పని చూపించకుండా తనే స్వయంగా వెళ్లి తమ్ముని పిలిచాడు మృత్యుముఖంలో వున్న తండ్రిని చూడటానికి రమ్మని. రాలేదు సరిగదా, తను భరించలేకపోతే తనయింటికి పంపించమన్నాడు. యీమాటలు నిందుచూలాలు రాధకూ, అల్లునికీ కష్టాన్ని కలిగించాయ్. కాని, ఆ రాక్షసునిదగ్గర ఆ వడిలో యెదురాడే ధైర్యం వారికి లేకపోయింది.

తనూ స్మశానానికి వెళ్లాడు. తనూ తనయింట్లో శ్రాద్ధం చేశాడు. తనపని అంతా తనకు తిన్నగానే వుంది. యింట్లోవారే హర్షించలేకపోయారు. ఎందుకీ ద్వేషం? కొందరు కళ్లు తెరిచి చూస్తారుగాని, నిదానం అలవరచుకోరు. ఎదురుగా వున్న గోముఖ వ్యాఘ్రాన్ని గోవు అనుకుంటారు. గట్టివాళ్లమని గంతే యీరకంవాళ్లను యెలా కబళించటమో ఆ వ్యాఘ్రానికి తెలుసు!

తండ్రి చెప్పిన మాటలయందు విశ్వాసం వుంది ఐనా దేవుళ్లకు మ్రొక్కటం మానలేదు. రత్నమ్మ విషాక్తమయిన హృదయాన్ని మామయ్యగారి తదనంతరం మధుసిక్తం చేయవలసివచ్చింది. చెయ్యక విధిలేదు. ఇక యెవరిమీద ఆ విషబిందువుల వర్షం కురిపిస్తుంది? భర్తమీదనా? నన్ను బ్రతకనీయ్ అంటాడు. తండ్రిని తలుచుకొని చిన్నపిల్లాడిలా కన్నీరు కారుస్తాడు. లాలించవలసిన భార్య యింకేం కోపాన్ని చూపిస్తుంది?

'రాధను ఆస్పత్రిలో వేశారు. చాలా కష్టపడుతోంది. వెళ్దామా?' అని భార్యఅనుమతిని కోరాడు. త్రోవలో 'రత్నం! రాధంటే నీకు ప్రేమకదూ. అలాంటి మంచి కూతురుకు యెలాంటి ఆపద వచ్చిందో. నాన్న చెప్పారు. దాని ప్రాణానికి యేం అపాయం వుండదు' అన్నాడు వకీలు భార్యతో. ఆసుపత్రిలో పెద్దక్కా అని పరుగెత్తబోయాడు కుర్రవాడు. కొద్ది నిముషాలలోనే పెద్దక్కకు పాపాయి పుట్టిందని గంతులేశాడు.

శివాలయంలో అన్నదమ్ములు ఒకేనాడు యెదురవవలసివచ్చింది. అన్న ముఖం కళగా వుంది. తమ్ముని ముఖం ధుమధుమలాడుతోంది—కుమార్తెకు లేక లేక కలిగిన సంతానం ఆడపిల్ల అవటంచే ఆశాభంగం కలిగింది. రాధ పెదనాన్నను, రత్నమ్మను విడువలేకపోయింది. ఆమెకోసమేగా యీ పూజాపురస్కారాలన్నీ.

నాలుగునెలలు గడిచాయ్. మా ముఖం చూచైనా క్షమించమని రాధ భర్తతో వచ్చి రత్నమ్మను, పెద్దనాన్నను బ్రతిమాలింది. ఒకేఒక పుత్రునిమీదనున్న ప్రేమకొద్దీ రత్నమ్మ గట్టిగా యేడ్చింది. న్యాయవాది ముఖంలో చిరునగవే తాండవిస్తోంది. వాళ్ల నద్దేశించి అన్నాడు:

'కాబోయే పెళ్లాన్ని చూడాలన్న ఆశతో మనవాడు దొంగతనంగా యెందుకు వెళ్లాడు?'

గాయాలకు కట్టిన కట్లతో వున్న కుర్రవాడికి తెలివివచ్చి కళ్లు తెరవగా కనపడ్డ రాధను 'పెద్దక్కా' అని ప్రేమవుట్టిపడే స్వరంతో కేకవేశాడు. రాధ తమ్మునిదగ్గర కూర్చుంది. తమ్ముడు, యింటికి రావద్దని మందలించినా దొంగతనంగా వెళ్లి పెద్దక్క కూతురు రోహిణి వుయ్యాలదగ్గర కూర్చొని వూసులాడేవాడు. కాని ఆనాడు మెట్లు దిగుచుండగా చిన్నానకు దొరికిపోయాడు. ఆయన వేసిన కేకకు హడలిపోయి మెట్లమీదనుంచి క్రిందికి దొర్లాడు. గాయాలు తగిలాయ్.

న్యాయవాది తాతయ్యకోరకను యెఱుకపరిచాడు. 'దాని వయసెంత నాన్నా. అయినా కాదనటానికి మానో గెలా వస్తుంది?' అని ముక్తసరిగా తేల్చింది రాధ పొంగిపొరలే ఆనందాన్ని కప్పిపుచ్చటానికి ప్రయత్నిస్తూ.

యీ సంఘటన జరిగిన పదిహేనేండ్లతరువాతి విషయం: ఇంటియజమాని కళ్లుకప్పి దాచిన డబ్బుతో కొన్న కారులో ఆ యజమానికొడుకు స్వేచ్ఛగా తిరుగుతున్నాడు భార్య రోహిణితో. దాచిన గుర్రపుకాసులతో చేయించిన నగలు అన్నయ్యకోడలి ఒంట నున్నాయ్. అన్నయ్య చేతులారా ధనం వెచ్చించి కట్టించిన మేడలో అన్నయ్యకొడుకుదే సర్వాధికారం. తమ్ముడు విద్వేషాన్ని పెంచి న్యాయానికి కట్టుబడక ఆర్జించిన ఆస్తిపాస్తులకు వారసుడు అన్నయ్యకొడుకే అయ్యాడు.

ఒకవాడు వెలిగే ప్రపంచం యీనాడు ఆయన కంటికి గాఢాంధకారం. ఒకరోజు ఆనందసముద్రములో మునిగిపోయినవాడు యీరోజు శాశ్వతమనఃక్లేశంతో కూర్చుంటాడు రెప్పలు ఆడిస్తూ. తెల్లవారేక స్నానం చేయించి, తూరుపుదిశ మోము త్రిప్పి భార్య కూర్చొబెడితే, చేతు లెత్తి సూర్యభగవానునకు నమస్కరిస్తాడు, నేత్రదానం చేయమని కామోసు-కాలవశమున మశూచివలన గ్రుడ్డివాడైన తమ్ముడు. ఆ దృశ్యాన్ని చూచి అన్నయ్య విచారిస్తాడు. రాధా, రోహిణీ కళ్లంట నీరు తెచ్చుకుంటారు.

కాలం శాసించిన శాసనాన్ని ధిక్కరించే తాహతు మానవునికి లేదు. అనవసరవిద్వేషాన్ని పెంచినవాడు న్యాయానికి కట్టుబడలేడు. న్యాయానికి కట్టుబడలేనివాడు దుర్బలుడు. వానికి పరాజయం తథ్యం!

నిర్దిష్టసమయంలో ఈ పురోడాశాన్ని ఆహుతి చెయ్యాలి. ఇదంతా అధ్వర్యుడి పని. పనిలో ప్రతి అంశానికీ విహితమైన యజుర్మంత్రాలున్నాయి.

ఇది ప్రధానయాగవిషయం. ఈ యాగానికి పూర్వమున్నూ, తర్వాత చెయ్యాల్సిన అప్రధాన యాగాలు కొన్ని ఉన్నాయి. ఇవి కర్మాంగాలు. కొన్ని హోమాలుకూడా ఉన్నాయి.

## యాగం, హోమం :

యాగానికీ, హోమానికీ తేడా ఉంది. యాగంలో ఆహుతి ఇచ్చేది అధ్వర్యుడు; మంత్రాల్ని పఠించేది హోత. మంత్రాంతంలో ఉచ్చరింపబడే 'వౌషట్' శబ్దమే వషట్కారం. ఈ వషట్కారోచ్చారణకాలంలోనే అధ్వర్యుడు అగ్నిలో ఆహుతుల్ని వ్రేలుస్తాడు. ఈ క్రమంతో కూడింది యాగం.

హోమరీతి ఇంతకంటేకూడా సంక్షిప్తం. దీనికి హోతతో పనిలేదు. అధ్వర్యుడు అగ్నిపార్శ్వాన ఆసీనుడై, తానే యజుర్మంత్రాల్ని చదువుతాడు. మంత్రాంతాన 'స్వాహా'శబ్దాన్ని ఉచ్చరిస్తాడు. ఇదే స్వాహాకారం. స్వాహాకారోచ్చారణకాలంలో అగ్నిలో ఆహుతిని వేస్తాడు. ఇది హోమక్రమం.

పూర్ణమాసకు పూర్వాపరంగా చెయ్యాల్సిన యాగహోమాల్ని సరించి యథాక్రమంగా వర్ణింపబడుతుంది.

## ఋత్విక్కులు నల్గురు :

అసలు పూర్ణమాసకు నలుగురు ఋత్విక్కులు కావాలి. యజుర్వేదాభిజ్ఞుడైన అధ్వర్యుడి అవసరం పైనే చూచాం. ఈ యాగంలో, చెప్పాలొస్తే, ఈయనే ప్రధానం. అధ్వరశరీరనిర్మాత. రెండో ఆయన హోత. ఈయన ఆహుతికి పూర్వం మంత్రాల్ని పఠించి దేవతల్ని యజ్ఞభూమికి తీసుకొస్తాడు. ఈయన పఠించేవి ఎక్కువగా ఋఙ్మంత్రాలే (ఇష్టి యాగంలో సామగానం చేసే ఉద్గాతతో ప్రయోజనం లేదు.). మూడవ ఆయన బ్రహ్మ. హోతాధ్వర్యుల కార్యక్రమాన్ని పర్యవేక్షించటమే ఈయనపని. పొరపాటు వస్తే దిద్దుతాడు. నాల్గవ ఆయన అగ్నీత్తు—బ్రహ్మకు సహకారి. ఈ నల్గుర్నీ కూడదీసికొనే పూర్ణమాసయాగాన్ని ఆరంభించాలి.

## వ్రతగ్రహణం :

యాగానికి పూర్వదినం అపరాహ్ణపూర్వాహ్ణ సమయాల్లో చెయ్యాల్సిన క్రియలు రెండున్నాయి. అవి వ్రతగ్రహణ, అన్వాధానాలు. పూర్వాహ్ణంలో యజమాని గార్హపత్య, ఆహవనీయ, దక్షిణాగ్నుల్లో క్రమంగా ఒక్కొక్క సమిత్తు వేసి, అగ్నిని యజ్ఞానుకూలం చేస్తాడు. నేను రేపు యాగం చేస్తాను, సిద్ధంగా ఉండుసుమా అని అప్పుడే అగ్నికి చెప్పి ఉంచుతున్నా డన్నమాట. అపరాహ్ణం క్షురకర్మ చేసుకొని, స్నానం చేసి, కొంచెం ఏమైనా తింటాడు. తర్వాత అగ్నికి పక్కగా నిల్చి, నేను సత్యాన్నే పల్కుతాను మొదలుగాగల కొన్ని నియమాల్ని పాలించటానికి ప్రతిజ్ఞాబద్ధు డవుతాడు. ఇది వ్రతగ్రహణం. పత్నీసహితంగా రాత్రి యజ్ఞశాలలోనే గడపాలి.

## వరణం :

మరునాడు నిత్యాగ్నిహోత్రకర్మానంతరం ఇష్టియాగం ప్రారంభం చెయ్యాలి. ప్రథమం బ్రహ్మవరణం. వరణానంతరం బ్రహ్మ ఆహవనీయానికి దక్షిణంగా ఆసనాన్ని స్వీకరించి, కర్మ నంతటినీ పర్యవేక్షిస్తాడు. బ్రహ్మకు వామభాగం యజమాని కూర్చుండే చోటు. యజమానపత్ని గార్హపత్యానికి దక్షిణంగా అధివసిస్తుంది. ఆవిడ గృహిణి అయినందువలన గార్హపత్యంతోనే విశేషసంబంధం. వేదికి ఉత్తరంగా హోతా అగ్నీత్తులు ఉంటారు. అధ్వర్యుడికి యాగకాలంలో కూర్చుంటానికి వీలుండదు. దీనికీ దానికీ కదుల్తూ ఉండాలి.

## ప్రణీత :

వరణానంతరం బ్రహ్మ స్వస్థానాన్ని అలంకరించిన తర్వాత, ప్రణీతా—ప్రణయనకర్మ, ప్ర- అనే ఉపసర్గకు అర్థం సమ్ముఖం; అనగా పూర్వముఖం. ప్ర-నయనశబ్దార్థం పూర్వాముఖంగా తీసికొ

పోవటం—కాసిని నీళ్లు పూర్వముఖంగా తీసికోవల్లి, ఆహవనీయానికి పక్కగా ఉంచాలి. వేదికి తూర్పుగా ఆహవనీయం ఉండాలి. ఈ నీటిపేరు ప్రణీత. యాగం ముగిసేవరకూ ఆ నీరు అక్కడే ఉండాలి, యజ్ఞరక్షణార్థం. "జలం అసురులకీ, రాక్షసులకీ వజ్రం. దీన్ని చూస్తే వాళ్లు యజ్ఞభూమికి రారు" అని శతపథ బ్రాహ్మణం.

## వస్తువుల పద్దు : 

ఈలోగా అధ్వర్యుడు యజ్ఞానికి కావాల్సిన వస్తువులన్నిటినీ సంపాదించి, చక్కగా ఏర్చి కూర్చుకొంటాడు. యథాసమయంలో వాటిని వేదిమీద అమరుస్తాడు. ఇష్టియాగానికి కావల్సిన వస్తువులు చాలా ఉన్నాయి. అన్నిటినీ కాకపోయినా, కొన్నిటినయినా తెల్సుకోవాలి.

(౧) మూడుసమిత్తుల్తో ఆహవనీయాగ్నిని చుట్టాలి. ఈ సమిత్కాష్ఠానికి సంజ్ఞ పరిధి. యాగానికి పూర్వం అగ్నిని ప్రజ్వలింపజేయటానికి వేరుగా కొన్ని సమిత్తులు ఉంచుకోవాలి. ఈసమిత్కాష్ఠాన్ని యాజ్ఞికులు సమింధనం అంటారు. అధ్వర్యుడు ఒక్కొక్క సమిత్తండాన్ని ఆహవనీయంలో వేస్తాడు. హోత ఒక్కొక్క ఋక్-మంత్రాన్ని చదువుతూఉంటాడు. అగ్నిసమింధనానికి ప్రయుక్తాలయ్యే ఈమంత్రాల్ని సామిధేనిమంత్రాలంటారు.

(౨) దర్భపరకలు కొన్నిటితో పనిపడుతుంది. వేదిమీద వీటిని పరిచే యజ్ఞద్రవ్యాల్ని ఉంచాలి. కొన్నిపరకల్ని కలిపి కట్టాలి. ఇల్లా కట్టబడినదాని పేరు ప్రస్తరం. ఆహుతిసాధనమైన జుహూవును ఈ ప్రస్తరంమీదే ఉంచాలని నియమం.

(3) పూర్ణమాసయజ్ఞంలో ప్రధానయాగానికి ఆహుతి పురోడాశం. పూర్వాపరాల్లో చెయ్యబడే అప్రధానయాగాల్లో ఆహుతిద్రవ్యం ఆజ్యం. ఈ ఆజ్యం ఉంచబడే మూకుడే ఆజ్యస్థాలి. ఆజ్యాన్ని తీసికొంటానికిగాను నాల్గు కఱ్ఱగరిటెలు కావాలి. ఒకదాని పేరు ధ్రువం. వేదిపైన ఇది స్థిరంగా ఉంటుందికాబట్టే దీనికి పేరు. ఆజ్యస్థాలినుండి ఆజ్యాన్ని ఈ ధ్రువంలో పొయ్యాలి. యాగకాలంలో దీంట్లోనుంచే ఆజ్యాన్ని తీసికోవాలి. ఇల్లా తీసికొంటానికి ఉపయోగింపబడే చమ్చాపేరు స్రువం. ఇంకో పెద్ద గరిటె ఉంటుంది; దాని పేరు జుహూవు. ఆహుతిసమయంలో అధ్వర్యుడు స్రువంతో ధ్రువం నుండి ఆజ్యాన్ని తీసి, జుహూవులో పోస్తాడు. నాల్గో గరిటె పేరు ఉపభృత్తు. ఇది జుహూవుకంటె చిన్నదిగా ఉంటుంది. యజ్ఞసమయంలో అధ్వర్యుడు దక్షిణహస్తంతో జుహూవునూ, వామహస్తంతో ఉపభృత్తునూ పట్టుకొంటాడు. ఉపభృత్తు జుహూవుకు నిమ్నంగా ఉండాలి. జుహూవులో ఉన్న ఆహుతి ద్రవ్యం నేలమీద పడకూడదు. దైవాత్తుగా పడితే, ఉపభృత్తులోనే పడుతుంది.

(౪) పురోడాశాన్ని తయారుచెయ్యటానికిగాను కొన్ని వస్తువులు కావాలి. నిత్యాగ్నిహోత్రంలో ఉపయోగింపబడే అగ్నిహోత్రహవణి. ఇ యాగంలో ఇది ధాన్యాన్నిగాని, యవల్నిగాని తీ కొనిరావటానికి పనికి వస్తుంది. ఉలూఖలముసలాలు : ఆ ధాన్యాన్ని రోట్లో వేసి రోకట్లో దంచాలి. శూర్పం : దంచినదాన్ని చెరగటానికి చేట. దృషదుపలాలు: రాతిపలకమీద ఆధాన్యాన్ని వేసి పొత్రంతో దాన్ని నూరాలి. శమ్య మనబడే కాష్ఠఖండం : దీన్ని రుబ్బేటప్పుడు కింద పెట్టే పలక పీటవాలుగా ఉండి, నూరటానికి వీలవుతుంది. కృష్ణాజినం: నల్లలేడిచర్మం. దంచేటప్పుడు ఉలూఖలానికి కిందా, నూరేటప్పుడు సన్నికల్లుకుకిందా దీన్ని పరచాలి. ఈ ఆరువస్తువులూ లేకపోతే పురోడాశాన్ని తయారు చెయ్యటానికి వీల్లేదు.

## అంతా సిద్ధం : 

అధ్వర్యుడు వేదిమీద ఈ సరంజామానంతట్నీ పరచిన దర్భలమీద ఉంచుతాడు. తర్వాత యాగం కోసం ఆహవనీయాగ్నిని బాగా మండించాలి. దీని పేరే అగ్నిసమింధనం అని పైనే చెప్పాను.

వస్తువుల నన్నిట్నీ సమకూర్చుకోటం అయింది. పురోడాశం తయారై వేదిమీద యథాస్థానాన్ని

ఉంది. ఆహవనీయాగ్ని జ్వలిస్తోంది. ఇంక దేవతల్ని ఆహ్వానించటమే తరవాయి. ఈ పిలవటం హోతపని.

## దేవతాహ్వానం :

కాని, హోత సామాన్యమానవుడు. అతడు పిలిస్తేమటుకు దేవతలు ఎందుకు పలకాలి? అగ్ని స్వయంగా దేవతల హోత. (అగ్నిం ఈళే పురోహితం, యజ్ఞస్య దేవం ఋత్విజం, హోతారం రత్నధాతమమ్, ఇత్యాది చూ.) అందువల్ల ఆయన్ని ఆ పనికి వినియోగించాలి. మళ్లా, అగ్ని నెవరు పిలవాలి? హోతాధ్వర్యు లిద్దరున్నా. వీళ్ల ఆహ్వానాన్ని మటుకు అగ్ని ఎందు కంగీకరించాలి? ఎందుకు వినాలి?

ప్రాచీనఋషులు మంత్రద్రష్టలు. అలౌకికశక్తి వల్ల లభించిన మంత్రాల్తో వాళ్లు అగ్నిని పిల్చేవాళ్లు. అది అగ్నికి వినిపించీ వినిపించటంతోనే, ఆయన కదలివచ్చేవాడు. ఎవరిమటుకు వాళ్లు వాళ్లవాళ్ల అగ్నినే పిల్చుకొనేవాళ్లు. ఆయా ఋషుల అగ్ని పేరు ఆర్షేయాగ్ని. ప్రవరాగ్ని అని ఇంకో పేరు. దేవతాహ్వానంకోసం చేసిన హోతృవరణం పేరు ప్రవరణం. ఈ యజమాననియుక్తహోత సామాన్యమానవుడు. కాని, అగ్ని దేవహోత. ఈ దేవహోతనుకూడా ప్రవరణం చెయ్యాలి. యజమానగోత్రప్రవర్తకులైన ప్రాచీనఋషుల పేరు చెప్పి పిలిస్తే, ఆ అగ్నికి ఆ పిలుపు అందుతుంది. అందువల్ల మొదట్లో ఆయా ఋషుల నామాల్ని అనుసరించి దేవహోతను పిల్చి, పిదప ఆ అగ్నికి ప్రతినిధిగా, మానవహోతను వరించాలి. ఈరీతిగా నియుక్తుడైన మానవహోత ఆ పూర్వఋషుల అగ్నిని ఆహ్వానిస్తాడు. ఈ అగ్నిదేవతనే దేవతాహ్వానంకోసం అనురోధిస్తాడు. వరణానంతరం హోత వేదికి ఉత్తరంగా కూర్చుంటాడు.

మనకు యజ్ఞోపవీతం అంటే గౌరవంపోయింది. కోటులాగా దాన్ని చిలక్కొయ్యకు తగిలించి ఇతర పనులు చూసుకొనే మహానుభావులు ఉన్నారు. మళ్లీ వాటికి ఇనప్పెట్టెతాళంచెవులు జోడించి నవీనంగా యజ్ఞోపవీతంయొక్క ఉపయోగిత్వాన్ని నిరూపించిన మహాశయులూ ఉన్నారు. వాళ్లలో ప్రవర చెప్పలేనివాళ్లూ, అసలు ప్రవరంటే ఏమిటో తెలియనివాళ్లూ ఉన్నారు. ౧౯౫ కోట్ల సంవత్సరాల్నించి వీటి కున్న మర్యాద మన తరంలో పోతుంటే, మనం నిర్లిప్తతతో చూస్తూఊరుకోటం మన సంస్కృతికే పరాభవం. ఒక శతాబ్దం పోయాక, మళ్లీ ప్రవరలకోసం రీసెర్చి చెయ్యాల్సిన ప్రారబ్ధం తగలకుండా ఉండేందుకు, ఇప్పుడే వాటిని ఎవరైనా శ్రమతీసికొని గ్రంథస్థంచేస్తే బాగుంటుందని ప్రాసంగికంగా ఉత్సాహపరులకు మనవి చేస్తున్నాను. ఇది ప్రసంగాంతరం. ఇక ప్రకృతానికి మరలుదాం.

హోత ఆసీనుడైనతర్వాత యాగం ఆరంభం. ఒక్కొక్కయాగాన్ని గురించి విచారిద్దాం.

## ప్రయాజ :

(౧) ప్రధానయాగానికి ముందుగా చెయ్యాల్సింది ప్రయాజయాగం. ఆహుతిద్రవ్యం ఆజ్యం. అధ్వర్యుడు ఘృతంద్వారా మొదట్లో ఆఘారహోమం చేసి దీన్ని చేస్తాడు. ఐదుగురు దేవతల్ని ఉద్దేశించి ఐదు ఆహుతులు. దేవతల పేర్లు మనకు ఇప్పుడు విచిత్రంగా ఉండొచ్చు. వారి పేర్లు: సమిత్-దేవత, తనూనపాత్-దేవత, లేక యజమానిగోత్రభేదాన్ననుసరించి నరాశంస-దేవత, ఇడా-దేవత, బర్హి-దేవత, స్వాహాకార-దేవత.

## ఆజ్యభాగం :

(౨) ఈ పంచప్రయాజానంతరం అగ్ని నుద్దేశించి ఒకసారి, సోముణ్ణి ఉద్దేశించి ఒకసారి ఆజ్యాహుతి ఇవ్వాలి. దీని పేరు ఆజ్యభాగదానం.

## ఉపాంశుయాగం :

(౩) ఆజ్యభాగదానంతర్వాత ప్రధానయాగం. అగ్ని నుద్దేశించి ప్రథమపురోడాశం. అగ్నినీ, సోముణ్ణీ ఉద్దేశించి ద్వితీయపురోడాశదానం. ఈ రెంటికీమధ్య అగ్నిసోములకు కొంచెం ఘృతాహుతి.

ఈ ఘృతాహుతిసమయంలో మంత్రపాఠం అనుచ్చస్వరంలో జరుగుతుంది కాబట్టి దీని పేరు ఉపాంశుయాగం.

### స్విష్టకృత్తు :

(౮) అనంతరం స్విష్టకృత్-యాగం. రెండు కపాలాల్లో ఉన్న పురోడాశాన్ని అంతటినీ ఆహుతి చెయ్యకూడదు. కొంచెం మిగల్చాలి. దీంట్లోంచి కొంచెం కోసి, తీసికొని అగ్ని-స్విష్టకృత్తు నుద్దేశించి ఆహుతిచెయ్యాలి.

అగ్ని-స్విష్టకృత్తు రుద్రదేవతాకము. ఈ రుద్రదేవత అంటే ఎంతో భయం. ఇతని బాణాలంటే చెప్పలేనంత భయం. స్పష్టంగా ఇతనిపేరు ఉచ్చరించటానికూడా జడుసే. ఉగ్ర, భీమ, కపర్ది శబ్దాలే భయానికే సూచకాలు. ఇతన్ని సంతోషింపజేయటానికే శంకరుడనే పిలుపు. వేదంలోని ఇతర దేవతలకీ, ఇతనికీ ఎంతో తేడా ఉంది.

ఒకప్పుడు దేవతలు ప్రార్థిస్తే, ఈయన ప్రజాపతిఅంతటివాడిమీద బాణాల్ని విసిరాడు. దానికి దేవత లెంతో సంతోషించి, పశుగణానికి ఈయన్ని అధిపతిగా చేశారు. అప్పటినించీ ఈయన పశుపతి.

పూర్వం ఈయనకు యజ్ఞభాగాల్లో పాలు ఉండేది కాదు. ఒకసారి ఈయన బలాత్కారంగా యజ్ఞభాగాన్ని గ్రహించాడు. అప్పట్నించే ఈ స్విష్టకృత్-యాగం ఆరంభమైంది. ఈ యాగంలో ఇయ్యబడే ఆహుతిని రుద్రుడే 'అగ్ని-స్విష్టకృత్' రూపంలో గ్రహిస్తున్నాడు.

ఇక్కడే దక్షయజ్ఞసంబంధమైన పౌరాణిక గాథను స్మరించుకోవాలి.

### అనుయాజ :

(౯) స్విష్టకృద్యాగంతర్వాత అనుయాజ-యాగం. ప్రధానయాగానికి పూర్వం ప్రయాజ-యాగం ఉన్నట్టు, అనంతరం ఈ అనుయాజ. ప్రయాజకు పంచదేవతలు. కాని, అనుయాజకు దేవతలు ముగ్గురే. ఈ అనుయాజదేవతలపేర్లు : బర్హి, నరాశంస, అగ్నిస్విష్టకృత్తులు. ఆహుతిద్రవ్యం ఆజ్యం.

### సామాన్యనియమక్రమం :

ఈ ప్రధానాప్రధానయాగాల్ని చేసేనిమిత్తం కొన్ని సాధారణనియమా లున్నాయి. అధ్వర్యుడే యాగకర్త. హోత ఆహ్వానకర్త. ఆహవనీయంలోనే ఆహుతిసమర్పణ. అధ్వర్యుడి ఆసనం ఆహవనీయానికి ఉత్తరంగా. అక్కడే ఆయన నిలబడి ఉండాలి. ఏ యాగంలోనైనా సరే, ఆయన దక్షిణహస్తంతో జుహూవును, వామహస్తంతో ఉపభృత్తును పట్టుకొని, వేదికి ఉత్తరంనుంచి దక్షిణంగా వస్తాడు. అక్కడే నిలబడి అగ్నీత్తును ఆదేశిస్తాడు: "ఓం శ్రావయ". అంటే దేవతల్ని మంత్రాల్ని వినమని ప్రార్థించు. ఈ అగ్నీత్తు వేదికి ఉత్తరంగా నిలబడేవాడు, చేత్తో ఒక కఱ్ఱకత్తిని పట్టుకొని. ఈ కఱ్ఱకత్తిపేరు "స్ఫ్య". ఆయన జవాబిస్తాడు: "అస్తు శ్రౌషట్". అంటే, వింటారు, దేవతలు వింటున్నారు అని. అప్పుడు అధ్వర్యుడు హోత కాదేశిస్తాడు, దేవతల్ని ఆహ్వానించమని. హోత రెండు మంత్రాలు చదవాలి. ఒకటి అనువాక్యం—ఇది ఋక్‌మంత్రం. ఈ మంత్రంద్వారా దేవతల్ని అనుకూలంగా చేసుకొంటున్నారు. ద్వితీయ మంత్రం యాజ్యం. ఇది కొన్నిపట్ల ఋక్కు; కొన్నిపట్ల యజుస్సు. ఇదే యాగమంత్రం. కనుకనే యాజ్యం. దేవత అగ్ని అనుకొందాం. అప్పుడు హోత మంత్రపాఠాన్ని "యే యజామహే అగ్నిం దేవమ్" అని ఆరంభిస్తాడు. దీని పేరు ఆగూః-మంత్రం. తర్వాత 'యాజ్య'మంత్రాన్ని చదివి "అగ్నే వీహి వౌషట్"—అగ్ని దీన్ని భక్షించి దేవతలదగ్గరకు తీసికోవెళ్లును గాక అని అంటాడు. ఈ వౌషట్‌ఉచ్చారణే వషట్కారం. ఈ వషట్కారం ఉచ్చారితమవుతూ ఉన్నప్పుడే అధ్వర్యుడు ఆహుతిద్రవ్యాన్ని—అది పురోడాశమే కాని, లేక ఆజ్యమే కాని—అగ్నిలో వేస్తాడు. యజమాని ఆహుత్యనంతరం "ఇదం అగ్నయే న మమ"—ఈ ద్రవ్యాన్ని అగ్ని కర్పించాను, ఇది నాదికాదు అని త్యాగమంత్రాన్ని ఉచ్చరిస్తాడు. దేవతల్ని ఉద్దేశించి చెయ్యబడే ద్రవ్యత్యాగమే యాగం, లేక యజ్ఞం. యజమాని ఇప్పుడు ఇల్లాంటి త్యాగాన్ని చేశాడు. త్యాగమంత్రపఠనం అయింతర్వాత అధ్వర్యుడు స్వస్థానానికి తిరిగివస్తాడు.

ప్రతియాగానికీ ఇదే సాధారణవిధి.

**ావిర్భక్షణ :** 

కార్యక్రమంలో ఇక మిగిలిపోయింది హవి
్శేషభక్షణ. ఇది కాకపోతే ఏ యజ్ఞమూ సంపూర్ణం
ాదు. పురోడాశాన్ని అంతా ఆహుతి ఇయ్య
ూడదు. కొంచెం మిగిలేట్టు చూడాలి. యజమానీ,
ుత్విక్కులూ దీన్ని భక్షిస్తారు. మిగిలిన పురోడాశాం
న్ని దీనినిమిత్తం కొన్ని ముక్కలుగా భాగిస్తారు.
కదాని పేరు ప్రాశిత్రం ; దీన్ని బ్రహ్మ భక్షిస్తాడు.
ంకోదాని పేరు షడవత్తం ; ఇది అగ్నీత్తుకు చెందు
ంది. ఇంకో ఖండాన్ని మళ్లా నాల్గుముక్కలు చేసి,
ధ్వర్యు, హోత, బ్రహ్మ, అగ్నీత్తులు నల్గురూ
క్షిస్తారు. ఇంకో రెండుముక్కలు మిగుల్తాయి.
ంతా ముగిశాక బ్రహ్మ, యజమానీ వాన్ని భక్షి
్తారు.

**ిడాభక్షణ :** 

ఈ పురోడాశఖండాల్లో కొన్నిటిని ఘృతాక్తం
ేయాల్లి. వీటిపేరు ఇడ. యజమాని, నల్గురు
ుత్విక్కులూ కలిసి దీన్ని భక్షిస్తారు.

అసలు హవిశ్శేషభక్షణే చాలా ముఖ్యం.
ందులో మళ్లీ ఈ ఇడాభక్షణ మరీ ముఖ్యం.

ఈ ఇడలో ఒక భాగాన్ని, మళ్లీ వేరుగా
ోత తింటాడు. దీని పేరు అవాంతర-ఇడ.

ఈ హవిశ్శేషభక్షణానుష్ఠానం స్విష్టకృత్తు
ూగానికి తర్వాత, అనుయాజ-యాగానికి పూర్వం.
ేవలం, బ్రహ్మ యజమాను లిద్దరూ యజ్ఞసమాప్త్య
ంతరం తింటారు.

మనలో "స్విష్టకృత్తుగా కూర్చొని భోం
చేశాడు" అనే వాడుకఉంది. హవిశ్శేషభక్షణ స్విష్ట
ృద్యాగానంతరం అవటంవల్ల ఈ వాడుక నిల్చిం
దేమో!

**సమాప్తిక్రమం :** 

అనుయాజయాగంతో పూర్ణమాసయజ్ఞానికి
సంబంధించిన ప్రధానానుష్ఠానాలు ఒకరీతిగా ముగి
ాయి అనే చెప్పొచ్చు. ఇహ సమాప్తి.

ప్రస్తర మనబడే దర్భకట్టనుగురించి పైన
వచ్చింది. ఈ కుశగ్రంథిని కేవలం గడ్డిపోచ లని తృణీ
కరించటానికి వీల్లేదు. దీంతో యాజమానశరీరాన్ని
ఏకంగా భావించాలి. అనుయాజయాగానంతరం ఈ
ప్రస్తరాన్ని ఆహవనీయాగ్నిలో పడేయాల్లి. ఇది
కాలిపోతున్నప్పుడు యజమాని స్వర్గానికి వెడుతున్నట్టు.
సంపూర్ణంగా దగ్ధమైతే, యజమాని స్వర్గంలో దేవ
తల్లో ఐక్యమైనట్టు. ప్రస్తరం కాలిపోతున్నప్పుడు,
హోత అధ్వర్యుడి అనుజ్ఞతో కొన్నిమంత్రాల్ని
చదువుతాడు. వీటి పేరు సూక్తవాక్కు. పూర్తిగా
కాలిపోయినాక మరికొన్ని మంత్రాల్ని చదువు
తాడు. వీటి పేరు శంయువాక్కు. ఇవి ఆశీర్వాద
సూచకాలు.

పరిధి అనబడే సమిత్కాష్ఠఖండత్రయాన్ని
గురించికూడా పైన చెప్పాను. మానవహోత దేవ
హోతను పిల్చుకోవచ్చునుకదా, ఆ దేవతాహోత
శరీరమే ఈపరిధి. ఇక వీటిని అగ్నిలో వేయాల్లి.
అప్పుడు దేవహోత యజ్ఞస్థలంవదంచి వెళ్లిపోతాడు.

**సంస్రవం :** 

ఈ సమయంలో అధ్వర్యుడు విశ్వదేవతల
నుద్దేశించి, కొంచెంగా ఆజ్యాన్ని ఆహుతి ఇచ్చి
హోమం చేస్తాడు. దీని పేరు సంస్రవహోమం. ఇది
యాగం కాదు, హోమం. దీంతో యజమానిఅను
ష్ఠానం సమాప్తం.

**పత్నీకృత్యం :** 

కాని, యజమానపత్ని చెయ్యాల్సింది ఉంది
ఇంకా. ఇంతవరకూ ఆవిడ ఓపిగ్గా గార్హపత్యాగ్ని
ప్రక్కగా కూచొని ఉంది. ఇంతవరకూ జరిగిన కర్మ
కలాపం అంతా ఆహవనీయంలోనే.

ఇప్పుడు బ్రహ్మగాక మిగిలిన ముగ్గురు ఋత్వి
క్కులూ యజమానపత్నిదగ్గరకు వచ్చి, గార్హ
పత్యంలో కొన్ని ఆహుతుల్ని వేస్తారు. ఆహుతి
ద్రవ్యం ఆజ్యం. దేవతలు : సోముడు, త్వష్ట, దేవ
పత్నీగణం, అగ్ని-గృహపతి. గృహపతిఅయిన అగ్నీ,
దేవపత్నీగణమూ ముఖ్యంగా ఆహుతుల్నిపొందక
పోతే, గృహిణి అయిన యజమానపత్ని సహిస్తుందా?

ప్రధానయాగానంతరం హావిర్భక్షణం జరిగినట్టే ఇప్పుడుకూడా జరగాలి. ఈ యాగానంతరం హవిశ్శేషాన్ని యజమానపత్ని తింటుంది. భక్షణానంతరం పైలాగా సూక్తవాక్పఠనం లేదుకాని, శంయువాక్పఠనం ఉంది. సంస్రవయాగం కూడా ఉంది. ఈ సంస్రవయాగం పేరు పత్నీసంయాజయాగం.

## సమిష్టహోమం :

దక్షిణాగ్నిలో ఇంతవరకూ ఒక్క ఆహుతి కూడా పడలేదు. కనుక, ఇప్పుడు అధ్వర్యుడు దక్షిణాగ్నిలో ఆజ్యహోమాన్ని చేస్తాడు. పురోడాశం తయారుచెయ్యగా మిగిలిన కొంచెం పిండినుపయోగించి, విశ్వదేవతల నుద్దేశించి అగ్నిలో వెయ్యాలి. దేవపత్నీసహవ్యానాన్ని అనుసరించి యజ్ఞక్షేత్రానికి వచ్చిన దేవతలందరికీ ఇంకా తృప్తి కలగలేదు. అధ్వర్యుడు వీళ్లందరినిమిత్తమూ ఆజ్యాహుతుల్ని ఆహవనీయంలో వేస్తాడు. అప్పుడు వాళ్లు సంతుష్టులై వెళ్ళిపోతారు. దీనిపేరు సమిష్టియజుర్హోమం.

## రాక్షసులకు :

వేదిమీద పరచబడిన దర్భల నన్నిటినీ ఆహవనీయంలో పడెయ్యాలి. ప్రణీతా-జలాన్ని వేదిమీద పొయ్యాలి. పురోడాశం తయారుచెయ్యటంలో వచ్చిన ఊక, తవుడు, చిట్టు మొదలైనవి రాక్షసులకు ప్రాప్యం. దీంతోనే వాళ్లు సంతోషిస్తారు. రాక్షసుల్ని ఉద్దేశించి వాటిని విసర్జించాలి.

దీంతో ఈ యజ్ఞం ముగిసింది.

## ప్రక్రమణ :

ఈ యజ్ఞనిర్వహణఫలంగా యజమాని దేవత్వాన్ని పొందాడు. అంతే కాదు. దేవతల్లో సర్వశ్రేష్ఠుడైన విష్ణువుపదాన్ని పొందటానికే అతడిప్పుడు అభ్యర్థి. విష్ణువు త్రిపదవిన్యాసంతో మూడులోకాల్ని ఆక్రమించాడన్న విషయం అందరికీ తెల్సు. ఈ వర్ణన వైదికసాహిత్యంలో ఎక్కడపడితే అక్కడే కనిపిస్తుంది. దీనికి అనుకరణంగా యజమాని యజ్ఞస్థలంలో మూడు అడుగులు వేసి, తూర్పుగా ఆహవనీయంవరకూ ప్రక్రమిస్తాడు. దీనిపేరు విష్ణుక్రమ-ప్రక్రమణ. పూర్వదిక్కు దేవతల స్థానం. యజమాని తూర్పుగా తిరిగి చూస్తూ, "నేను జ్యోతిలో గమనమొనరుస్తున్నాను, జ్యోతిలో కలిశాను" అనే అర్థం గల మంత్రాన్ని చదువుతాడు.

## వ్రతవిసర్జన :

అనంతరం యజమాని సూర్యోపస్థానమూ, గార్హపత్య ఉపస్థానమూ జరిపి, "గృహపతిఅయిన ఓ అగ్నీ ! నేను నీద్వారా స్వగృహపతిని అవుతాను గాక" అని అంటాడు. తర్వాత, పుత్రుడిపేరు చెప్పి, "నా ఈ పుత్రుడు ఈ వీరకర్మను అనుక్రమంగా విస్తరిల్లజేస్తాడుగాక !" అని ప్రార్థిస్తాడు. ఆపైదప ఆహవనీయ-ఉపస్థానం జరిపి, పూర్వదినం గ్రహించిన వ్రతానికి ఉద్యాపన చెప్తాడు.

విసర్జనానంతరం యజమాని బ్రహ్మతో కలిసి యజ్ఞశాలకు బయటకువచ్చి, తమకోసం అట్టే పెట్టిన పురోడాశభాగాల్ని స్వీకరిస్తారు.

సర్వశేషంగా బ్రహ్మ ఆహవనీయంలో సమిధండాల్ని వేసి, పూర్ణమాసేష్టిని సమాప్తం చేస్తాడు. యజ్ఞాంతంలో ఋత్విక్కులకు దక్షిణ ఇవ్వాలి.

## దక్షిణ :

పూర్ణమాసయజ్ఞం ప్రతిగృహస్థుకూ అవశ్యం చెయ్యాల్సిన కర్మ. ధనికుడు, దరిద్రుడూ అనే విచారం లేదు. అందువల్ల దక్షిణ చాలా తేలిగ్గానే నిర్ణయమయింది. యజ్ఞారంభంలో దక్షిణాగ్నిమీద నలుగురు ఋత్విక్కులకూ సరిపోయే బియ్యం ఎక్కించాలి. అది దక్షిణాగ్నిమీదే ఉడకాలి. ఈ అన్నమే దక్షిణ. అంతా అయ్యాక ఋత్విక్కులు ఈ అన్నాన్ని భుజిస్తారు. దీంతో యజ్ఞం దక్షిణాంతం అవుతుంది.

ఇది పూర్ణమాసయజ్ఞవివరణ. ఈ ప్రకృతి యాగాన్ని బట్టే, మిగిలిన ఇష్టియాగాలరీతిని అర్థం చేసుకోవచ్చు.

శ్రౌతయజ్ఞాల్నన్నిటినీ ఇష్టి, పశు, సోమ యాగాలని మూడువిధాలుగా విభజింపవచ్చు. ఈ పూర్ణమాసయాగం ఇష్టియాగాలన్నిటికీ నమూనా. ఇంకో విభజనననుసరించి, అగ్నిహోత్ర, అగ్న్యాధేయ, దర్శపూర్ణమాసలున్నూ, ఆగ్రాయణ, చాతుర్మాస్య, నిరూఢపశుబంధ, సౌత్రామణి యాగాలున్నూ, ఆశ్వయుజశూలగవాదులున్నూ సప్తహవిర్యజ్ఞాలుగా పరిగణింపబడుతున్నాయి.

# వెలుగు - చీకటి

●

"సంపత్"

జిలజిల కవియు తిమిరసంకులము దాటి
అహరనుభవాభిగమ్యము నభిలషింతు;
మత్ప్రణీతశబ్దాళి నా నేత్రయుగళి
వలెనె వెలుగుకేంద్రములు గోపలనె వెదకు;
మత్కృతానేకవివిధకర్మములుకూడ
అహరనుభవాభిగమ్యము నభిలషించు.
ఈదృగీప్సితవిపరీత మిట మఱొక్క
తలపు దివమన్న బెదరి, సంత్రాసవశత
ఈ మహాంధకారమె నిల్వారింపజూచు.
కాంతి కని కుంచుకొనిపోవు కనులవోలె
వెలుగగన తలంకు మద్గిరాం విమలవీథి;
మత్కృతానేకవివిధకర్మములుకూడ
రిక్తసూత్రము లగుచు పరిభ్రమించు
నొక పరిధివెంట, కేంద్రము నుజ్జగించి;
ఇచట తేజోద్భవములు పర్వులెత్తు నాస
నాహృదంతరదౌర్బల్య మాహరించు
నంత, అభిభూతసంకల్పమై గమించు;
ఇనుపగడియలు పడి నాయభీష్ట మిట్లు
తురితమై, సుఖస్వప్నమై, కరగిపోవు.
ఇటు లుషఃకాంతి తోచినప్పటికికూడ
అటు మహాంధ్యము క్రమ్మినప్పటికికూడ
పరిధి, కేంద్రము రెండు నా భావితాశ
లందు తడబడు దౌర్బల్య మని తలంతు:
ఇది మహాద్భుత మీ రెంటి కిట్టి సంధి;
వెలుగుకెరటాలు సుడులుగా విస్తరిల్లు
నంతలో నంధకారము లావరించు
ఒకటి సర్వేంద్రియమ్ముల నుపచరించు—
ఒకటి సర్వేంద్రియమ్ముల నుమ్మలించు.

# శైవపరిక్రమము

శ్రీ భావరాజు వెంకటకృష్ణరావు

ఆంధ్రదేశమునకు త్రిలింగదేశ మని మరియొక పేరు. ప్రసిద్ధిగన్న త్రిలింగములుండుటచే బట్టియే ఆంధ్ర భూమికి ఆ పేరు వచ్చియుండెను. శ్రీశైలము, దక్షారామము, కాళేశ్వరము — ఈ మూడును త్రిలింగ క్షేత్రములని అప్పకవి మొదలగునవారు రచయితలు తెలిపియున్నారు. ఆంధ్రదేశీయులు బౌద్ధమతమును పరిత్యజించి, శైవ-బ్రాహ్మణ వైదికమతమును స్వీకరించిన నాటనుండి, ఆంధ్రభూమి శైవమున కాటపట్టయ్యెను. ఆంధ్రశైవమునకు ఒక విశిష్టత యేర్పడెను. ఆంధ్ర దేశమునందలి శైవక్షేత్రము లన్నిచోట్లను శివుడు దక్షిణామూర్తి. శివుడు సద్బ్రహ్మచారి. దక్షారామాది పంచారామక్షేత్రములందు శివుడు బ్రహ్మచారియే. దాక్షాయణి సతీత్వము నొందినతరువాత శివుడు పార్వతిని పరిణయ మాడునంతకు దక్షిణామూర్తిగా నుండినాడు. ఒక్క పంచారామక్షేత్రములందే కాదు—ప్రసిద్ధిగన్న ప్రతిశైవక్షేత్రమునందును శివుడు దక్షిణామూర్తియే. తెలియనివారు శివార్చకులై వెలయుచుండుటచేతను, మూఢజనులకు శైవాగమములవిషయము అంతయు తెలియకపోవుటచేతను క్షీరారామ(పాలకొల్లు)మునందున్న, అమరావతియందును శివునికిప్రక్క పార్వతిని నెలకొలిపి పూజలు చేయుచున్నారు. శివునికి ప్రసిద్ధములయిన క్షేత్రములందెచ్చటను, ఆంధ్రభూమిలో శివరాత్రినాడుగాని, మరి ఎన్నడుగాని కల్యాణోత్సవము జరుపరు. ఈ పట్టింపు కోటప్పకొండమీద వెలసియున్న త్రికూటేశ్వరశివునకు మరింత యెక్కువ. దక్షవాటిక భీమనాథేశ్వరశివుడు సంప్రదాయసిద్ధముగా నగ్నపాశుపతమూర్తి. ఆయనకు మాణిక్యేశ్వరిని వింధ్యవాసినియను శక్తిని భోగపత్నిగా నుంచినారు. ఆమె పార్వతి కాదు. భీమనాథేశ్వరశివునకు పార్వతి చెంత లేదు. అట్లే చాళుక్యభీమేశ్వరశివునకుగూడ. శ్రీశైలమందుగూడ మల్లికార్జునశివునకు శక్తి భ్రమరాంబ. ఆ పరాశక్తికూడ పార్వతి కాదు. అట్లే కాళేశ్వరమందలి కాళేశ్వరునికిగూడ. కాళహస్తీశ్వరునకు పార్వతి లేదు. ఆయనకు శక్తి జ్ఞానప్రసూనాంబిక. అట్లే పంపావిరూపాక్షపతికి పంపాదేవి, భువనేశ్వరులు శక్తిస్వరూపిణులు. పిఠికాపురవాసిని పురుహూతికకూడ శక్తిస్వరూపిణిగాని పార్వతి యంశ కాదు. ఆంధ్రదేశపు శైవధర్మముయొక్క విశిష్టతను పైన సూచించినదంతయు ఒక తార్కాణము. ఆంధ్రశైవమునుగురించి పరిశోధన జరుగవలసి యున్నది.

ఆ విషయ మటుండనిండు. శివాలయము లనేకము లున్నవి — ఆంధ్రదేశమునందు. శివాలయములకు బోయి శివుని ఆరాధించు ఆచారము, సంప్రదాయము కూడ దేశమునందు క్రమక్రమముగా క్షీణించిపోవుచున్నది. అసలు ఆంధ్రదేశమునందు శివాలయములకు బోవుట జనులు మానుకొనుచున్నారు. చాలవరకు ఇట్టి దుష్టపరిస్థితి యేర్పడుటకు వీరేశలింగముగారి నాటనుండి యేర్పడిన మన సంఘములోని మార్పులు, ఆచారములు, నాస్తికత్వము ఇత్యాదులు కారణము. "రాళ్లు దేవుళ్లయితే రాసులు మ్రింగేవా" అన్న వేమనగారి మాటమీద జనులకు గురి కుదిరినది. దైవమున్నాడని గాని, శైవధర్మముగాని, వైష్ణవధర్మముగాని అవలంబింపదగినదనిగాని జనులకు ఈనాడు తోచుటలేదు. నాస్తికత, దానితోపాటు కుశంకలు, ధర్మమునందు అవిశ్వాసమును కల్గించి, ప్రజలయందు అంతకుపూర్వ ముండిన శమదమనియమాదిగుణములు, సత్యసంధత, ఋజువర్తనము, నీతి, శిక్షణలో నుండుట—ఇత్యాది మంచి గుణములన్నియు నశించిపోయెను. జాతికి క్షీణదశ స్థిరముగా నెలకొనెను.

శివాలయములకు బోవనివారి మాట నేను తలపెట్టను. శివాలయములు ఏ పద్ధతిమీద నిర్మితము

అర్యో నో, శివపరిక్రమ మెట్టిదో చాలమందికి తెలియక పోవచ్చును. ప్రతిశివాలయమందును, అనగా, ప్రాచీనములును, ప్రసిద్ధిగన్నవియునగు శివాలయములందు విమానము, దానిచుట్టు ప్రదక్షిణపథము, చుట్టును సప్త మాతృకలు, భృంగీశ్వరుడు, రుద్రుడు, కాలభైరవుడు, డుంఠివినాయకుడు, కుమారస్వామి, చండికేశ్వరుడు మొదలయిన పరివారదేవతలకు, క్షేత్రపాలకులకు చిన్న చిన్న విమానము లుండును. శివలింగమున కెదురుగా ముఖ మంటపమునందుగాని, అగ్రమంటపమునందుగాని నందీ శ్వరు డుండును. ఈ దుష్టకాలమున, పరివారదేవతల విమానములు సరియైన తావులందు ఉండుటలేదు. పుణ్య కార్యములు చేయుచున్నామని భావించు సద్భక్తులు కొందరు తెలిసీతెలియని పండితబ్రువుల సలహామీద తమ యిష్టమువచ్చినచోట పరివారదేవతలకు విమాన ములు నిర్మించుచున్నారు. కార్తికేయుని గుడి ఊడ బెరికినారు కొన్నిచోట్ల. ఆ కార్తికేయ (శివు)ని వెనుక నుండవలసిన సప్తమాతృకలు ఉండవలసిన తావు లందు గానరారు. గణపతి యెక్కడ డుండవలయునో, భృంగి ఎచ్చట నుండవలయునో, అచ్చట ఆ ప్రతిమలు గానరావు. కొన్ని శివాలయములందు చండీశ్వరుని ఊడ బెరికినారు. చండీశ్వరుడు శివయోగులకు అధిపతి. అతడు వగ్నమూర్తి. ఒకప్పుడు రెండుచేతులు, మరియొకప్పుడు నాలుగుచేతులుకూడ నుండును ఆ దేవునికి. చండికేశ్వరుని ముఖము ఉజ్జ్వలమైయుండును. చేతులలో నొకదాని యందు త్రిశూలము, ఒకదానియందు కలశము, మరియొక దానియందు డమరుకముకూడ నుండును. శివునికివలె మూడవకన్నుకూడ నుండును. శిరోజములు నడినెత్తిమీద యోగికివలె జటగా చుట్టబడియుండును. శివనిర్మాల్య మును, శివుని నర్చించివచ్చినపిదప, చండికేశ్వరుని ప్రమోల పారవేయుదురు. శివలింగమునకు అభిషేకించిన జలమంతయు కొన్ని దేవాలయములందు సోమ సూత్రముగుండ జారిపొచ్చి, ఒక తొట్టిలోనికిగాని, అక్కడ కట్టిన బావివంటి గోతిలోనికిగాని ప్రవ హించును. సోమసూత్రముదగ్గరకు వచ్చినపుడు జనులు అక్కడ అభిషేకజలమును నెత్తిమీద జల్లుకొనకుండ పోవుట పాపము. శివాలయమునకు బోయినపుడు శివార్చనావిధము ననుసరింపకపోయినచో శివపూజా ఫలము దక్కదని శైవాగమములు ఘోషించుచున్నవి. పెద్దలనోట తఱచుగా ఈ క్రింది శ్లోకము పూర్వము వినుచుంటిమి. ఈనాడు ఈ శ్లోకము నెఱిగినవా రరు దుగా నున్నారు. శివుని దర్శించురీతి యిందు విశదీ కరింపబడినది:

"వృషం చండం వృషం చైవ
సోమసూత్రం పునర్వృషమ్
చండంచ సోమసూత్రంచ
పునశ్చండం పునర్వృషమ్."

ఈ శ్లోకార్థ మిది: ముందుగా శివుని అర్చించ గోరువాడు నందిని సమీపించి, ఆ నందివెనుక నిలువ బడి శివునకు నమస్కార మాచరింపవలయును. తరు వాత, ఎడమప్రక్కగా ప్రదక్షిణ మాచరించి కుడి వైపున నున్న చండీశ్వరుని సందర్శించి నమస్కరించ వలయును. అక్కడనుండి మరల నందికడకు వచ్చి, లింగార్చనము చేయవలయును. అటుపిమ్మట మునుపటి వలెనే, ప్రదక్షిణము చేయుచు సోమసూత్రమును సమీ పించి, అభిషేకజలముతో కన్నులు తుడుచుకొని చండి కేశ్వరుని సమీపించి నమస్కరింపవలయును. పిమ్మట నందిని సమీపించి, మూడవసారి శివలింగమునకు నమ స్కార మాచరించి, తిరిగి చండికేశ్వరుని కడకు రెండవసారి పోవలయును. అచ్చట చండీశ్వరునకు వందన మాచరించి సోమసూత్రమువఱకు బోయి, ధ్వజము వంక దృష్టి నిలిపి మేకలమునకు నమస్కరించి, పిమ్మట చండిని సమీపించి, నమస్కార మాచరించి, నంది కడకు శివునికి కడపటి నమస్కారమును సమర్పింప వలయును.

ఇది శైవపరిక్రమ విధానము. ఈ సంప్ర దాయము దేశములో అంతరించిపోయినది. గుడికి పోవుటయే మహాకష్టమైన కార్యము ఈ కాలమున— దానికితోడు. పెక్కుశివాలయములందు చండీశ్వరుడే కానబడడు. ఇక పూజావిధానము ఏ ట్లున్నదో యోశించుకొనుట సులభము.

# రుచీదేవి

[నాటిక]

'పో. శా.'

౧

[ఒక గొల్లపల్లి. తటాకకూలాన వృక్షచ్ఛాయలో చారవేషధారి శ్రీకృష్ణదేవరాయలు.]

రాయలు :—ఈ రాజ్యం అప్పాజీచాతుర్యవిశేష సంప్రాప్తం. నా భోగాలన్నీ ఆ బృహస్పతిత్యాగాల ఫలితం. ఆ బహుళమేధాశక్తికి నా రత్నఖచితకిరీట మస్తకం వినమ్రమవుతుంది. ఆయన నిర్మాణకార్యక్రమశక్తికి అఖండవిద్యానగరసామ్రాజ్యమే ధారపోయా లనిపిస్తుంది. ఆయన నన్ను ఆదుకుంటూవచ్చింది యీ సామ్రాజ్యరంగంలోనే కాదు, గృహరంగంలో కూడా—

అప్పాజీదయ పెదతల్లి విషప్రయోగంనుంచి కాపాడింది. కొడుకు సామ్రాజ్యాధినేత కాకపోతాడన్న భయంతో అన్నగారు నా గ్రుడ్లు పెరికించమంటే కాపాడింది అప్పాజీ. అప్పాజీ లేకపోతే కృష్ణరాయడు ఉండేవాడే కాడు. నా గురువు, నామంత్రి —నా సర్వస్వం ఆయనే.

నా ప్రణయసమస్యల్లోకూడా జోక్యం కలిగించుకోగల సామర్థ్యం అప్పాజీకిమాత్రమే—నా చిన్నాదేవిని నాకు సమకూర్చాడు. గజపతిరాకుమారికలు యీపాటికి నన్ను తమ ఛురికలకు ఆహుతిగొని ఉండేవారు, అప్పాజీచాతుర్యం నాకు శ్రీరామరక్షగా లేకపోతే—

...ఆఁ...మళ్లీ సాయంత్రానికి విజయనగరం చేరాలి...అప్పాజీ ఆదేశం. నిదాఘంకూడాను. ఈ పాత్రలో తటాకజలం నింపుకు బయలుదేరితే—

(తటాకసోపానాలమీద ఒక కాషాయాంబర ధారిణి కృష్ణరాయని చూచి కొంచెం తప్పుకుంటుంది. అక్కడి శిలాశాసనాన్ని చదువుతాడు రాయలు.)

"శ్రీమన్మహారాజాధిరాజ, రాజపరమేశ్వర, మూరురాయరగండ..." నా బిరుదనామాలా?...ఎవరిదీ శాసనం? (అడుగున చూచి) "శ్రీ కృష్ణదేవరాయ చరణభక్తురాలు...కట్టించిన తటాకం—"

శ్రీ వీరప్రతాపుని పాదదాస్యాన్ని ఆకాంక్షిస్తున్న యీ నిరాడంబరజీవి...స్త్రీ!...స్త్రీ?

హృదయపూర్వకంగా నన్ను లోగొని తాను నాకు లోబడిన ప్రణయైకజీవి ఒక్క చిన్నాదేవి మాత్రమే. తిరుమలదేవికూడా పరివర్తితహృదయ. సరే, రుచీదేవిఅంకుపొంకు లానాటితోనే అంతమయ్యాయి. మరి నిష్కామకర్మగా నన్నారాధిస్తున్న యీ అజ్ఞాతనారి...? (కాషాయాంబరధారిణిదగ్గరకు వెళ్లి) ఇదిగో ...యీ శిలాశాసనం ఎవరిది?

ఆమె :—ఏవూరు పాంథుడా?

రాయలు :—మాది విద్యానగరం.

ఆమె :—ఇంకేం? మీరాయల చరణదాసిది.

రాయలు :—ఎవ రామె? పేరు...

ఆమె :—వరదరాజమ్మ.

రాయలు :—వరద...రాజమ్మ...మా గజపతివిభాధుని ఆరాధిస్తున్న ఒక అజ్ఞాతనారి...పేరు వరదరాజమ్మ...గ్రామం?

ఆమె :—అసలు వినుకొండ. ఇప్పుడు గొల్లపల్లి. ఆమె యిక్కడ ఆశ్రమం స్థాపించి ధ్యానముద్రలో భాసిస్తూ ఉంటుంది.

రాయలు :—ఆఁ - ఇంకా?

ఆమె :—అంతే. నాకూ అంతకన్నా తెలియదు. ఆమెమాధ్యాహ్నికాలకు నీతో కూచుంటే పాపం కాదూ?

రాయలు :—(నెమ్మదిగా) నిలు... (ఆగి) ఎందుకూ? వెళ్లు...రేపు అప్పాజీతో సమాలోచించందే...చూడడం మంచిదికాదు...

వినుకొండ...గొల్లపల్లి. వరదరాజమ్మ...అరి రాయవిభాడుని (శాసనం మరోసారి చూసి)...చరణ భక్తురాలు...

విచిత్రం, విపరీతం...

౨

[రాజప్రాసాదం. అంతఃపురం. తిరుమలదేవి, రాయలు.]

దేవి :—శ్రీమన్మహారాజాధిరాజ, రాజపరమేశ్వర, మూరురాయరగండ...

రాయలు :—ఏమిటి, పరాకులు పలుకుతున్నావు? (కొంచెం చలించి) ఆ శిలాశాసనం...తమాకం... (తల పంకించి) ఏమీ లేదు. (నాలిక కొరుక్కుంటాడు.)

దేవి :—ఏ శిలాశాసనం? ఎక్కడ?

రాయలు :—లేదు, లేదు...ఏమీ లేదు...అప్పాజీ...

దేవి :—అలా చంచలిస్తారెందుకూ? గొల్లపల్లి పర్యటన చేసి వచ్చిన శ్రీకృష్ణదేవరాయలవారు—విశ్రమిస్తారా?

ఆ తమాకం...ఒకనాటి నాకునారి...

రాయలు :—(పట్టించుకోక) గొల్లపల్లి శిలాశాసనం. (నిశితంగా) దేవి కీవిషయంలో సంబంధమేమిటి?

దేవి :—ఆమె...నాబోటిదే.

రాయలు :—ఎవరామె...ఒక ఆధ్యాత్మికజీవి...తిరుమలదేవితో సమానమా?

దేవి :—ఆమె మీ చరణభక్తురాలు...

రాయలు :— అవును. మూరురాయరగండని రక్తంకూడా తియ్యగా ఉంటుందని చవిచూచి చెప్పిన తిరుమలదేవి ఆ అజ్ఞాతాధ్యాత్మికస్త్రీతో సామ్యం చెప్పకోవడం.. (నవ్వు).

దేవి :—ఆమెకూడా మీరక్తం చవిచూడాలనుకుంది ప్రభూ!

రాయలు :—రాయల రక్తం రుచిచూడాలన్న వాంఛ ఒక గొల్లపల్లిస్త్రీలోనా జనించింది?

దేవి :—ఆమెది అసలు వినుకొండ—మనవి చేస్తున్నాను.

రాయలు :—రాజ్యాన్ని పాలిస్తున్న రాయల కన్నా రహస్యాలు అంతఃపురరమణులకే ఎక్కువ తెలుసా? (తీక్ష్ణంగా) దేవీ—

దేవి :—ఇందులో ప్రత్యేకత ఉంది ప్రభూ! ఆమె ఒక నిష్కళంకజీవి. తమ నామసంస్మరణతోనే దినాలు వెళ్లబోస్తున్న ఒక పవిత్రవ్యక్తి. మీ దాస్యాన్ని పునస్సంపాదితం కావించుకోలేనేమోనని మనస్సు నొవ్వచేసుకుంటున్న ఒక అమాయికయువతి—

రాయలు :—నా దాస్యాన్ని పునస్సంపాదితం కావించుకో...

దేవి :—తథ్యం స్వామీ! తెలియదా, తెలిసే ఉపేక్షిస్తారా? నాటితో ఆమెకూడా పరిత్యక్త హృదయ.

రాయలు :—తిరుమలా! ఈ ప్రచ్ఛన్నసంభాషణ దేనికి?

దేవి :—ప్రభూ! ఆమె మనోదౌర్బల్యాన్ని పోకార్చుకోడానికి వహించిన తపోదీక్షతప్ప అది—

స్వామీ!—కాషాయాంబరం కట్టుకున్నా హృదయం రాగరంజితమే. మౌనముద్ర వహించినా చిత్తం యుష్మదాయత్తమే. ఆమె మీకోసమే—మీరు నిజాన్ని లెక్కచేయక పరిగ్రహించకపోతే మృత్యువుకోసమే—స్వీయాంతఃకరణాన్ని పరిశుద్ధం కావించుకుంటోంది...మీ విజయలక్ష్మీ పరిరంభంలో ఆమె ఒక పులకరింపు. మీ అష్టదిగ్గజమనోభయంకరత్వాన్ని చిరస్థాయి కావించిన ఒక నవనవోన్మేష లావణ్యమయి.

రాయలు :—నా జీవితంలో అంత ప్రధానపాత్ర వహించిందా ఆమె?

దేవి :—పూర్వదక్షిణపశ్చిమసముద్రాధీశ్వరులు జరిగిందాన్ని యింతగా విస్మరిస్తారా?

రాయలు :—(ఆలోచిస్తూ) నేను పరిగ్రహించక పోతే మృత్యువును పరిగ్రహిస్తుందా?...నా జీవితంలో అడుగుమోపిన యువతి...నన్ను బలిగొనదలిచింది—తిరుమలదేవికాదు...మరి? రుచీదేవి అనాడే వదలిపోయింది...అయితే రుచీదేవే!? (బిగ్గరగా) పశ్చాత్తాపమా? అపూర్వపరివర్తన...

దేవి :—అపూర్వం కాదు స్వామీ!

రాయలు :—(వినిపించుకోకుండా) కర్తినెత్తిన కాఠిన్యం కమనీయాశ్లేషాన్ని కాంక్షిస్తోంది. అపూర్వ

పరిసర్తన... శ్రీకృష్ణదేవరాయల చరణభక్తురాలు... రుచీదేవి...

దేవి :—వీణకు ఉండే యినుపతీగెలే సుమధుర గానాన్ని పలుకుతాయి ప్రభూ !

రాయలు:—దేవీ...లేదు...ఆ ఉదంతం స్మృతి పథాల్లోకి రాలేని లోతుల్లో—

దేవి :—అభిమానవతి. తన భావాన్ని తానుగా వెలిబుచ్చుకోలేక జీవితాన్నే భగ్నపరుచుకొని త్యాగం చేయదలిచింది.

రాయలు :—ఎవరురా అక్కడ! (వచ్చిన సేవకునితో) త్వరగా అప్పాజీని ప్రవేశపెట్టు.

...కాదు. అప్పాజీతో సంప్రదించాను. ఆమె క్రౌర్యాన్ని తెలియజెప్పాను. ఆయనఅనుమతిమీదనే నగరు విడిచి పొమ్మన్నాను...

దేవి :—రాజాజ్ఞతో ఆమె అంతఃపురాన్ని విడిచి వెళ్ళింది. తిరిగి రాజాజ్ఞతోనే ఆమె అంతఃపురానికి చేరాలి.

రాయలు :—అసంభవం—అప్పాజీ...

దేవి :— స్వామీ ఉంటారు. రాజ్యంలోని గుట్టుమట్టులన్నీ ప్రభువు స్వయంచారత్వంతో బహిర్గతపరచాలన్నది శ్రీ అప్పాజీవిధానం.

రాయలు:—ఇంతకూ ఇందుకోసం పనికట్టి నన్ను పంపించారా... కొల్లపల్లి ప్రాంతానికి ?

దేవి :—ప్రభువులు ఉద్రేకిస్తే నేను నిరుత్తరను. మీది విశాలహృదయం. మీరు దాక్షిణ్యాగారులు... అదుగో అప్పాజీ...

రాయలు :—(లేచి) రండి, అప్పాజీ !

అప్పాజీ :—(ప్రవేశించి) ఇంత అసమయంలో చర్చించాలిసిన అత్యవసర విషయం...

దేవి :—(రాయల నపలోకిస్తూ) రుచీదేవి...

అప్పాజీ :—(చిరునవ్వుతో) ఏనాడో నగరు విడిచి పొమ్మని ఆజ్ఞాపిస్తే శిరసావహించిన ప్రాతరాణి మీద మనసుపారిందా రాయలవారికి ? సరి...మీ పర్యటన సుఖాంతమా ప్రభూ !

రాయలు :—(ఉద్వేగంతో)వరదరాజమ్మ రుచీదేవా అంటోంది తిరుమలదేవి.

అప్పాజీ :—దేవి అసత్యమాడుతారా ప్రభూ ?

రాయలు :— కొల్లపల్లి ... శాసనం ... రేపు మీతో చర్చిద్దా మనుకున్నాం. 'ఆ శాసనకర్త్రి రుచీదేవి'అని హృదయంలో కల్లోలాన్ని రేపింది తిరుమల. అప్పాజీ ! అంత క్రౌర్యానికి యింత సాధుత్వమా ?

అప్పాజీ :—ప్రభూ ! ఆవిషయం ఇప్పుడెందుకూ ?

రాయలు:—నిర్దోషిత్వం నిర్ణయింపబడితే ఆమె గౌరవార్హ.

అప్పాజీ :—అంతమాత్రాన జరిగేది ?...ఆమె దోషి అని ప్రభువులు ఇతఃపూర్వమే నిర్ణయించారు.

రాయలు :—అప్పాజీ ! మీ అభిప్రాయం, రాయలఆమోదం ఏనాడూ విడిపోవు.

అప్పాజీ :—కృతజ్ఞుణ్ణి...

గజపతికుమారి అపవ్రుల్లో కాయగసగులు తిని బ్రతుకుతోంది. కాంతివిహీనమల్లి వదలి కాషాయశాటి ధరించింది. ఆమెమనస్సులో క్రాంతి వెల్లివిరుస్తోంది. పరితాపవహ్నిమధ్య మీకై ఆమె ప్రతిక్షణం ప్రార్థనచేస్తోంది. అప్పటి ఆమెజీవిత శకలం—చంద్రునిలో కళంకం—

రాయలు చెప్పిన పలుకులు విని రుచీదేవి మీ మీద బాకు దూసింది. అంతే. ఆమెహృదయం నిష్కళంకం. ఆనాడు అందరూ ప్రేరేపిన ఉద్రేకం ఆమె కన్ను కప్పింది. ఈనాడు ఆత్మలో మీపైగల ప్రేమ ప్రబోధించిన అనుతాపం ఆమెకన్ను విప్పింది. ఆమె పవిత్రహృదయం ప్రతినిత్యం స్వీకృతికి తగిఉంది ప్రభూ !

మీభావాన్ని ఆనాడే కాదంటే నన్నే అన్యథా తలిచేవారు...

రాయలు :—ప్రథమసమాగమసమయంలో ప్రాణాపహరణప్రయత్నం...

అప్పాజీ :—(తిరుమలదేవివంక చూస్తూ) మీ హత్యాప్రయత్నంలోనే అనంతప్రేమప్రబోధం ఉందేమో ?

రాయలు :—నన్ను పరిరక్షిస్తూవచ్చిన మీకు నేను చెప్పవలసిందేమీ లేదు.

అప్పాజీ :—రాయలవారాగ్రహిస్తే తిమ్మరుసు చేసేదికూడా ఏమీ లేదు.

రాయలు :—ఆగ్రహం కాదు అప్పాజీ, అనుమతి. కాని—

అప్పాజీ :—ప్రత్యక్షంగాకాని, పరోక్షంగా కాని మీపరతు కామె నిలుస్తుంది.

రాయలు :—(తల ఊపుతాడు.)

## 3

[పటకుటీరం. వరద రాజమ్మ అప్పా
ు ఒక కక్ష్యలో; వాళ్లను విలోకిస్తూ
ళ్లకు కనబడకుండా రాయలు మరో
క్ష్యలో.]

రాజమ్మ:—స్త్రీహృదయం అప్పాజీ! హృదయం
చ నివేదించుకుంటున్నాను. ఈ కలుషశరీరం
భువుల పాదతాడనంతో పునీతం కావాలి...
ప్పాజీ, నా కళ్మలాన్ని మీతో వెళ్లబోసుకుంటున్న
జీవితచర్యాప్రవచనంతో పుట్టిన వెచ్చకన్నీటితో
క్కోవాలని భావిస్తున్నాను. ఆయన అంతిమదర్శ
నికే నా తపోదీక్ష—సహజస్పృహులనైన స్త్రీ
భావాన్ని అరికట్టలేకపోతోంది యీ తపస్వినీ
తంకూడా... (తలవంచి) ఏముంది నాకు ఆశించ
నికి? ఆయన్ని ఆఖరుసారి కళ్లతో త్రాగి యీ
పంచంనుండి వినిర్గమిస్తాను, అప్పాజీ...

అప్పాజీ:—యువతికా వైరాగ్యం?

రాజమ్మ:—రుచీ దేవికి...రాయలప్రక్కలో
చుబా మనిపించుకున్న రుచీదేవికి అంతకన్నా
ఉందా అప్పాజీ!

అప్పాజీ:—రాయలు మిమ్మల్ని ఆదరిస్తారేమో!

రాజమ్మ:—(తల వూపుతూ) కనికరం యీ
పినిమీదా? అప్పా, ఆ మహామహుని జీవితయాత
ంలో నేను గ్రంథిలాన్ని. నన్ను విసర్జించాలిసిందే.

అప్పాజీ:—గతం మరవాలి.

రాజమ్మ:—అని ఊరుకుంటారా? చేసినదానికి
ముపెట్టి దేవుతోంది నామనస్సు. జరిగిందానికి విచా
స్తోంది మీ మనస్సు. ఈ దౌర్భాగ్యాన్ని దూరీకృతం
వించినందుకు నిజం తెలియక సంతోషిస్తూ
ంటుంది శ్రీ వీరప్రతాపుల మనస్సు. నా జీవితానికి
యనమనోభావమే ప్రధానం. ఈపశ్చాత్తాపతప్త
చీజీవి ఆయనదృష్టిలో లేనంతవరకు ఆయన సంతో
న్ని పొందేట్లయితే నేనసలాయనదృష్టిపథంలో నే
ను. ఆయనసంతోషమే నాకు చాలు. అప్పాజీ,
కేదైనా సాక్ష్యమే. నా అంతర్నైర్మల్యాన్ని
కైనా వివరించుకోగలిగాను.

అప్పాజీ:—మూరురాయరగండడు మీరు తప
స్వినీజీవితాన్ని వదలాలని భావిస్తున్నారు.

రాజమ్మ:—ఆఁ! ఆయనమనస్సులో నేనింకా
మెదులుతున్నానా?...పిమ్మట?

అప్పాజీ:—తిరిగి దేవేరిగా...

రాజమ్మ:—అని మీ ఆశీర్వాదమా? అంత
రిక్తవాంఛ లేదప్పాజీ!

అప్పాజీ:—రిక్తవాంఛ కాదు, యుక్తవాంఛ
...మిమ్మల్ని పరిగ్రహించడానికి రాయలే అంగీకరించి
వస్తే?—

రాజమ్మ:—(హర్ష బాష్పాలు) అనూహ్యం.
ఆయనపాదరాజీవాలు పంకిలమౌతాయి.

అప్పాజీ:—రాజీవాలు పంకజాలేకమా!

రాజమ్మ:—అప్పా, మీ వాత్సల్యంతప్ప...
(దుఃఖం)

రాయలు:— (ప్రవేశించి) పవిత్రహృదయానికి
(గాద్గద్యం) ఏనాటికైనా విజయనగరసామ్రాజ్యంలో
అగ్రస్థానం ఉంది.

రాజమ్మ:—(జంకుతూ) స్వామీ... (అప్పాజీని
చూచి) అప్పాజీ...

అప్పాజీ:—తథా భవతు. రాజమార్తాండుని ఆదే
శానికి అడ్డు ఉందా?

రాజమ్మ:— (రాయల పాదాభివందనం)
స్వామీ, ...క్షమ...

రాయలు:—(అంతస్సు గ్రహించి) నీ హృదయ
నైర్మల్యం తిరిగి నన్ను నీవాణ్ణిగా మార్చింది.

రాజమ్మ:—అప్పాజీచాతుర్యవిశేషానికి (తల
వంచి)...కృతజ్ఞతలు.

రాయలు:—నీకు, నాకే కాదు అప్పాజీ
విద్యానగరసామ్రాజ్యానికంతకూ అప్పాజీ.

మాధవస్వామిలో మహస్సు అప్పాజీలో అంత
ర్లీనమైంది.

(ఇద్దరూ అప్పాజీకి మ్రొక్కుతారు)

అప్పాజీ: — దిగంతవిశ్రాంతసంస్తవనీయకీర్తి
మూర్తీ! అరివీరతామసవిధ్వంసనం నీ కుఠారధారా
పరమావధి.

---



## కాశ్మీర్

అన్ని విధములగు దగ్గులు, ఉబ్బసము, ఆయాసము మొదలగు శ్లేష్మవ్యాధులకు అమోఘమైనది. సీసా రు.1-12-0. అన్ని మందుల షాపులలో అమ్మబడును.

**గిరిజా అండ్ కో,**
దానవాయిపేట, రాజమండ్రి.
మద్రాసుస్టాకిస్టులు: జె. బాలాభాయి & కో,
చైనాబజార్ రోడ్.

## మదనకామేశ్వర లేహ్యం

రక్తవృద్ధిని చేయు విలువ గల వస్తువులచే ఇది తయారు చేయబడినది. మేహములు, నిశ్శక్తి, నిస్సత్తువ, శుక్లనష్టము, అతిమూత్రము మొదలగు వాటిని ఖండించి, మంచిబలమును వీర్యపటుత్వమును కలిగించుటలో అద్భుతమయినది. అనేక సర్టిఫికెట్లు గలవు. 2 డబ్బీలు చాలును.

20 తులముల డబ్బ రు. 2/-
పోస్టేజి ప్రత్యేకము.

**పి. సి. ఏ. అండ్ కంపెని,**
పెరిదేపి, (గుంటూరు జిల్లా).
మదరాసు బ్రాంచి:
7. పీసుమొదలి వీధి. (మిద్దెమీద)
వెలెక్టు టాకీస్ ఎదురుగా, జార్జిటవున్

# ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము
## ప్రథమ ద్వితీయ సంపుటములు

ప్రథమ సంపుటమునందు డిమ్మీ ౪-వ ఆకృతియందు ౬౦౦ పుటలుగలవు. ఇందు 'అ' నుండి "అధ్వర్య"వరకును గల విషయము గలదు. త్రివర్ణపటములు ౮, ఇతర పటములు ౧౨౫, వివిధ విషయములు ౪౦౦ కలవు.

రెండవ సంపుటమునందు డిమ్మీ ౪-వ ఆకృతియందు ౬౦౦ లకు మించిన పుటలు కలవు. "అ" మొదలకొని "అశ్విని"వరకు గల విషయము గలదు. త్రివర్ణ పటములు ౧౦. వానిలో ౨ అమరావతీ స్తూపమునకును ౨ అనాహతమునకును చెందినవియు, ౬ దేశ చిత్రపటములను గలవు. ఇదిగాక మరి ౫ సాదా దేశపటములు కలవు. ప్రాచీనాంధ్రుల కళాసంపదను వ్యక్తముచేయు అమరావతీ స్తూపమునుగురించిన గొప్ప వ్యాసమునందు అమరావతీ శిల్పమునకు సంబంధించిన హాఫ్‌టోన్ బొమ్మలు రమారమి ౧౦౦ ను, వేషభూషాదుల వెల్లడించుబొమ్మలు ౫౦ వరకును గలవు. మరియు అభినయమనువ్యాసమున భరతశాస్త్రమునందలి వేరువేరు హస్తములను సూచించు బొమ్మలు ౫౩ ను, 'అనాహతము'నందు షట్చక్రాదుల చిత్రములును గలవు. ఇట్లు ఆయా వ్యాసములకు చెందిన చిత్రములు మొత్తముమీద ౨౫౦ కి పైగా నున్నవి. వివిధ విషయముల సంఖ్య ౪౦౦ వరకు నుండును. సంపుటము చక్కని స్వదేశీ చర్మముతోడను బంగారు రేఖలతోడను సంపుటీకృతము ప్రతి సంపుటమున ౬౦౦ పుటలుండును.

**ప్రతి సంపుటము వెల రూ. 10**

ఖర్చులు పోస్టుద్వారా రూ 1-8-0, రైలుద్వారా దగ్గర చోట్లకు అ. 12.

**ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ కార్యాలయం,** నెం. 7. తంబుచెట్టివీధి. మద్రాసు

# వేములవాడ చాళుక్యులు

(గత సంచికతరువాయి)

## శ్రీ నేలటూరి వెంకటరమణయ్య

### ౮

### ఇమ్మడి యరికేసరి

ఇమ్మడియరికేసరికి రాష్ట్రకూటరాజకుటుంబముతో గాఢమైన సంబంధము గలదు. ఇతని తల్లియగు జాకవ్వ ప్రాయశః ముమ్మడి యింద్రవల్లభుని సోదరియై యుండవచ్చు ననియు, దనభుజమునే తొల్లశేసి యింద్రవల్లభు డితని నెత్తిపెంచెననియు పూర్వప్రకరణమున వ్రాసియున్నాను. మఱియు నాయింద్రవల్లభుడు దన కుమార్తెయగు రేవకనిర్మడి నీతని కుద్వాహము గావించెనని వేములవాడశిలాశాసనమువలన దెలియుచున్నది. రాష్ట్రకూటకులసంజాత యగు లోకాంబిక యను మఱియొక రాజకన్యకనుగూడ నితడు పెండ్లియాడినట్లు పరభణితామ్రశాసనమున గలదు. ఇతనిగూర్చి తెలియవచ్చు చరిత్రాంశములు నాలుగు.

(౧) గోవిందరాజుకోపమునకు పాత్రుడైన చాళుక్యవిజయాదిత్యుని కాశ్రయమిచ్చి రక్షించెను. ఈ విజయాదిత్యుడే వేములవాడశిలాశాసనమున బిజ్జడని పేర్కొనబడియున్నాడు.

(౨) సకలచక్రవర్తి గొజ్జిగ డొక గొప్పసేనతో నొక మహాసామంతు నితనిపై కంపగా నిత డాతనినోడించి తఱుమగొట్టెను.

(౩) బద్దెగదేవుని కిత డాశ్రయ మిచ్చెను; అందులకు గినిసి చక్రవర్తి యెత్తిరాగా నతని గెడపి బద్దెగదేవునికి సామ్రాజ్యము నొసగెను.

(౪) కక్కలుని తమ్ముడగు బప్పని యంశకాఱ దెత్తిరాగా వాని నోడించి పాఱదోలెను.

వీనియందు కడపటి యంశ మొక్కటి దప్ప దక్కిన వన్నియు రాష్ట్రకూటచరిత్రకు జెందినవి. విషయమును జక్కగ నవగాహనము జేసికొనుటకు రాష్ట్రకూటరాజకుటుంబవృత్తాంతమును గొంత తెలిసికొనవలసియున్నది.

ఇమ్మడికృష్ణుడు చేదిరాజగు కక్కలదేవుని కుమారితను బెండ్లియాడెను. ఈమెయం దాతనికి జగత్తుంగు డను పుత్రుడు గలిగెను. ఇతడు తన మేనమామ కక్కలరాజకుమారుడగు శంకరగణ రణవిగ్రహుని కుమారితలను లక్ష్మీగోవిందాంబలను వివాహమాడెను; లక్ష్మియందు ముమ్మడి యింద్రుడును, గోవిందాంబయందు బద్దెగనామాంతరుడగు ముమ్మడియమోఘవర్షుడు నను నిరువురు కుమారులు పుట్టిరి. ముమ్మడి యింద్రవల్లభుడు కొక్కల్లుని మనుమడగు నర్జున అమ్మణదేవుని కుమార్తెను విజాంబ నుద్వాహము జేసికొని యామెవలన నిమ్మడియమోఘవర్ష నాల్మడిగోవిందులను నిరువుర పుత్రుల బడసెను. మఱియు నితని కుమారితను రేవకనిర్మడిని చాళుక్య అరికేసరి పెండ్లాడెను. ఇంద్రవల్లభుని తమ్ముడగు ముమ్మడియమోఘవర్షుడు చేదిరాజుకొక్కల్లుని మనుమడగు ముగ్ధతుంగయువరాజదేవుని కూతురగు కుండకదేవిని వివాహముజేసికొనెను. వీరికి ఖొట్టిగదేవు డను కుమారుడు పుట్టెను; ఖొట్టిగనికంటె పెద్దవాడు ముమ్మడి కృష్ణు డను పుత్రు డొకడు ముమ్మడియమోఘవర్షునకు గలడు. ఇతని తల్లి పేరెద్దియో, యామె యేరాజకుటుంబమున నుద్భవించెనో తెలియదు. రాష్ట్రకూటవంశావతరణమును వంశవృక్షరూపమున నిట్లు లిఖింపవచ్చును.




క్రీ. శ. ౯౨౯-౩౦ సం.న ముమ్మడి ఇంద్రవల్లభుడు కాలగతి నందెను. అతని యనంతర మతని జ్యేష్ఠపుత్రు డిమ్మడి యమోఘవర్షుడు రాజ్యాభిషిక్తుడాయెను; కాని యతని యేలుబడి యొక సంవత్సరము లోపల సమాప్తినందెను. అతని దొలగద్రోసి యతని తమ్ముడు నాల్మడిగోవిందుడు రాజాయెను. ఇతనిని గొజ్జిగడనియు జనులు పిలచెడివారు. ఇతడు తన యన్నను హింసించి వధించె నని దూరు కలుగుటవలనను, వ్యసనాసక్తు డగుటవలనను ప్రజ లితనియెడ విముఖులైరి. స్వార్థపరులైన సామంతులు కొందఱు అదియ యదనుగ గొని యతనిపై దిరుగబడిరి. వీరియందు గోవిందుని పినతండ్రియైన బద్దెగడును, నాతని జ్యేష్ఠపుత్రుడగు కృష్ణుడును ముఖ్యులు. కావున వీరు చక్రవర్తికోపమునకు బాత్రులై రాజ్యమునుండి పాఱిపోయి త్రిపురియందు చేదిరాజునాస్థానమున తలదాచుకొనిరి.1

మఱియు బూర్వసముద్రమునకును గల రాష్ట్రకూటసామ్రాజ్యమున నల్లరులు చెలరేగెను. ముమ్మడి యింద్రరాజుయొక్క రాజ్యాంతదశయందో, లేక నాల్మడిగోవిందరాజురాజ్యప్రారంభకాలముననో వేంగి దేశము రాష్ట్రకూటులకు హస్తగతమాయెను. వేంగి దేశాధీశ్వరుడైన మొదటియమ్మరాజు క్రీ. శ. ౯౨౫-౬ లో పరమపదించెను; మొదటి యమ్మరాజుపుత్రుడు కంఠికావిజయాదిత్యుడు తండ్రియనంతరము రాజ్యాభిషిక్తుడైనను ఒక పక్షమునకంటె నెక్కువకాలము రాజ్యముసేయజాలకపోయెను. తరువాత గుణగవిజయాదిత్యుని తమ్ముడగు మొదటి యుద్ధమల్లుని పుత్రుడు మొదటి తాళరాజొక నెలదినములు రాజ్యమేలినపిమ్మట అతని జంపి ద్వితీయవిక్రమాదిత్యుడు పదునొకండు మాసములు ఏలెను. తరువాత క్రీ. శ. ౯౩౫ ...

1. ఈవిషయము సుడితామ్రపట్టికలవలన దెలియుచున్నది.

"తస్యానుజో నిజభుజార్జితసంపదగ్ర్యో
భూవల్లభం సముపగమ్య డహాళదేశే
శ్రీబద్దెగం తదను తస్య సుతాం సహైవ
కొక్కల్యయా వ్యవహ దుత్తమధీ స్త్రిపుర్యాం."
(ఎపి. ఇండి. సం. 3. పుట ౧౭౦.)

వేంగియందు అంతఃకలహములు పెరిగి యరాజకము ప్రబలెను. ఈ పరిస్థితు లప్పటి పూర్వచాళుక్యుల శాసనముల జక్కఁగ వర్ణింపబడియున్నవి.

"పశ్చా దహమహమికయా విక్రమాదిత్యా స్తమయనే రాక్షసా ఇవ ప్రజాబాధనపరా దాయాదరాజపుత్రా రాజ్యాభిలాషిణో యుద్ధమల్లరాజమార్తండకంఠికావిజయాదిత్యప్రభృతయో విగ్రహీభూతా ఆసన్. విగ్రహేణైవ పంచవర్షాణి గతాని.2"

పై పేర్కొనిన రాజులలో యుద్ధమల్లుఁడు ముఖ్యుఁడు. ఇతనికి స్వబలముకంటె మిత్రబల మెక్కుడు. ఇతఁడు మొదటి యుద్ధమల్లుని మనుమఁడు. కంఠికావిజయాదిత్యుని పదభ్రష్టుని జేసి నెలగొజులు వేంగిసింహాసనము నధిష్ఠించియుండిన ప్రథమతాళరాజపుత్రుఁడు; రాష్ట్రకూటచక్రవర్తి నాల్కడిగోవిందవల్లభుని కాశ్రితుఁడు; అతఁడు దన సహాయార్థ మంపిన దళముల బలిమిచే వేంగిసింహాసనము నాక్రమించుకొని యేడేండ్లకాలము రాజ్యమొనర్చెను. నామకార్థముమాత్ర మితఁడు రాజు; అధికారమంతయు రాష్ట్రకూటులచేత జిక్కెను. ఈవిషయము అమ్మరాజవిజయాదిత్యుని మాంగల్లు తామ్రశాసనమువలన విదితమగుచున్నది.

"సామ న్తశేఖరపల్లభ
దణ్డాశ్వాన్యాచభువ దులుంప న్నద్రాక్
సప్తాశ న్తకెఠిత్ర మల్ల
రసరాజకృతపట్టబన్ధ మన త్యబలాక్."3

ఇందువలన నాల్మడిగోవిందచక్రవర్తి మాన్యఖేటసింహాసనము నధిష్ఠించినవెంటనే రెండవ యుద్ధమల్లునికి గొప్ప సైన్యము నిచ్చి వేంగిమీది కంపి పూర్వచాళుక్యరాజ్యమునం దతని ప్రతిష్ఠించెను. ఇది నాల్మడిగోవిందచక్రవర్తియొక్క యజ్ఞాతఘనకార్యములయం దొకటి. ఇట్లు తన యాశ్రితుఁడు వేంగి నేలుచుండినను, గోవిందుని యధికారము వేంగియందు నిరాఘాటముగ సాగలేదు. మొదటి యమ్మరాజవిష్ణువర్ధనుని ద్వైమాతురుఁడైన రెండవ చాళుక్యభీముఁడు నిజదేశమును రాష్ట్రకూటదాస్యమునుండి తప్పించి పిత్ర్యమైన రాజ్యమును స్వాధీనపఱచుకొనుటకొఱకు పోరాడదొడఁగెను. ఇతని శిక్షించుటకై నాల్కడిగోవిందరా జొక్క గొప్పసైన్యము నంపెను. రాష్ట్రకూటసామంతులగు ధలిగ, న్యాలది మున్నిఅవరాజమార్తాండులను జయించితి నని చెప్పికొని యున్నాఁడు.

"య స్తాతబిక్యనాఖ్యం ధలిగంన్యాలది మున్నిఅవరాజమార్తణ్డౌ అజౌ విజిత్య......"

అని కొలవెన్ను శాసనము4. ఈవిషయము మఱికొంచెము విస్తరించి రెండవ యమ్మరాజు కలుచుంబఱ్ఱుతామ్రశాసనమునందు చెప్పియున్నది.

"శ్రీమ న్త రాజమయ్యం ధలిగమురుతరం
తాతబిక్కిం ప్రచణ్డం
బిజ్జం సజ్జంచ యుద్ధే బలిన మతితరా
మయ్యాపం భీమ ముగ్రం
దణ్డం గోవిందరాజప్రణిహితమధికం
చోళపం లోవబిక్కిం
విక్రాన్తం యుద్ధమల్లం ఘటితగజఘటాక్
సన్నిహ త్యైక ఏవ"5.

ఇట్లు రాష్ట్రకూటసామంతసైన్యమును ద్వితీయచాళుక్యభీముఁడే నిర్జించినట్లు పైశాసనములయందు జెప్పియున్నను, సహాయులు లేక యతనికి జయము చేకూడియుండదు. చక్రవర్తికి ప్రతికూలురైన రాష్ట్రకూటసామంతు లతనికి ప్రత్యక్షముగనో, గూఢముగనో తోడ్పడియుండవలయును. ఈసందర్భమున నీక్రింది యంశములు దృష్టియం దుంచుకొనదగియున్నవి. రెండవచాళుక్యభీముఁడు గోవిందరాజుసైన్యములతో బోరాడుచుండిన కాలముననే పూర్వతెలింగాణమున పెద్ద అల్లరి యొకటి రేగినది. దీనికి ప్రధాననాయకుఁడు వేంగిగడిదేశమున నుండిన వేములవాడచాళుక్యరాజ్యమున కధిపతియైన యిమ్మడి యరికేసరి. రెండవ చాళుక్యభీమునకును, నిమ్మడి యరికేసరికిని నాల్మడి గోవిందవల్లభుఁడు సామాన్యశత్రువు. ఇదలుపు గోవిందుని

2. ఎపి. ఇండి. సం. ౯. పు. ౪౭.
3. Cp. 1. of 19'6-17.
4. SII. 1. No. 37.
5. ఎపి. ఇండి. సం. ౭. పుట ౧౩౭ చేరుకాలు.

మీద విజయమందిరి. క్రీ. శ. ౯౩౫ లో గోవిందుడు రాజ్యభ్రష్టు డాయెను; ఆ సంవత్సరముననే ద్వితీయ చాళుక్యభీముడు వేంగిసింహాసనము నధిష్ఠించెను. ఈ యంశములను చక్కగ విచారించిచూడగా గోవిందరాజు సైన్యములతో ద్వితీయచాళుక్యభీముని పోరాటము ప్రత్యేకమైనది కా దనియు దానికిని దూర్పుతెలింగాణవిప్లవమునకును గాఢసంబంధము గల దనియు దోచుచున్నది.

ఇక దూర్పుతెలింగాణవిప్లవమునుగూర్చి విచారింతము. దీనికి గారణము వేములవాడశిలాశాసనమునందును, పంపని విక్రమార్జునవిజయమునందును నిట్లు చెప్పియున్నది: చాళుక్యవంశజుడగు బిజ్జడు, లేక విజయాదిత్యు డనునతడు నిజప్రభువగు గోవిందచక్రవర్తియొక్క కోపమునకు బాత్రుడయ్యెనట. ఇమ్మడి యరికేసరి యాతని కాశ్రయ మొసగి రక్షించెనట. అందులకు జక్రవర్తి యతనిపై గలుషించి యుద్ధము బ్రకటించెనట. ఇట్లు చక్రవర్తికోపమునకు బాత్రుడై యరికేసరిచే గాపాడబడిన బిజ్జడు, లేక విజయాదిత్యు డెవ్వడో, యతనిపై జక్రవర్తి కేల కోపముగలిగెనో తెలియదు. పరిశోధకు లితని యాచూకీని నిశ్చయింప నేరక పలుతెరగుల నూహించియున్నారు. కొంద ఱితడు పూర్వచాళుక్యవంశజుడగు కొల్లభిగండవిజయాదిత్యు డనిరి6. ఈ వ్యక్తినిర్ణయ మసంగతము.

కొల్లభిగండవిజయాదిత్యుడు క్రీ. శ. ౯౨౧ యందు కళింగముపై దండెత్తిపోయి విరజాపురయుద్ధమున రణశయ్య నలంకరించెను. బిజ్జని యల్లరి నాల్గడి గోవిందవల్లభుని రాజ్యకాలమున క్రీ. శ. ౯౩౦ తరువాత జరిగినది. కావున గోవిందుని కోపమునకు బాత్రుడైన బిజ్జడు కొల్లభిగండవిజయాదిత్యు డని చెప్పుట సరికాదు. మొదటియమ్మరాజవిష్ణువర్ధనుని పుత్రుడగు బేత, లేక కంఠికావిజయాదిత్యుడే బిజ్జడను తలంపు కొందఱికి గలుగవచ్చును 7. కంఠికావిజయాదిత్యుడు తన తండ్రిమరణానంతరము క్రీ. శ. ౯౨౭-౯లో నొక పక్షకాలము మాత్రమే రాజ్యము సల్పియుండినను, రాజ్యపునస్సంపాదనకై యతడు క్రీ. శ. ౯౩౫ మధ్య వఱకును నిమ్మడి చాళుక్యభీమునితో బెనగులాడుచుండి నట్లు సమకాలిక శాసనములవలన దెలియుచున్నది 8; కాని బేతవిజయాదిత్యు డరికేసరిచే సంరక్షింపబడిన బిజ్జడుకాడని శ్రీ భావరాజు వెంకటకృష్ణరావుగారు వాదించుచున్నారు. "పూర్వచాళుక్యశాసనము లితని బేతవిజయాదిత్యు డనియే పేర్కొనుచున్నవి; కాని బిజ్జడని కాదు. మఱియు నతడు (గుజ్జిగగోవింద)నికి గోపమువచ్చునట్లు ప్రవర్తించినట్లును గానరాదు. బిజ్జని వలె నాతడు గోవిందుని కాశ్రితుడును గాడు. మన ప్రస్తుత (వేములవాడ) శాసనముగాని, పంపని విక్రమార్జునవిజయముగాని బిజ్జడు పూర్వచాళుక్యరాజకుమారుడని తెలుపవు. బిజ్జడే వేంగిరాజవంశజుడైయుండిన నాయంశమును నిమ్మడి యరికేసరి సగర్వముగ జెప్పియుండును; ఏలన నది యతని ఘనతను, పరాక్రమమును హెచ్చించి యుండును9." ఇట్లు కృష్ణరావుగారు బేతవిజయాదిత్యుడు బిజ్జడు గాడని సకారణముగ రుజువు చేసినను, నత డెవ్వడో నిరూపింపక విడిచిపెట్టిరి. వేంగిపూర్వచాళుక్య, వేములవాడచాళుక్యవంశములుగాక మఱియొక రాజవంశ మాంధ్రదేశమున రాజ్యము సేయుచుండెను. వీరికి చరిత్రపరిశోధకులు ముదిగొండ చాళుక్యులని నామకరణము జేసియున్నారు. వీరి తామ్రశాసన మొకటి వెలువడియున్నది. దీని కాలమును స్పష్టముగ నిర్ణయించుటకు దగు నాధారము లేమి గానరాకున్నను, నక్షరస్వరూపమును బట్టి తత్కాం గా

---

6 Dynasties of the Kanarese Districts, P. 381.

7. JAPRL. VI. P. 176.

8. ఎపి. ఇండి. సం. ౯. పు ౪౩.

"యుద్ధమల్లరాజమార్తణ్డకంఠికావిజయాదిత్య ప్రభృతయో విగ్రహీభూతా ఆసన్. విగ్రహేణైవ పంచ వర్షాణి గతాని. తతః—

రాజోఽవధీద్రాజమార్తణ్డ స్తిమ యేన రణౌ కృతౌ,
కంఠికావిజయాదిత్యయుద్ధమల్లౌ విశేశగౌ."

వీరిని దఱుముకొట్టియే క్రీ.శ. ౯౩౫లో నిమ్మడి చాళుక్యభీముడు రాజ్యాభిషిక్తుడైనది.

9. JAHRS. VI. P. 176.

ఘుడును రెవరెండు సి. వెండలుగారది క్రీ. శ. ౧౧వ శతాబ్దము (క్రీ. శ. ౧౦౦౦—౧౧౦౦)నకు జెందిన దని నిశ్చయించి యున్నాడు. అందలి చాళుక్యవంశాను క్రమణిక యిట్లు వర్ణింపబడియున్నది :10




ఈవంశమున కడపటివాడైన నాల్గవ కుసుమాయుధుడు క్రీ. శ. ౧౦౫౦ ప్రాంతమున నుండె నని తలచిన తరమునకు నిరువదియైదేండ్లచొప్పున పరిగణించిన నీవంశపు రాజుల కాలము నిట్లుజ్జాయించి చెప్పవచ్చును:

(1) కొక్కిరాజు ౮౭౫— ౯౦౦
(2) మొదటికుసుమాయుధుడు ౯౦౦— ౯౨౫
(3) బిజయిత ౯౨౫— ౯౫౦
(4) రెండవకుసుమాయుధుడు ౯౫౦— ౯౭౫
(5) విజయాదిత్యుడు ౯౭౫—౧౦౦౦
(6) మూడవ కుసుమాయుధుడు ౧౦౦౦—౧౦౨౫
(7) నిజ్జియరాజు ౧౦౨౫—౧౦౫౦
(8) నాల్గవ కుసుమాయుధుడు ౧౦౫౦—౧౦౭౫

ఈ యుజ్జాయింపుకాలానుక్రమణిక ననుసరించి రాష్ట్రకూటనాల్మడిగోవిందరాజుకాలమున (క్రీ. శ. ౯౩౦-౯౩౬) ముదిగొండచాళుక్యబిజయితుడు రాజ్యము సేయుచుండినట్లు తేలుచున్నది. ఈయంచన సరియైనదే యని నిరూపించుటకు గొంత శాసనసాక్ష్యము గలదు. బిజయితుని తండ్రి మొదటికుసుమాయుధుడు పైని కాలానుక్రమణికప్రకారము ౯౦౦-౯౨౫ల మధ్య రాజ్య మొనర్చియుండవలయును. క్రీ.శ. ౮౯౨-౯౨౧ల నడుమ వేంగీదేశమును బరిపాలించిన మొదటి చాళుక్య భీముని సామంతు డొక కుసుమాయుధుడు గలడు. ఇతడు దన్నేలిన ప్రభువునకు బాసటయై నిలచి రాష్ట్రకూటబలముల నోడించి యతని నిజరాజ్యమున సుప్రతిష్ఠితుని గావించెనని కొఱవిశిలాశాసనమునందు చెప్పియున్నది11. కావున ముదిగొండచాళుక్యప్రథమకుసుమాయుధుడు మొదటి చాళుక్యభీమునికి సమకాలికు డనుటకు మనము సంశయ మందనలసినదిలేదు. ఇతని కుమారుడగు బిజయితుడే యిమ్మడి యరికేసరిచే రక్షింపబడిన చాళుక్యబిజ్జ-విజయాదిత్యుడు. ఇతడు పాలించుచుండినది రణమర్దకసీమ. కృష్ణాజిల్లాలోని కొండపల్లి మొదలుకొని వరంగలుజిల్లాయందలి కొఱవిపర్యంతము గల భూమి యితని పాలనక్రింద నుండినది. మంచికొండసీమ యతని రాజ్యమునకు జెందినదే. ఇతని రాష్ట్రమున కుత్తరపుసరిహద్దు వేములవాడ చాళుక్య రాజ్యము. రాష్ట్రకూట నాల్మడి గోవిందరాజు రాజ్యము దూర్పున సముద్రముపర్యంతము వ్యాపించి యుండినందున ద్వితీయయుద్ధమల్ల అరికేసరులవలెనే ముదిగొండ బిజయితుడుగూడ రాష్ట్రకూటసామంతు డని నిశ్చయించి చెప్పవచ్చును.

నాల్గవ గోవిందరాజునకు బిజ్జనిమీద నేల కోపము కలిగెనో నిశ్చయముగ మనకు దెలియదు. కాని యూహసేయవచ్చును. బిజ్జనివంశమువారు పూర్వ చాళుక్యరాజుల కాశ్రితులైన సామంతులు; అతని తండ్రియగు మొదటికుసుమాయుధుడు ప్రథమచాళుక్య భీమునికి సామంతు డనియు, వేంగిదేశముపై నెత్తివచ్చిన ఇమ్మడికృష్ణవల్లభుని నిగ్రహించి తన రాజును రాజ్యమున సుప్రతిష్ఠితుని గావించె ననియు బూర్వప్రకరణమున జెప్పియున్నాడను. నిజరాజ్యస్వాతంత్ర్యస్థాపనకై రాష్ట్రకూటులతో ఘోర సమరకట్టిన ద్వితీయ చాళుక్య

10. Ind. Ant. XXXII. PP. 281-84.
11. తెలిం. శాస. ఇతర. సం. ౧౨.

భీముసకు బిజ్జడు ప్రత్యక్షముగనో, రహస్యముగనో సహాయముచేసియుండవచ్చును. అందులకు గినిసి నాల్గవ గోవిందచక్రవర్తి యతని శిక్షించుటకు ప్రయత్నింపగా నతఁడు దన పొరుగున నుండు వేములవాడ ప్రభువును, దనవలెనే చాళుక్యవంశసంభూతుఁడును నగు నిమ్మడి యరికేసరిసాయము నపేక్షించెను. అరికేసరి నాల్మడి గోవిందరాజునకు బావమరిదియైనను నతని యెడ విముఖుఁడై యతని శత్రుల కెలతోడ్పడెనో చెప్ప టకు వీలుగాదు; కారణ మేదైయైనను నీతఁడు చక్రవర్తిని ప్రతిఘటించి యతని పతనమునకు గారకుఁడాయెను. వేములవాడ శిలాశాసనమందును, విక్రమార్జునవిజయమందును నరికేసరి నాల్మడి గోవిందరాజు నత్యంతసులభముగ నోడించి రాజ్యపదభ్రష్టుని గావించె నని చెప్పియున్నది. ఇది కేవల మతిశయోక్తి. నాల్మడి గోవింద చక్రవర్తి యతని శత్రువులును, వారివాక్యములే వేద వాక్యము లని విశ్వసించి యతనిచరిత్రను రచియించు నాధునికపరిశోధకులును చెప్పునట్లు దుశ్చరిత్రుఁడును, దుర్బలుఁడును గాఁడు. కర్ణాటకమునందలి సామంతు లందఱును నతనియందు విశ్వాసమును గోలుపోలేదు. పాశ్చాత్యగంగరాజగు రాజమల్లుఁడును, కదంబబిజ్జడు మొదలగు పెక్కండ్రతనిపక్షముననే యుండిరి. గోవిందుని ప్రతిఘటించిన సామంతులలో ప్రముఖులు తెలింగాణ వేంగిదేశములను బాలించుచుండిన చాళుక్యప్రభువులే. ఇమ్మడి యరికేసరి, బిజ్జడు, ద్వితీయచాళుక్య భీముఁడును విప్లవకారులయం దగ్రేసరులు. నాల్మడి గోవిందరాజు వీరి నడచుటకు రెండుమూడుపర్యాయ ములు ప్రయత్నముజేసెను.

(౧) తన సామంతుడైన పూర్వచాళుక్యద్వితీయ యుద్ధమల్లునికి బాసటగ రాజమయ్యమొదలగు దండ నాయకుల యాధిపత్యముక్రింద నొక గొప్ప సైన్యమును వేంగిపై కంపెను. ఈసైన్యము నొక మహాభీకర సంగ్రామమున ద్వితీయచాళుక్యభీము డోడించె నని కలు చుంబట్టుతామ్రశాసనమువలనదెలియవచ్చుచున్నది. 12

---

12. ఎపి. ఇం. సం. ౩, పుట ౧౭౭ చదువాయి.

13. తెలిం. శాస. ఇతర సెం. ౨౧.

14. విక్ర వి. ౯-౪౨-౪౩ ల మధ్య వచనము, (?): ౯౩-౯౪ ల మధ్య వచనము,

(౨) ఇమ్మడి యరికేసరి చాళుక్యబిజ్జని కాశ్రయ మిచ్చినందులకు గినిసి యాతని శిక్షించుట కొక సైన్యము నంపెను. వేములవాడశిలాశాసనమునం దిట్లున్నది:

"సామస్తాద్దణ్డముఖ్యా
న్నిజ భుజపరిఘాప్రస్ఫురత్ఖడ్గధారా
నీరాంభోరాశిమగ్నాం
స్తురగకరి ఘటాపత్తి సంపత్తియుక్తాఁ
కృత్వా పశ్యా (?) య్యాఁ మాయ్యాం
స్వజనపరిజనైః సన్నిహత్యాఽఽజిరంగే
క్రుద్ధే గోవిందరాజే శరణముపగతో
రక్షితో యేన బిజ్జః." 13

ఈయంశము పంపని విక్రమార్జునవిజయమందును సూచింపబడియున్నది. "చళుక్యకులతిలక నప్ప విజయాదిత్యంగె గోవిందరాజం ముళిదెఱిఁదర దెపెఱగిక్కి కాద శరణాగతజలనిధి యపెంపునం, గొజ్జిగనెంబ సకళచక్రవర్తియ బెససె దండువంద మహాసామంతరం మరలిచిదు గెల్ద సామంత చూడామణియభీరమముం", "గొజ్జిగనెంబ సకలచక్రవర్తి ముళిదె తనగ శరణాగతనాద విజయాదిత్యన కాద బల్లాళ్తనదోళ్ శరణాగతజలనిధియుం."14

(౩) ఇట్లు గోవిందరాజు పంపిన సామంత బలము నోడించినను నతనితోటి పోరంతట ముగియ లేదు. మరల గోవిందరాజెత్తి రాగలఁడు; అతని నెదుర్కొనుటకు దగు ప్రయత్నము చేయవలసియుండెను; కావున నతఁడు తన దృష్టిని త్రిపురివైపునకు ద్రిప్పెను. బద్దెగని పక్షమవలంబించిన నతనితోగూడ చేది బలము దనకు సహాయము రాగలదు. అతని మామగారగు యువరాజదేవు డతని రాష్ట్రకూటసామ్రాజ్య మున ప్రతిష్ఠించుటకు దన యాశచ్ఛక్తిని వినియోగించును—అని చింతించి గోవిందుని రాజ్యభ్రష్టుని గావించి, యతని స్థానమున బద్దెగని స్థాపించుట తనకు శ్రేయస్కరమని నిశ్చయించి బయలువెడలి వేములవాడకు రమ్మని యాహ్వానించెను. బద్దెగఁడు వెంటనే త్రిపురినుండి తరలివచ్చి వేములవాడ జేరెను. తరువాత యుద్ధము ప్రారంభమైనది. ఈ పోరాటమునుగూర్చి మన కేమియు దెలియదు; కాని తుద కరికేసరి విజ

మును బంపెననియు, నాల్మడి గోవిందుని యేలుబడి యంతటితో సమాప్తినంది బద్దెగని పాలన యారంభ మాయెననియు, 'నవతివర్తియాగి మార్మలెవచక్రవర్తియుం కిడిసి తన్న నంబి వంద బద్దెగదేవంగె సకళ సామ్రాజ్యమనోరంతుమాడి నిఱిసిదరికేసరియ తోళ్వలమూమం' అను పంపకవివాక్యమువలన దెలియుచున్నది15. ఈయుద్ధమున నిమ్మడి యరికేసరి నాల్మడి గోవిందరాజును జంపెనని కొందఱు పరిశోధకు లభిప్రాయ పడుచున్నారు16. ఈ యభిప్రాయము సరియైనదని యంగీకరించుటకు వీలులేదు. ఏలనగా, సమకాలికచోళశాసనములవలన నాల్మడి గోవిందరాజు దన పరాజయానంతరము తనకు పిల్లనిచ్చిన మామగారగు చోళరాజు పరాంతకుని రాజ్యమున గనీసము క్రీ. శ. ౯౩౭ వఱకు నివసించుచుండినట్లు తెలియవచ్చుచున్నది.17

ఇమ్మడియరికేసరిఘనకార్యములలో వివరింపవలసిన దింకొక్కటి మిగిలియున్నది. కక్కలుని తమ్ముడైన బప్పువనియంకకాఱునిపై నితని విజయము. కక్కలుని యూనవాలుపట్టుటయందు పరిశోధకులు భిన్నాభిప్రాయములను వెలిబుచ్చియున్నారు. డాక్టరు బార్నెటు, ఇతడు కక్కడను నామాంతరముగల కడపటి రాష్ట్రకూటచక్రవర్తియగు ద్వితీయకక్కలుడు గావచ్చుననిరి18. ఈ వ్యక్తినిర్ణయమునే శ్రీ భావరాజు వి. కృష్ణరావుపంతులుగారంగీకరించిరి. మఱియు నితని తమ్ముడగు బప్పువడే యొక సైన్యముతోగూడ నిమ్మడియరికేసరిపై యుద్ధమునకువచ్చి యతనిచే నిర్జితుడై యతనికి లొంగెనని వ్రాసియున్నారు19. డాక్టరు బార్నెటుగారి వ్యక్తినిర్ణయము సరియైనది కాదని ఆచార్య కె. ఎ. నీలకంఠశాస్త్రిలవారు త్రోసిపుచ్చిరి. వీ రిట్లు చెప్పుచున్నారు: "ఇచట పేర్కొనబడిన కక్కలుడు తరువాత చాలకాలమునకు రాజ్యమునకు వచ్చినట్టి యాపేరిటి కడపటి రాష్ట్రకూటరాజు కాజాలడు. అత డప్రకటితమైన శిలాహారతామ్రశాసనమున ముమ్మడి యమోఘవర్షునిచే బరాభూతుడైనట్లు చెప్పియుండు నాపేరిటి మనుజుడై యుండవలయును. బప్పువడు గోవిందుని పక్షము నవలంబించి నిజగజదళములతో నతని నెదుర్కొని యుద్ధముజేసి యోటమి నందియుండవలయును"20. ఈ రెండు వ్యక్తినిర్ణయములలో నాచార్య నీలకంఠశాస్త్రిలవారిదే సమంజసముగను, నంగీకార్యముగను నున్నది. కాని డాక్టరు బార్నెట్టుగారి కక్కలునికిగాని, యాచార్యనీలకంఠశాస్త్రిలవారి కక్కలునికిగాని బప్పువ డను తమ్ము డుండెననుట కెట్టి యాధారమును గానరాదు. మఱియు శ్రీ భావరాజు వి. కృష్ణరావుపంతులుగారును, నాచార్య నీలకంఠశాస్త్రిలవారును బప్పువడే స్వయముగ నిమ్మడి యరికేసరితో బోట్లాడి యోడిపోయినట్లు వ్రాసియున్నారు; కాని వీరి యభిప్రాయములో పంపకవివాక్య మించుక విరోధించుచున్నది. "కక్కలన తమ్మనప్ప బప్పువనంకకాఱన నొందు మదాంధగంధసింధురద నోడిసిద వైరిగజఘటావిఘటననదటుమం"21 అను వాక్యమువలన నిమ్మడి యరికేసరి నెదిరించినవాడు బప్పువని యంకకాడుగాని బప్పువడు కాదని స్పష్టమగుచున్నది. అంకయుద్ధమున నొకనినై మఱియొకనితో

---

15. విక్ర. వి. ౯ : ౫౨-౫౩ ల మధ్యవచనము.

16. శ్రీభావరాజు వి. కృష్ణరావుపంతులుగారు ఇట్లనుచున్నారు: "రాష్ట్రకూటరాజగు గొజ్జిగడు దన యధికారమున కెదురుదిరిగిన సామంతరాజులను శిక్షించుటకై గొప్ప దండుతో గూడ స్వయముగ వారిపై నెత్తిపోయెను; కాని యటుపిమ్మట నడచిన యుద్ధములో నత డోడి నిహతుడాయెను." (J. A. H. R. S. VI. P. 184). 'ఇది చక్రవర్తియుం కిడిసి' అను పంపకవిమాటలపై నాధారపడియున్నది. 'కిడిసి' యనగా 'చెఱచు' అని యర్థము. దీనికి 'చంపి' యను నర్థ ముండునట్లు తోచదు.

17. ఏ. ఎస్. రామనాథయ్యరు. ఎపి. ఇండి. సం. ౨౬. పుటలు ౨౩౦-౨౩౨.

18. ఎపి. ఇండి. సం. ౧౩, పుట. ౩౨౯.

19. JAHRS. VI. P. 184.

20. Journal of the Madras University XV, No.2, P.124.

21. విక్ర. వి. ౯ : ౫౨-౫౩ ల మధ్యవచనము.

యుద్ధముసేయు ప్రతినిధి యంకకా డనబడు చున్నాడు22. ప్రతినిధి పొందిన జయాపజయములు నిక్షాజకునివే రైనను నాధారగ్రంథాదులం దుండు విషయము నుండునట్లే చెప్పుట మంచిది.

ఇమ్మడి యరికేసరినిగూర్చి మనకు దెలియ వచ్చెడు విశేషాంశము లింకేమియు గానరావు. ఇతనికాలు పుల(సోలదగంఘ)బద్దెగని తంత్రపాలుడైన నాగమార్యుని పుత్రుడు పెద్దణార్యుడను బ్రాహ్మణుడు తంత్రపాలుడుగ నుండెను. తంత్రపాలు డనగా సేనాధిపతి. దీనివలన వేములవాడ చాళుక్యుల యేలుబడిక్రింద పెద్దణార్యుని కుటుంబమువారు కులక్రమాగతులుగ, సేనాధిపతులుగ నుండిరని తేలుచున్నది23. పెద్దణార్యునిచే బ్రార్థింపబడి ఇమ్మడి యరికేసరి యతనిచే నిర్మితమైన యాదిత్యగృహ మునకు వచ్చు నభ్యాగతజనుల సత్రముకొఱకు భూదాన మొసగెను. ఈదానమును బ్రకటించుటకొఱకే వేముల వాడ శిలాశాసన ముల్లేఖింపబడినది. ఈ పెద్దణార్యుడు గాక ఇమ్మడి యరికేసరియనుచరులలో మఱియొకని పే రీశాసనమువలన దెలియవచ్చుచున్నది. ఇతని పేరు గుణక శర్మయని డాక్టరు మారేమండ రామారావుగారు పఠిం చిరి. శ్రీకృష్ణరావుపంతులుగారు 'గుణకరశేన'యని చదివిరి. ఆచార్య నీలకంఠశాస్త్రిలవారు కృష్ణరావుగారి పాఠమునే యంగీకరించిరి. శాసనప్రతిబింబములను దెప్పించుకొని వానిని జక్కగ పరిశీలించి 'గుణాంకుశేన' యనునది సరియైన పాఠ మని కీ. శే. రావుబహాదూరు సి. ఆర్. కృష్ణమాచార్యులవారు నిర్ణయించిరి. ఇతడు ఇమ్మడియరికేసరి యొక్క మహాసాంధివిగ్రహికుడు. గుణాంకుశుని వేములవాడశాసనమునందు పేర్కొనుటకు గారణము లేకపోలేదు. సాంధివిగ్రహులు మంత్రు లనియు, నన్యరాజులతో సంధిగాని, యుద్ధముగాని వీరి మూలముననే జరిగెడిదనియు జరిత్రపరిశోధకు లభిప్రాయ పడుచున్నారు. కానిలభ్యమైన సాక్ష్యమును బట్టి చూడగా వీరి వృత్తికర్మమునకు సంధివిగ్రహములతో నెట్టిసంబంధ ముండినట్లు గానరాదు. వీరు శాసనముల యందు సర్వసామాన్యముగ శాసనగ్రంథరచయితలుగనే పేర్కొనబడియున్నారు. సాంధివిగ్రహిపదముల కీచట షాడ్గుణ్యముతో నెట్టి సంబంధ ముండునట్లు తోచదు. వీని కిచట వాక్యరచనయందు శబ్దములను గూర్చుట, సమస్తపదములను విడదీయుట యని యర్థముచేసి కొనుట యుక్తము24. కావున గుణాంకుశుడు వేముల వాడశాసనగ్రంథమును రచియించుటచేత నత డందు పేర్కొనబడియెను.

"సంధివిగ్రహచింతాస్య పదవిద్యా స్వభూ త్పరం
ధూతయాతస్యపక్షస్య క్వ సంధానం క్వ విగ్రహః"

ఈశ్లోకముపై గన్నడవ్యాఖ్య : "భరతరాజనిగె సంధియ చింతెయూ విగ్రహద చింతెయూ ముఖ్యవాగి వ్యాకరణశాస్త్రగళ ల్లిద్దవు. సంధియూ యుద్ధవూ ఇరలిల్లవెం దర్థవు. శత్రుపక్షవన్ను నాశమాడిదవనిగె సంధి యెల్లి? యుద్ధవెల్లి?"

(సశేషము)

---

22. చూ. భారతి సం. ౨౮. పుటలు ౪౯-౩-౬.

23. ఆచార్య నీలకంఠశాస్త్రిలవారీ బద్దెగడు వేములవాడ చాళుక్యబద్దెగడు గాడనియు, ముమ్మడి యమోఘవర్ష బద్దెగడు గావలయుననియు నభిప్రాయపడు చున్నారు. పెద్దణార్యుని తండ్రియైన నాగమార్యుడు బద్దెగని సత్రపాలు డని వ్రాసిరి. ఇది డాక్టరు మారే మండ రామారావు, శ్రీ భావరాజు వి. కృష్ణరావు పంతులుగారల యపపాఠము నాధారముజేసికొని వ్రాసి నది. శాసనప్రతిబింబమున (చూ. ఆంధ్రేతిహాస పరిశోధన పత్రిక, సం. ౬. పుట ౧౪౯ ఎదుట)—

౨౫. "శ్రీమా న్సధి బ్బద్దిగభూమిభర్తు స్త[ం]
౨౬. త్రాధిపాలో౽ జని నాగమార్యః"

అనియే యున్నది.

24. cf. జినసేనకృతపూర్వపురాణము. త్రింశ తము పర్వము, ౧౧.

# మధురస్మృతి

శ్రీ వేదాల తిరువేంగళాచార్యులు

---

ఇది స్మృతిచిహ్న మీయెడ పయింబయి పొంగు మహోజ్జ్వలంపు న
మ్మది; మధురంపు వేదనల మాలిమి తాలిమి తూలజేయగా
నొదవెడు చిత్తమం దెసగు నూహలు కూర్చిన రూపురేఖలఁ
పదిలమొనర్చు భావనలు పల్కుట భావ్యము కాదు బైటికిఁ.

మనసున కూరటల్ సలుపు మాటల తేటల నూటలూరగా
ననుకొనినాను; తానుగ నయంబు భయం బనయంబు జూపు మో
మును కనినాను లోన;- తలపోయని పోకల దూకు దైవచిం
తన గమనించినంత వితథంబగు నంతయు వంత సంతనై.

తరచుగ నెవ్వరిఁ జనని దారినె తారుచునుండు దివ్యసుం
దరతరుణారుణారుణకనత్కనకాభమయూఖమాలికా
దరవికసత్సరోజమధుధార సుధారసమాధురీవరం
పర యది యాని యాని తనుపారు కృపారసముఁ దలంచెదఁ.

కలిగిన యన్నినాళ్లు తణకఁ బెణకఁ పనిలేక ద్రాక్ష తీ
వెల ఫలగుచ్ఛముల్ విరియు వెల్లువ పెల్లుబుకంగ మోవి తీ
పుల పులకండముల్ గలిపి భావపరంపదమందు పట్ట భ
ద్రులమయి ఖేదమోదముల త్రోవలు దాటుట గుర్తువచ్చెడిఁ.

జిలిబిలి వ్రేళ్లు చెక్కులను జేరిచి, కన్నుల వన్నెచిన్నెలఁ
గలిపి మొగంబు భావన వికస్వరమైన పికస్వరంబు చి
ప్పిల మధుమాధురీలహరివీచిక లొయ్యన తియ్యనైన అం
ఘ్రుల లయముఁ మనోలయముకూర్చుట కూర్చిన గుర్తు వచ్చెడిఁ.

ఒకయెడ నొక్కమాటయె అయోమయమైన దిదేమి ఎట్లు దీ
నికి వివృతిక్రియల్? పలుకునిల్వని చెల్వది చెల్వ? నిల్వ మిం
తకు నను భావ మేది? నవనవ్యత భావము పైకొనఁ మనం
బొకయెడ తన్నుతా దలచి యూహయొనర్చుట యెట్లు చూపుటల్!

మన యనుబంధ మెట్టి దనుమానము లేక వచింపుమా ! సునం
దనము రచింపుమా ! హృదయదారకమర్మము చింపుమా ! తనం
తన సుధ పొంగిపొంగి వినతానతిదాస్యము వాయజేయు మో
హనమన, కామమన్న, ప్రణయంబన మాటల చుక్కనేకదా!

అది మన మైత్రియా ! ప్రణయమా ! నయమా ! భయమా ! విరోధమా !
మది ననురోధమా ! శపథమా !పథమా ! మనలోని మోదమా !
వదలగజాలనట్టి అనువాదమ ! వాదమ ! ఖేదమా ! దురా
సదమగు వాఙ్మనస్సులకు జల్పిన సంగతి యోజనాగతిన్.

ఏమనబోయినన్-మరి ఏదేవిధి తల్పగబోయినన్-ఇకే
గోమున చూడబోయిన నగోచరమేసుమి నీచరిత్ర మీ ·
జామున ఈనిమేషమున సాగిన లోగిన బాగొ ! ఓగొ !! ఇం
తే మరి దక్కు-తక్కనది తేలదు పోలదు బుద్ధి కెన్నడున్.

తేలదు పొమ్ము చింత జలధిన్ ; మనజాలదు పొమ్ము భావనా
జాలమునన్-కుమారిలెదు సాగెదు దుఃఖపు గుమ్ములో, మరే
వేళకునైన ఏపొలము వ్రేగులనైన తనంతనే మనే
పోలికలే కనంబడెడు పొమ్మిక నేల వృథాప్రయాసముల్ !



# మమకారం

[కథానిక]

●

శ్రీ గోపీచంద్

జోగయ్యమామ కఱ్ఱపోటు వేసుకుంటూ వచ్చి కాలవకట్టమీద వున్న నేరేడు చెట్టునీడను నుంచున్నాడు. సూర్యుని కిరణాలకు చెయ్యి అడ్డంపెట్టుకుని తన పొలాన్ని ఒక్కసారి చూచుకున్నాడు. తన చేల గట్లమీద వున్న తుమ్మచెట్లన్నీ అతనికి గుర్తే. అవికూడా తనతో పుట్టి, తనతోపాటు పెరుగుతూ వస్తున్నయి. అందులో, తన హయాంలో, అవసరంగా నాగలిదుంపలకు కావలసివచ్చి రెండు తుమ్మచెట్లనుమాత్రం నరికించాడు. అవి వుండే స్థలం యిప్పటికీ అతనికి బోసిగా కనిపిస్తూనేవుంటుంది. ఆ స్థలాన్ని చూచి నప్పుడల్లా చేతికింద కొచ్చిన యిద్దరు కొడుకులు తన్ను విడిచి వెళ్లినట్లు బాధపడుతూ వుంటాడు.

జోగయ్యమామ నిట్టూర్పువిడుస్తూ తలకు చుట్టుకున్న గుడ్డ పరచి, నేరేడు చెట్టుకింద కూర్చున్నాడు. అతనికి ముగ్గురు కొడుకులు. పెద్దఅతను నరసయ్య. పొలం పని చూచుకుంటున్నాడు. రెండో అతను దొరయ్య. బట్టలదుకాణం పెట్టి, సొంతంగా నాలుగురాళ్లు సంపాదిస్తున్నాడు. ఆఖరి కొడుకు వెంకటసుబ్బయ్య. ఇంగ్లీషుచదువు చదువుతున్నాడు. వీళ్లుకాక అతని కిద్దరు కూతుళ్లు. అతని పిల్లలందరికీ అతనంటే యిష్టమే. అతనికీ వాళ్లంటే ప్రేమే. కాని అవసరమైతే వాళ్లను చూడకుండా వుండ గలడు గాని, తన పొలాన్నిమాత్రం చూచు కోకుండా ఒక్క పూటకూడా వుండలేడు. తన పిల్లలందరూ పొలంమీద పాటుపడాలని వుంటుం దతనికి. పొలాన్ని వృద్ధిచెయ్య టానికే వాళ్లు పుట్టింది అనిపిస్తుంది. అందు కనే బట్టలదుకాణం పెట్టిన కొడుకుమీద మనసులో కొంచెం కోపం. 'వాడూ మంచి వాడే. పెళ్లాంమాట విని చెడిపోయాడు' అని చెపుతాడు.

జోగయ్యమామ కిపుడు వందెకరాలు వుంది. ఆస్తిలో ఎక్కువభాగం తాను రెక్కలమీద సంపాయించినదే. అందుకని మిగిలిన బాంధవ్యాలన్నీ ఆస్తిముందు స్వల్పంగా కన్పిస్తయి అతనికి.

పొలాన్ని ప్రాణప్రదంగా కాపాడ తాడు. పొలం బాగా పండటానికి ఏపనైనా చేస్తే అనేకసార్లు తన ప్రాణాలను లెక్క చెయ్యకుండా అవతలవాళ్లు వేయించిన అడ్డకట్టను తీయించి, తన చేనుకి నీళ్లు పెట్టుకున్నాడు జోగయ్య. ఎవ్వళ్లొస్తారో

రండి అని దుడ్డుకర్రి బట్టుకొని చేనుగట్టు మీద నుంచుంటే పూరు పూరంతా వాడ లెత్తిపోయేది. బాగా నెర్రిగొట్టిన తన చేను ఆ నీటిని గుటగుటా తాగుతుంటే పసివానికి స్తన్యాన్నిస్తూ పరవశత్వంతో కూర్చునే తల్లిలా నుంచునేవాడు. కొడుకులు పెరిగొచ్చింతర్వాత "మేం వుండగా నీకెందుకీ తాపత్రయం, కృష్ణా రామా అనుకుంటూ కాలం గడుపుకోక" అంటున్నారు. వాళ్లకేం తెలుసు పసిగాయలు! యీ తాపత్రియంవల్ల తనెంత సుఖపడుతున్నదీ వాళ్లకు అందే అనుభవం కాదు.

నెల రోజుల క్రితం జోగయ్యమామ భార్యకు జబ్బుచేసి ప్రాణంమీదకు వచ్చింది. అప్పటికి పది రోజులనుంచీ ఆమె ముక్కుతూ మూలుగుతూ వుందే గాని, జోగయ్యమామ అట్టే పట్టించుకోలేదు. ఆ విషయం యింట్లోవాళ్లు ఎవళ్లు కదిలించినా, "రోగాలు మనుష్యులకు రాక మానులకు వస్తయ్యా?" అంటూ వెళ్లేవాడు. దమ్ముచేసే రోజు లవి. అతనికి తీరేది కాదు. ఏదైనా జబ్బు అంతతొందరగా మూసుకొస్తుందనుకోలేదు అతను. "నువ్వింట్లో వుండు, అమ్మని కని పెట్టుకొని; నేను చేను తడిపించి వస్తాను" అని పెద్దకొడుకన్నాడేగాని జోగయ్యమామ యింటిదగ్గర వుండలేకపోయ్యాడు. అసలే నీటికి ఎద్దడిగా వుంది. ఎవరు అడ్డం వేస్తారో. తన పెద్దకొడుకు బుద్ధిమంతుడే కాని వుట్టి అర్భకుడు. అవతలవాళ్లు కోరుచేసుకుంటే వెనక్కు తగ్గుతాడు. తీరా, పొలం తడవకపోతే, తరువాత ఏమనుకు నేం లాభం? అందుకని వూళ్లో వైద్యుడి చేత భార్యకు నాలుగు మాత్రిలు యిప్పించి, కాసిని నీళ్లు తాగించి "కళ్లు మూసుకు పడుకో. కునుకు పడుతుంది" అని చెప్పి, తను పొలం బయలుదేరాడు. వూరిచివర చింతచెట్టుదగ్గరికి వచ్చేసరికి కొడుకు పంపిన మనిషి ఎదురుగుండా వచ్చాడు. "అవతల వాళ్లు కర్రిలూ బల్లాలూ పుచ్చుకుని సిద్ధంగా వున్నారు. నర్సయ్యకి కాలూ చెయ్యీ ఆట్టంలేదు" అని చెప్పాడు.

జోగయ్యమామ గబగబా పొలానికేసి నడిచాడు. కాలవకు వేసిన అడ్డు తెంచి నీళ్లని తన చేలోకి మలిపాడు. అవతలి వాళ్లు కర్రిలూ, బల్లాలూ పట్టుకొని చూస్తూ నుంచున్నారేగాని ఏమీ అనలేక పోయారు. తన చేలోకి నడుస్తున్న నీటి గలగల వింటూ సర్వం మరచి నుంచున్నాడు చేనుగట్టుమీద జోగయ్యమామ.

"అమ్మ కెట్లా వుంది?"— అడిగాడు నర్సయ్య.

"ఉంది" అన్నాడు జోగయ్యమామ.

"తగ్గిందా?" అడిగాడు నర్సయ్య.

"తగ్గ కేం జేస్తుంది?" అన్నాడు జోగయ్యమామ.

"ఇంక మనం వెళ్దాం" అన్నాడు నర్సయ్య. యీ మాటకు జోగయ్యమామ వులిక్కిపడ్డాడు. "చేనంతా తడవక ముందే విడిచి వెళ్లడమే?" అన్నాడు జోగయ్యమామ.

"ఇంట్లో ఎవరూ లేరు, మంచికైనా చెడుకైనా" అన్నాడు నర్సయ్య, అదుర్దాగా. "నువ్వు వెళ్లు. నే నిక్కడ వుంటా" అన్నాడు జోగయ్య. నర్సయ్యకు తెలుసు—

తన తండ్రి పనిమధ్యలో విడిచిపెట్టి రాడని. ఇష్టంలేకపోయినా, ఏమీ అనలేక తన తండ్రిని చేనుగట్టుమీద విడిచిపెట్టి, యింటికి వెళ్లాడు నర్సయ్య.

కాకులు కూస్తుంటే కబురు వచ్చింది-- జోగయ్య మామను తక్షణం రమ్మని. అతనికి తెలుసు తనకూ, తన భార్యకూ ఋణానుబంధం తీరిపోతూ వుందని. కాని చేను యింకా వొకకొస తడవాల్సివుంది. చూస్తూచూస్తూ పని మధ్యన వెళ్లలేక పోయాడు.

నీళ్లు నెమ్మదిగా పారుతూ సెర్రిల్ని, బొరియల్ని నింపుతూ ఆ కొసని తడిపింది. అప్పుడు జోగయ్యమామ గబగబా యింటికి బయలుదేరాడు భార్యని చూద్దామని.

అతను వెళ్లేటప్పటికి ఆమె అవసాన దశలో వుంది. ఆ అవస్థలో వుండికూడా ఇంటి సంగతులే మాట్లాడుతూ వుంది. "మూడోవాడికి ముకివెయ్యమంటే నా మాట విన్నారుకాదు" అని భర్తని నిష్ఠూరాలాడింది. రెండోకోడలు తన మాట వింటం లేదని అక్కసు వెళ్లబోసుకుంది. "ఎలుకలు పుట్లన్ని కొట్టిపోస్తున్నయ్. కాస్త మట్టి రాయించమంటే రాయించలేకపోతిరి" అన్నది. "బట్టలకి బాగాగంజి పెట్టడంలే"దని చాకలిదానిమీద కేకలువేసింది. తనే మజ్జిగ చెయ్యాలని కవ్వంకోసం లేవబోయింది. "పెద్దకోడలికి వెన్న తియ్యటమే చేతగాదు. సగానికి సగం మజ్జిగలోనే విడిచిపెడుతుంది" అని చెప్పింది. తాను గుటుక్కుమన్న తర్వాత యీకాపరం ఏ మవుతుందో అని వేదనపడ్డది.

"ఆమాటలన్నీ ఇప్పుడెందుకు? ఒక్క క్షణం నిశ్చలంగా వుండు" అన్నాడు జోగయ్యమామ.

కాని ఆమెనోటికి మూత పడలేదు. ఆఖరినిమిషంవరకూ మాట్లాడుతూనే వుంది. అందరికీ ఏదో వకటి చెపుతూనే వుంది. పనులు పురమాయిస్తూనేవుంది. చివరికి 'అబ్బో అబ్బో' అంటూ బాధ పడుతూ జోగయ్యమామచెయ్యి గట్టిగా పట్టుకుంది. అతని చెయ్యి పట్టుకునే యీ లోకాన్ని విడిచింది.

* * *

సరిగా యిప్పటికి నెల, ఆమె యీ లోకాన్ని విడిచి. భార్యజబ్బు లెక్కచెయ్యకుండా, ప్రాణాలను లెక్కచెయ్యకుండా అంత కష్టపడి నీరుపెట్టిన చేను మూస తిరిగింది. కూలివాళ్లు కలుపు తీస్తున్నారు. హుషారుగా పాడుతున్నారు, ఆడవాళ్లూ మొగవాళ్లూ కలిసి.

జోగయ్యమామ అట్లాగే సేరేడు చెట్టు నానుకుని కూర్చున్నాడు. అతని మనస్సు ఇదివరకంత స్థిరంగా వుండటం లేదు. తన భార్య చనిపోయేటప్పుడు పడిన తాపత్రియం అతను మరిచిపోలేక పోతున్నాడు. ఆమెకు తెలుసు తను పోతున్నానని. కాని ఒక్కనిద్రిపోయి లేచే దానికి మల్లే మాట్లాడింది. పోయేదానికి తన కెందు కివన్నీ? ఒకళ్లకు మాత్రం ఎందుకు? అంతా పోయేవాళ్లే. అయితే యిక కావలసిం దెవరికి? పొలంలోనుంచి పాట వినిపించింది.

ఒక్కసారి కన్ను తెరచి తన పొలం అంతా పారజూశాడు జోగయ్యమామ.

ఆ మధ్య తన మనమడు తనతో పొలం వచ్చాడు. "తాతయ్యా, మన పొలం ఏదీ?" అని అడిగాడు. "నీకు కనబడుతున్నదంతా మందేరా" అన్నాడు. వందయెకరాల ఏక కండ్రిక. తన మనమడికి అవతలితట్టు కనపడకుండా సముద్రంలా వున్న పొలం చూపిస్తూ "ఇదంతా మందేరా" అన్నప్పుడు అతని మనస్సు ఆనందంతో నిండింది. మొట్టమొదట తా నీవూరు ఎడ్లబేరానికి వచ్చాడు. తా నెవరికయితే ఎడ్లని అమ్మాడో, ఆ ఆసామీకే ఇల్లరికపుటల్లుడయాడు. తన నడవడిక చూచి, తన వ్యవహారికజ్ఞానంచూచి ఆ ఆసామీ మోజుపడి కూతుర్ని తన కిచ్చి చేసి ఇంట్లో పెట్టుకున్నాడు. ఆనాటినుంచీ వళ్లు దాచుకోకుండా తాను పనిచేశాడు. తను అడుగు పెట్టినపుడు తన మామకి అయిదెకరాలు వుండేది. తన చెమటతో తడిపి, పండించి పది సంవత్సరాలు తిరిగొచ్చేటప్పటికి ఆ అయిదెకరాలకీ మరొక అయిదెకరాలు జతజేశాడు. తన మామకి తనమీద గురి ఏర్పడ్డది. ఆయన పోతూపోతూ "నిన్ను దగ్గరికి తీసినందుకు నాపరువు నిల్పావు" అన్నాడు. తను పడిన కష్టమంతా ఆ ఒక్కమాటతోనే తీరిపోయింది. తన మామ చనిపోయినప్పటికి వందెకరాలు చేశాడు. కాని వృద్ధిచేస్తున్నపుడు తనకు కలిగిన ఆనందం యిప్పుడు కల్గటంలేదు. రోజూ పొలం రావడం, పొలాన్నంతా ఒక్కసారి చూచుకోవడం, పాలేళ్లను గదమాయించడం— ఇంతవరకే మిగిలింది. అంటే ఆ ఆనందం పోయి అలవాటే మిగిలింది.

జోగయ్యమామ నేరేడుచెట్టు కానుకుని అట్లాగే కూర్చున్నాడు. పొద్దు నెత్తిమీదికొచ్చింది. నేరేడుచెట్టు ఆకుల్లోంచి ఎండ జోగయ్యమామముఖంమీద పడ్డది. ఆ వేడికి ఆయన నెమ్మదిగా కన్నుతెరచి చూశాడు. పొలంలో కూలీలు లేరు. సర్దుకుని గబుక్కున లేవబోయాడు. కదిలాడు. ఎదురుగా చెట్లకు కట్టిన మూటలు విప్పుకుని కూలీలు బువ్వ తినటం చూశాడు. కొంతమంది అన్నంముద్దలు మింగుతున్నారు. కొందరు బట్టలకి చేతులు తుడుచుకొంటున్నారు. కొందరు తలగుడ్డలు విప్పుకొని గట్టుమీద పరుచుకొని పడుకున్నారు.

'లేవండరా' అని కేకలేశాడు జోగయ్యమామ. "ఇంత వయస్సులో దొరకెంత యావ" అని నవ్వుకున్నారు అంతా. "ఇప్పుడేగా దొరా, కూటికొచ్చింది" అన్నాడొకడు కేరింతలు కొడుతూ. ఒక్కొక్కళ్లూ మళ్లీ చేలోకి దిగారు.

జోగయ్యమామ ఒక్కసారి పూరి వైపు చూశాడు. మధ్యాహ్నంపూట ఆ నేరేడుచెట్టుకింద అన్నం తింటం జోగయ్యమామకి అలవాటు. యిప్పటికీ ఆయన మనుమరాలు రోజూ అన్నం తెచ్చిపెడుతుంది. దూరంగా అన్నంగిన్నె నెత్తిమీద పెట్టుకొని మనమరాలు రావటం చూశాడు. మబ్బు బాగా వేసింది. వర్షం వస్తుందేమో. తాను తడిస్తే ఫరవాలేదు కాని, తన మనమరాలు తడుస్తుందేమో! వర్షం ఎక్కువైతే పనసచెట్టుక్రింది గుడిశలోకి వెళ్లాలి. ఎప్పటి గుడిశ. మొట్టమొదట

తాను చేసుకొన్నప్పుడు వేసిన గుడిశ. ఎండకు ఎండుతూ, వానకు తడుస్తూ అట్లాగే నిలబడివుంది.

"తాతా, అన్నం తెచ్చా" అని మనమరాలు గిన్నె కిందబెట్టి గిన్నెకు కట్టిన గుడ్డ విప్పింది. ఒకపక్క గోంగూర పచ్చడి, నల్లగా నిగనిగలాడుతూ వుంది. ఒక పక్క ఆవకాయపచ్చడి, ఎర్రగా నెత్తురుముద్దలా వుంది. ఆ రెంటిమధ్యా తెల్లటి అన్నం.

"నువ్వు తింటూవుండు తాతయ్యా, నేను చేలోకి వెళ్ళివస్తా" అంటూ రివ్వున పరిగెత్తింది మనమరాలు. జోగయ్య మామ నెమ్మదిగా లేచాడు. బట్టలు దులుపుకుని తలకు చుట్టుకొని కర్రపోటు వేసుకుంటూ గట్టు దిగాడు. కాలవలో నీళ్లు దోసెడు తీసికొని నోట్లో పోసుకొని పుక్కిలించి వూశాడు. నెమ్మదిగా మళ్లీ నేరేడుచెట్టుదగ్గర కొచ్చి కూర్చున్నాడు. కర్ర పక్కన పెట్టుకొని అన్నంగిన్నె ముందుకు లాక్కున్నాడు. ఆవకాయ పచ్చడి వేలితో తీసుకొని నాలిక్కి రాసుకున్నాడు. ఒక్క లొట్ట వేశాడు. ధ్వని కలగలేదు. అలవాటుప్రకారం ఆవకాయ పచ్చడి నాలిక్కి రాసుకొని, అలవాటు ప్రకారం లొట్ట వేశా ననుకున్నాడు బాగుం దనుకొని.

* * * *

చేలో కూలీవాళ్లు కలుపు తీస్తున్నారు. జోగయ్యమామ మనమరాలు కాసేపు గట్టుమీద నుంచుని చూసింది. కూలివాళ్లు 'చిన్న దొరసాని వచ్చిం'దని పరియాసకాలాడారు. పరికిణీ కాళ్లకు తగలకుండా చేత్తో పట్టుకొని చేనుగట్టుమీదుగా తాతదగ్గరకు పరిగెత్తడం మొదలుపెట్టింది. దారిలో తండ్రి కనిపించాడు.

"జెరీపరికిణీ వేసుకొచ్చావేం అమ్మా! చేలోకి ? బురద కాదూ ?" అని అడిగాడు.

"తాత వేసుకురమ్మన్నాడు నాన్నా. యీపరికిణీ కట్టుకొన్తే చూడా లన్నాడు" అన్నది.

"చూశాడా?"

"మరిచిపోయాడు"

"తాత అన్నం తిన్నాడా అమ్మా?"

"పెట్టొచ్చాను."

"ఎక్కడున్నాడు ?"

"అదేం, ఆ నేరేడుచెట్టుకిందే."

ఇద్దరూ నేరేడుచెట్టుదగ్గరకు బయలుదేరారు. ఆకాశం మబ్బేసింది. వర్ష మొస్తుందేమో అనుకున్నాడు నర్సయ్య. అరవయి ఏళ్లు నిండినా తండ్రి పొలం రావటం నర్సయ్యకి యిష్టంలేదు. పొలానికి అన్నం తెప్పించుకోవటం అసలు ఇష్టంలేదు. అతను వూళ్లో పంచాయితీబోర్డుప్రెసిడెంటు. కొంచెం పరువుగా బ్రతకా లంటాడు. కాని ఏం లాభం? తండ్రి తనమాట వినడు చేను గట్టుమీద అన్నం తింటే పరువు పోతుందా అంటాడు.

ఎక్కడో ఉరిమింది. మెరుపు కూడాను. చిటపట చినుకులు పడుతున్నాయి. కూతురు తన చిట్టినాలుక చాచి చినుకులు రుచిచూస్తోంది. నడుస్తూ

గబగబా నర్సయ్య నేరేడుచెట్టుదగ్గరకు నడిచాడు. చెట్టు నానుకుని కూర్చుని వున్నాడు తండ్రి.

చేతికర్రా, తలపాగా ఒకపక్కన పడి వున్నాయి. కళ్లు మూసుకుని ఏమిటి ఆలోచిస్తున్నాడు? అవసరం వున్నా లేకపోయినా ఆలోచించడం తప్పదు. గుప్పిడి ముక్కుకి ఆనించుకుని ఏదో వాసన చూస్తున్నాడు. గుప్పెట్లో ఏముంది? పువ్వా? కాదు. పొగాకా? కాదు. మన్ను...... పట్టి మన్ను!—నేరేడుచెట్టుకింది రేగడి మన్ను.

'అయ్యా, అయ్యా' అని పిలిచాడు కొడుకు.—మళ్లా పిలిచాడు.

'అబ్బాయ్'—నీరసంగా తండ్రిమాట. గుప్పిడి సడలి చెయ్యి కిందికి వాలి పోయింది. మన్ను ధారగా పడింది. మట్టి మట్టిలో కలిసింది.

'అయ్యా, అయ్యా!'

అయ్య మరి పలకలేదు.






శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య

అక్టోబరుమాసములో అనేకమహాసభలు జరిగినవి. కాని వాటి అన్నిటిలో పేర్కొనదగినది బ్రిటిష్ అధినివేశరాజ్యప్రధానుల సభ. ఇందు బ్రిటన్, కనడా, ఆస్ట్రేలియా, న్యూజీలండు, దక్షిణఆఫ్రికా, ఇండియా, పాకిస్థాన్, సింహళప్రధానులో, వారి ప్రతినిధులో పాల్గొనిరి. ప్రపంచములోని ౨౦౦ కోట్ల ప్రజలలో సుమారు ౬౦ కోట్ల ప్రజలతరఫున వీరు మాట్లాడగలిగినవారగుటచేత ఈ సమావేశమునకు ఒక ప్రాధాన్యము కలిగినది. వీరందరు కలిసి ఒక తీర్మానమునకు వచ్చినయెడల వీరిని ప్రతిఘటించుట కెవరికిని సాధ్యము కాదుగదా? ఈ సమావేశము ఎందుకు జరిగినది? ఇందులో ఏవిషయములనుగురించి చర్చలు జరిగెను? వీటి ఫలితము లెట్టివి? అను విషయములను గురించి సంక్షిప్తముగనైన తెలిసికొనుట అత్యావశ్యకము.

## విప్లవయుగము

ప్రపంచమందంతట ప్రస్తుతము విప్లవపరిస్థితులు ఏర్పడియున్నమాట అందరికి తెలిసినదే. విప్లవ మనగా మహత్తరమైన మార్పును తెచ్చుటకు చేయబడు మహాప్రయత్నము. సామాన్యమైన మార్పుల నుద్దేశించు ఉద్యమమునకు విప్లవ మన్న పేరు ఎవరును పెట్టరు. ఈ కాలములో అన్నిదేశములందును విపరీతములైనట్టియు, అసాధారణములైనట్టియు మార్పులు తెచ్చుటకే ప్రయత్నములు జరుగుచున్నవి. ఇదిగాక, ఈ ప్రయత్నములుకూడ సామాన్యములైనవి కావు. ఇవికూడ అసాధారణములని చెప్పదగియున్నవి. ఈ రెండును కలిసియుండుటచేత— ఉద్దేశము మహత్తరము, ప్రయత్నముకూడ మహత్తరము—ప్రస్తుతకాలము విప్లవయుగమని చెప్పుటకు తగియున్నది.

## ఆధునికయుగలక్షణము

ఇప్పటి విప్లవమునకు ఒక ప్రధానోద్దేశము, ఒక విశిష్టమైన లక్ష్యము ఉన్నవి. గడచిన నాలుగువందల సంవత్సరముల కృషిఫలితముగ ప్రకృతిశాస్త్రపరిజ్ఞానము విస్తార మభివృద్ధిగాంచినది. ఈ జ్ఞానము మూలమున భూమినుండి పండించుటకు వీలైన ఆహారపదార్థములు, గనులనుండి త్రవ్వదగిన ఖనిజములు, పరిశ్రమలనుండి తయారుచేయదగిన వస్త్రాదివస్తుసముదాయము, రైళ్లు, బస్సులు, విమానములు మొదలైన ప్రయాణసౌకర్యములు విపరీతముగ వృద్ధిగాంచినవి. ఇప్పటికంటెనుకూడ ఎక్కువగ వీటినన్నిటిని ఉత్పత్తిచేయుటకు అవకాశము లేర్పడినవి. మానవజీవితమున ఐహికసుఖముల ననుభవించుటకు ఏయే పదార్థము లవసరములో వాని నన్నిటిని అపరిమితముగ ఉత్పత్తిచేయుటకు మనుష్యునికి శక్తి లభించియున్నది. ప్రాచీన, మధ్యయుగములకును, ఆధునికయుగమునకును దీనినిబట్టియే భేదము కలిగినది.

కాని ఈవిధముగ ఉత్పత్తిచేయదగిన వస్తుసముదాయము అభివృద్ధిగాంచుచుండినను దానిని అనుభవించుటకు అందరికీ సమానమైన అవకాశములు ఇప్పటికికూడ లభించియుండలేదు. మహదైశ్వర్యము ననుభవించు దేశములని పేరుగాంచిన ఇంగ్లండు, అమెరికాలలో కూడ లక్షలకొలది నిరుపేదలున్నారు. ఏషియా,

ఆఫ్రికాఖండపు దేశములలో ప్రజలందరు దారిద్ర్య మందు మునిగియున్నారు. వస్తుసముదాయమును ఎంత ఎక్కువగ ఉత్పత్తిచేయుటకు అవకాశ మున్నదో అంత ఎక్కువగ ఈదేశములో ఉత్పత్తి జరుగుటలేదు. ఉత్పత్తి ఎక్కువగ జరుగుచుండినను దాని ఫలితమును ఏ కొద్దిమందోమాత్రమే అనుభవించుచున్నారుగాని జనసామాన్యమంతయు అనుభవించుట లేదు.

## విప్లవకారణము

ఇప్పుడు జరుగుచుండు విప్లవమునకంతకు ఈ వైపరీత్యమే ప్రధానకారణము. ప్రకృతిశాస్త్రజ్ఞానము మూలముననూ, యంత్రములమూలమునను ఎంత ఎక్కువగ వస్తుజాలమును వృద్ధిచేయుటకు వీలున్నదో అంత ఎక్కువగ వాటిని తయారుచేసి, అట్లు తయారైన వానిని ఏకొద్దిమందో అనుభవించుటకు బదులు ప్రజాసామాన్యమంతయు అనుభవించునట్లు చేయుటయే ప్రస్తుతవిప్లవముయొక్క ప్రధానోద్దేశము. అందుచేతనే ఈ యుగమును యంత్రయుగ మనియు, ప్రకృతిశాస్త్రయుగ మనియు, ప్రముఖుల యుగము గాక సామాన్య ప్రజల యుగ మనియు అనేకులు చెప్పుచుండుట.

## విప్లవ మవసరమా ?

ఇట్టి విప్లవము జరగవలసియున్నదని అందరును అంగీకరించుచునే ఉన్నారని చెప్పవచ్చును. అంగీకరించనివారు లేక పోలేదు. అంగీకరించనివారిలో మహాత్మాగాంధీగారు ఒకరు. నిరాడంబరజీవితమే వారి ఆదర్శము. మన మనుభవించు వస్తువుల సంఖ్య మితముగ నుండవలె ననియు, వానిని యంత్రసహాయమున గాక మన శరీరకష్టసహాయముననే ఉత్పత్తిచేసికొనవలె ననియు, ఎవరికి కావలసిన వస్తువులను వారే సొంతముగ తయారుచేసికొనవలె ననియు వారు బోధించిరి. కొందరు వారి ఉపదేశమే ఉత్తమమైనదని చెప్పెదరు. కాని నూటికి తొంభైతొమ్మిదిమంది ఆ తత్త్వమును విశ్వసించుటలేదు. విశ్వసించునట్లు పైకి కనుపించినను దాని ననుసరించ సిద్ధపడువారు కారు. కనుక ఎవరో కొందరుతప్ప తక్కిన వారందరును—అన్ని దేశములలో—పైజెప్పిన విప్లవమును కాంక్షించువారే.

## విప్లవ సాధనము

కాని ఈ విప్లవమును తెచ్చుటలో ఒక గొప్ప అభిప్రాయభేద మేర్పడియున్నది. ఈ అభిప్రాయభేదమే ప్రస్తుతము మన మెదుర్కొనుచుండు అశాంతి కంతకు కారణము. కొందరి అభిప్రాయములో ఈ విప్లవమును శాంతియుతముగను, సామరస్యముమీదను సాధించవలసినదేగాని రక్తపాత, దౌర్జన్యముల మూలమున సాధించరాదు. దౌర్జన్యసాధనము ధర్మవిరుద్ధము. తక్కినవారి అభిప్రాయములో దౌర్జన్యము, రక్తపాతము లేక ఏ విప్లవముగాని విజయవంతము కాజాలదు. సాధించదగిన ఉద్దేశము ప్రశంసనీయమైనప్పుడు దానిని సాధించుటకు మన ముపయోగించు సాధనవిషయమై ధర్మాధర్మవిచక్షణము అనవసరము. ఉద్దేశము నెరవేరుటకు ఏసాధనము—దౌర్జన్యమైనను సరే, రక్తపాతమైనను సరే—ఉపయోగించునో అదియే ధర్మముతో కూడిన సాధనము. విప్లవోద్దేశమును దౌర్జన్యముద్వారా సాధించుటయా, శాంతిమార్గమున సాధించుటయా, అన్న కారణముచేతనే ప్రపంచమందు ప్రస్తుతము రెండు రాజకీయవిధానములు, రెండు రాజకీయతత్త్వములు పరస్పరము పెనగులాడుచున్నవి. ఈ పెనగులాట ప్రపంచశాంతికి భంగకర మగుటయే కాక మూడవ ప్రపంచయుద్ధమునకుకూడ దారితీయు చున్నది.

ప్రజాస్వామ్యసిద్ధాంతము ననుసరించువారిది రక్తపాతములేని సామరస్యవిధానము. నిరంకుశత్వసిద్ధాంతము ననుసరించువారిది రక్తపాతముతో కూడిన దౌర్జన్యవిధానము. కాని ఇట్టి భేద ముండుటచేత ప్రజాస్వామ్యసిద్ధాంతము ననుసరించువారు యుద్ధముచేయుటకు సిద్ధపడినవారు కారని అనుకోరాదు. వారుకూడ యుద్ధముచేయ సిద్ధులైనవారే. కాని సామరస్యసాధనము నిష్ఫలమైనప్పుడును, దౌర్జన్యసాధనమును ఉపయోగించువారు దానిని ఉపయోగించుటకు సన్నాహము గావించునప్పుడును వారు యుద్ధములోనికి దిగుచున్నారు. దౌర్జన్య మొక్కటియే సాధన మని ఒక పక్షమువారును, తక్కిన సాధనము లన్నియు నిష్ఫలము లైనప్పుడే దౌర్జన్యము సాధన మని అంగీకరించవలసియున్న దని రెండవపక్షమువారును వాదించుచున్నారు.

## రెండు పక్షములు

ఈ తత్త్వవిభేదముల కారణమున ప్రస్తుతము ప్రపంచమందు రెండు రాజకీయపక్షములు బయలుదేరియున్నవి. ఒకపక్షమున రష్యావా రున్నారు. వారిది కమ్యూనిస్టుతత్త్వము. వారు దౌర్జన్యమును ప్రతిపాదించువారు. రెండవపక్షమున ఇంగ్లండు అమెరికా కనడా

ఆస్ట్రేలియా హాలెండు బెల్జియం మొదలైన ప్రజాస్వామ్యము గల రాజ్యములు ఉన్నవి. ఎంతప్రయత్నము చేసినను ఈ రెండుపక్షములమధ్య రాజీ కుదరక పోవుటయే కాక రోజురోజుకు వైషమ్యము విపరీతమగుచున్నది.

## ఐక్యరాజ్యసమితియొక్క శక్తిహీనత

ఇట్టి వైషమ్యములు వృద్ధిగాంచినపుడు వీని మూలమున యుద్ధము రాకుండజేయుటకును, వివాదములను రాజీమూలముగ పరిష్కరించుటకును మూడు సంవత్సరములక్రిందట ఐక్యరాజ్యసమితి స్థాపింపబడెను. అక్టోబరు ౨౪ వ తేదీన సమితియొక్క వర్ధంతిని అన్ని దేశములలో జరిపిరి. అందరును దానినిగురించి అనేకప్రశంసావాక్యములను చెప్పిరి. కాని శాంతిని స్థాపించుటకు కావలసిన శక్తిసామర్థ్యములు దానికింకను లేవనియు, అట్టివి త్వరలో దానికి లభించునన్న సూచన లేవియు కనుపించుట లేదనియు, వారివారి విభేదములను ప్రచారముచేసికొనుటకే అగ్రరాజ్యములవారు సమితిసభలను ఉపయోగించుకొనుచున్నారనియు, అగ్రరాజ్యపరిపాలకులలో హృదయపరివర్తనము కలిగినగాని సమితిద్వారా శాంతిసంస్థాపన జరుగజాలదనియు వక్తలనేకులు తెలియపరచిరి. యుద్ధమునకు సన్నాహములు జరుగుచున్నప్పుడును వానిని ఆపుటకుగాని, యుద్ధము రాకుండజేయుటకుగాని సమితికి యోగ్యత లేనట్లు స్పష్టమైనప్పుడును, ప్రపంచములోని రాజ్యములు చేయవలసిన పని ఎట్టిది?

సాధనాంతరముద్వారా యుద్ధము రాకుండజేయుటకును, యుద్ధము సంభవించినయెడల అందు విజయము సంపాదించుటకును తక్కిన రాజ్యములు ప్రయత్నించుట స్వభావము. అందుచేతనే బ్రిటిష్ అధినివేశరాజ్యముల ప్రధానులు లండనులో అక్టోబరు మాసమున సమావేశమగుట సంభవించినది.

## బ్రిటిష్ కామన్‌వెల్తు ప్రధానుల సమావేశము

ప్రస్తుతము ఇండియా ఈ అధినివేశరాజ్యములలో ఒక్కటిగ నున్నది. ఇంగ్లండును పాలించు జార్జి ప్రభువు చట్టరీత్యా ఇండియాకుకూడ ప్రభువుగ ఉండుటయే దీనికి చిహ్నము. ఒక్కొక్క అధినివేశరాజ్యము (డొమినియన్ : Dominion) సర్వస్వతంత్రము కలదై తన వ్యవహారముల నన్నిటిని జరపుకొను హక్కు కలిగియున్నను ఇంగ్లండు రాజునే విధిగ తమ రాజుగ అంగీకరించుటచేత ఇవన్నియు ప్రస్తుతము ఒకే రాజకీయగణమునకు చెందియున్నవి. ఆ గణమునకే ఇప్పటివరకు బ్రిటిష్ కామన్‌వెల్తు అను పేరు వ్యవహారములో ఉన్నది.

## ఈ సమావేశపు విశిష్టత

లండనులో అక్టోబరుమాసమున సమావేశమైన సభకు ఒక విశిష్టత కలిగినది. ఇదివరకు అధినివేశ మను హోదా బ్రిటిష్‌వారియొక్కయు, ఇతర శ్వేతజాతులవారియొక్కయు సంతతివారు నివసించుచుండు కనడా, ఆస్ట్రేలియా, న్యూజీలెండు, దక్షిణఆఫ్రికాలకు మాత్రమే ఉండెడిది. ప్రస్తుతము అధినివేశస్వాతంత్ర్యము ఇండియా పాకిస్థాన్ సింహళములకు కూడ లభించినది. శ్వేతజాతులవారు కాని భారతీయులు మొదలైనవారి దేశముల ప్రధానులు అధినివేశ హోదాతో సమావేశమునందు పాల్గొనుట కిదియే మొదటి పర్యాయము. వర్ణవివక్షను పాటింపక శ్వేతజాతి అధినివేశముల ప్రధానులును, వర్ణాంతరఅధినివేశముల ప్రధానులును కలిసి అనేకవిషయములనుగురించి సమానప్రతిపత్తితో, ఈ సమావేశమందు సంప్రతించిరి. దీనినిగురించి గుర్తించదగిన ప్రధానవిషయ మిదియే.

## సభ్యుల ఏకోద్దేశము

ఇందు సమావేశమైన రాజ్యము లన్నియు ప్రజాస్వామ్యసిద్ధాంతములందును, ఈ సిద్ధాంతమును ఆధారముజేసుకొనిన సోషలిజం (Democratic Socilaism) సిద్ధాంతవిధానములందును విశ్వాసము కలవి. కమ్యూనిష్టుసిద్ధాంతములు వీటికి ప్రస్తుతము నచ్చినవి కావు. దౌర్జన్యముద్వారా కమ్యూనిష్టువిధానమును ప్రపంచమందంతట వ్యాపింపజేయుటకు ప్రస్తుతము అంతర్జాతీయకమ్యూనిష్టుపార్టీవారు రష్యానాయకత్వమున జరపుచుండు ప్రయత్నముల నన్నిటిని ఏవిధముగనైన అణచివేయుటకు ఈ రాజ్యముల ప్రధానులు సమకట్టినవారు.

## ఫలితములు

*ఈ సమావేశములో జరిగిన సంప్రతింపుల ఫలిత*ముగ కొన్ని విషయములనుగురించి ప్రధానులందరు ఒకే అభిప్రాయమునకు వచ్చినట్లు తెలియుచున్నది. (౧) ప్రపంచశాంతి ప్రజాస్వామ్యసిద్ధాంతముద్వారా

స్థాపించవలసియున్నది. కమ్యూనిస్టుసిద్ధాంతముద్వారా స్థాపించుటకు చేయబడు ప్రయత్నముల నన్నిటిని ప్రతిఘటించుట అవసరము. (౨) కమ్యూనిస్టువిధానమును యుద్ధముద్వారా అణచుటకు ప్రయత్నించుటకంటె ఆర్థికపునర్నిర్మాణము గావించి, కార్మికులు కర్షకులు మొదలగు సామాన్యప్రజల స్థితిగతులను చక్కబరచుటద్వారా ఎదుర్కొనుటయే ఉత్తమ మార్గము. అందుచేత అధినివేశములందుమాత్రమే కాక, బ్రిటనుకు లోబడియున్న వలసరాష్ట్రములన్నిటియందును, ఇతరసామ్రాజ్యముల పాలనలో ఉండు వలసరాష్ట్రములందును (Colonies and Dependencies) ఇప్పటి పరిపాలనవిధానము మారుటకును సోషలిస్టు సిద్ధాంతానుసారముగ ఆర్థికసంస్కరణములు జరుగుటకును వెంటనే ప్రయత్నించవలెను. సామాన్య ప్రజల స్థితిగతులు ప్రజాస్వామ్యవిధానముద్వారా చక్కబడు నను నమ్మకము సిద్ధాంతరీత్యాగాక ఆచరణద్వారా ఋజువైనప్పుడే సామాన్యజనులకు కమ్యూనిజంపట్ల గల వ్యామోహము తగ్గును. శుష్కవాదోపవాదములవలన ఎట్టి ప్రయోజనము లేదు. (3) కమ్యూనిజమును రష్యాను ఎదుర్కొనుటకు బ్రిటక్‌వారు పశ్చిమయూరపుదేశములతో ఏర్పరచుకొన్న సమాఖ్య యుక్తమైన దనియు, అట్టి సమాఖ్యకును కామన్‌వెల్తుగణమునకును ఎట్టి వైరుధ్యము లే దనియు, ఆ సమాఖ్య మరింత బలపడుట ప్రపంచశాంతికి సాధన మగు ననియు సమావేశమైన ప్రధానులు అభిప్రాయపడిరి.

ముఖ్యమైన విషయములనుగురించి వీరు ఏకాభిప్రాయమునకు రాగలుగుట ప్రశంసింపదగిన విషయమే. ౬౦ కోట్ల జనులను పాలించువారు ఏకాభిప్రాయముతో ప్రపంచశాంతికై పాటుబడ సిద్ధమైనయెడల ప్రపంచశాంతికి భంగము ఎన్నటికిని కలుగజాలదు. కాని ఇప్పటి అధినివేశరాజ్యము లన్నియు కలిసి శాశ్వతముగ కామన్వెల్తుగణములో సభ్యత్వము వహించియుండగలవా అన్న విషయములో అనేక సందేహములు ఇప్పటికే పుట్టియున్నవి. ఇవన్నియు కలిసియుండుట మానవకల్యాణసాధనమే. కాని ఇవి కలిసియుండగలవా?

ఇట్టి సందేహము భారతీయ లేఖకులలో ఇదివరకే పుట్టియున్నది. దీనినిగురించి వాదప్రతివాదములు జరుగుచున్నవి. రాజ్యాంగపరిషత్తువారు తీర్మానించవలసిన ప్రధానవిషయములలో ఇది ఒకటి.

## కామన్‌వెల్తు శాశ్వతముగ నిలబడునా?

ఇట్టి సందేహము కలుగుటకు కారణము లేక పోలేదు. అధినివేశరాజ్యములన్నియు ఇదివరకు ఇంగ్లండురాజును తమ రాజుగ అంగీకరించియున్నవి. కాని ప్రస్తుతము రాజ్యాంగపరిషత్తువారు తయారు చేయుచుండు రాజ్యాంగ ప్రణాళికలో ఇండియా సర్వస్వామ్యము గల స్వతంత్ర ప్రజారాజ్య మని చెప్పబడి యున్నది. ఇంగ్లీషులో దీనికి రిపబ్లిక్ (Republic) అని పేరు. రిపబ్లిక్ అనగా రాజు లేని ప్రజారాజ్య మన్నమాట. ఈ రాజ్యాంగ ప్రణాళికను పరిషత్తువారు ఆమోదించుపక్షమున ఇండియాకు ఇకమీదట రాజు ఉండడు; ఉండ కూడదు. అట్టి సందర్భములో చట్టరీత్యా ఇంగ్లండునకును, ఇండియాకును ఎట్టి అనుబంధము ఉండజాలదు. చట్టరీత్యా రాజురూపమైన అనుబంధము లేని రాజ్యములు కామన్‌వెల్తుగణములో కలిసియుండుటకు వీలగునా? మంగళసూత్రమో, ఉంగరమో, మరేదో ఒక బాహ్యచిహ్నమో లేక భార్యాభర్తలనుపేర స్త్రీపురుషులు వ్యవహరించదగియుందురా అన్న విషయము వంటిదే ఈ విషయముకూడ. ఒకేరాజు లేకపోయినను ఇంగ్లండు ఇండియాలు చట్టరీత్యా ఒకే సమాఖ్యలో చేరియుండుటకు వీలగు నని తీర్మానించినపక్షమునసే ఈ రెండు దేశములకును తక్కిన అధినివేశములకును ప్రస్తుత మేర్పడిన సంబంధము నిలిచియుండును. ఇట్టిది జరగనియెడల ఈ సంబంధము తెగిపోవును.

## ఇండియాకు సభ్యత్వము లాభకరమా?

ఇంతకంటె ప్రధానములైన అంశములు మరి కొన్ని ఉన్నవి. ఇంగ్లండుతో రాజకీయమైన సంబంధము ఇండియాకు అవసరమా? లాభకారియా, నష్టకారియా? ఆలోచించదగినవిషయ మిదియే. సంబంధము అవసర మని స్పష్టపడినయెడల దానిని దృఢపరచుటకు ఏదియో ఒక బాహ్యచిహ్నమును కల్పించుకొనుట కష్టసాధ్యము కాదు.

### లాభము

కామన్‌వెల్తుతో కొంతకాలమువరకైనను సంబంధము కలిగియుండుట ఇండియాకు అవసర మనియు, లాభకారి అనియు చెప్పుటకు కొన్ని కారణములు కలవు. (౧) ఇండియాకు స్వరాజ్యము లభించినను దానిని నిలబెట్టుకొనుటకు కావలసిన సైన్య

సామగ్రి, నౌకాబలము, విమానబలము ఇంకను లేదు. ఈ బలమునంతను సంపాదించుటకు కొంతకాలము పట్టును. ఈమధ్యకాలములో శత్రువు లెవరైన దేశము పైకి వచ్చి, జయించుటకు ప్రయత్నించినయెడల వారి నెదుర్కొనుటకు ఇండియా అగ్రరాజ్యముల సహాయమును కోరవలసియున్నది. (౨) అనేకసంవత్సరముల నుండి ఇంగ్లండుతో ఇండియాకు ఒక విధమైన అనుబంధ మేర్పడియున్నందున దానియొక్క సహాయమును అపేక్షించుటమే మంచిది. రషియా, అమెరికాలను గురించి భారతీయులకు ఎక్కువ అనుభవము లేదు. ఎరిగినవారితో సంబంధము నేర్పరచుకొనుట శ్రేయస్కరము. (౩) ఈ కాలములో పారిశ్రామికముగ దేశము వృద్ధిగాంచినగాని సైనికసామగ్రిని సమకూర్చుకొనుటకు వీలులేదు. పారిశ్రామికముగగూడ ఇండియా మిక్కిలి వెనుకబడియున్నది. దానికి కావలసిన యంత్రాదులు, యంత్రములను నడుపగల నిపుణులు దేశాంతరములందుండి రావలసియున్నది. ఈ విషయములోకూడ ఇంగ్లండుతోడి సంబంధము ఇండియాకు లాభకారి. (౪) ఇట్టి సహాయము రషియా చేయదగిన స్థితిలో లేదు. పారిశ్రామికముగ ఆ దేశము ఇంగ్లండుకంటె వెనుకబడియున్నది. ఇతరదేశములకు యంత్రాదిపరికరములను పంపు స్థితిలో రషియా లేదు. కనక ఈ కారణములచేత ఇండియా ఇంగ్లండుతో రాజకీయసంబంధము నేర్పరచుకొనుట అవసరము. (౫) ఇంగ్లండు అమెరికాలు మిత్రులై ఉండు కారణమున అమెరికాసహాయముకూడ ఇండియాకు లభించుటకు ఈ సంబంధము ఉపయోగపడును. (౬) ఇంగ్లండు అమెరికాలను కాదని స్వతంత్రముగ విదేశ రాజ్యాంగనీతి నొకదాని ననుసరించి ఆగ్నేయఏషియాలోని బర్మా సయాం ఇండోచైనా ఇండోనీషియా మొదలగు దేశముల నన్నిటిని కలిపి అట్టి సమాఖ్యకు నాయకత్వమును వహించుటయే ఇండియాకు గౌరవము కాని ఇంగ్లండునకు అనుచారియై ఉండుట గౌరవభంగకర మను వాద మొకటి ఉన్నది. కాని ఇట్టి నాయకత్వము ప్రస్తుతము ఇండియాయొక్క అందుబడిలో లేదు. కొంతకాలమైన తర్వాతగాని అట్టి నాయకత్వమును వహించుటకు వీలుకాదు.

## నష్టము

లాభము లిన్ని ఉన్నను ఇంగ్లండుతో ఏలాటి సంబంధము ఉండరాదని చెప్పువా రెందరో ఉన్నారు. వారుసూచించు హేతువులుకూడ ఆలోచింపదగినవియే. (౧) ప్రస్తుతము అగ్రరాజ్యములమధ్య ఏర్పడిన విరోధములలో ఇండియా బహిరంగముగ ఇంగ్లండుతో సంబంధ మేర్పరచుకొనుట రషియాతో శత్రుత్వమును కోరుటయే. ఏపక్షమును వహించకుండుట ఉత్తమము గాని అనవసరముగ ఒకరికి మిత్రులుగను, ఇంకొకరికి శత్రువులుగను ఉండుట నష్టకారి. (౨) కామన్‌వెల్తుతో సంబంధము పెట్టుకొనుటద్వారా ఇండియాకును పాకిస్థానుకును, ఇండియాకును దక్షిణఆఫ్రికాకును మధ్య ఏర్పడిన వివాదములు శాంతియుతముగ పరిష్కారము కాజాలవయ్యెను. అట్టి కామన్‌వెల్తుతో సంబంధ మున్నను లేకపోయినను ఒకటే. (౩) ఈ వివాదము లన్నిటిలో ఇంగ్లండు, తక్కిన శ్వేతఅధినివేశములును పాకిస్థాన్‌పక్షమునే వహించి ఇండియా యెడల విరోధభావమును చూపెట్టినవి. సమావేశములలో తక్కిన రాజ్యము లొక పక్షముననూ, ఇండియా మాత్రము ఇంకొకపక్షముననూ ఉండవలసిన పరిస్థితులు ఏర్పడునట్లు కనుపించుచున్నవి. ఇట్టి సందర్భములో కామన్‌వెల్తునుండి విడిపోవుటయే గౌరవమార్గము.

ఈ విషయములోని సాధకబాధకములు కొన్ని మాత్రమే ఇచ్చుట సూచింపబడినవి. ఇప్పుడు సమావేశమైఉండు రాజ్యాంగపరిషత్తులోని ప్రముఖులందరు వీటినిని, పండితనెహ్రూ విశదీకరించు ఇతరవిషయములను సమగ్రముగ పరీక్షించి దేశమునకు గౌరవకరమును, లాభకరమును అగు నిర్ణయమునకు రావలె నని కోరుటయే కర్తవ్యము.

## ఇంగ్లీషువారి కాంక్ష

ఇండియాతోడ ఏదోఒకవిధమైన సంబంధమును ఏర్పరచుకొనుటకు కామన్‌వెల్తులోని శ్వేతఅధినివేశ రాజ్యములవారందరు కాంక్షించుచున్నారు. భూగోళ దృష్ట్యా ఇండియాకు గల ప్రాధాన్యమే దీనికి కారణము. ఈ ప్రాధాన్యముద్వారా యుద్ధకాలమందు ఇండియాకు ఎక్కువ ప్రాధాన్యము కలుగుచున్నది. రషియాకును, అమెరికా ఇంగ్లండులకును ఎప్పుడైన యుద్ధము సంభవించినయెడల మధ్యప్రాచ్యము ప్రధాన యుద్ధరంగములలో ఒకటి కాగలదు. గతరెండుప్రపంచ యుద్ధములలో మధ్యప్రాచ్యము ఇట్టి యుద్ధరంగ మయ్యెను. అచ్చటి పెట్రోలుగనులు ఈ ప్రాధాన్యమునకు హేతువు. ఇదిగాక, హిందూమహాసముద్రమందుండు బ్రిటిష్‌వలసరాష్ట్రములను, ఆస్ట్రేలియా న్యూజిలండులతోడి సంబంధమును ఇంగ్లండు రక్షించుకొను

టకు మధ్యప్రాచ్యము రషియావశము కాకుండుట అత్యావశ్యకము. కాని మధ్యప్రాచ్యము రషియా వశము కాకుండజేయుటలోను, హిందూమహాసముద్రమున తమ ప్రాబల్యమును నిలబెట్టుకొనుటలోను ఇండియా ఇంగ్లండుకు ఎంతో అవసరము. ఈకారణము లన్నిటిచేత ఏవిధముగనైన ఇండియాతోడి అనుబంధము సడలకుండ ఉంచవలె నని ఇంగ్లండు కాంక్షించుచున్నది.

## పశ్చిమయూరపు సమాఖ్య

కామన్‌వెల్తుప్రధానుల సమావేశము చాలవరకు ఫలవంత మగుటచేత ఆ సమావేశము ముగిసినవెంటనే బ్రిటిష్‌విదేశాంగమంత్రి బెవిన్ పశ్చిమయూరపు సమాఖ్యలో చేరిన బెల్జియం, హాలెండు, లక్సెంబర్గు, ఫ్రాన్సు దేశముల విదేశాంగమంత్రులతో యుద్ధసన్నాహములవిషయమై రహస్యచర్చలు జరిపెను. దీనికి ఫలితముగ రషియాతో యుద్ధము సంభవించిన యెడల ఎట్టి వ్యూహములను పన్నవలసియుండునో వారు నిర్ణయించుకొన్నట్లు తెలియుచున్నది. యునైటెడ్ స్టేట్సు కనడారాజ్యములు ఇట్టి యుద్ధములో పశ్చిమయూరపుసమాఖ్యకు చేయవలసిన సైనికసహాయమును గురించికూడ వివరములన్నియు ఈసంప్రతింపులలో స్పష్టపరచబడెను. ఈసందర్భములో ఇంకొక విశేషముకూడ గమనింపదగియున్నది. స్పెయిన్‌దేశము ఫాసిస్టునాయకుడైన ఫ్రాంకోకు లోబడియున్నదనియు, ప్రజాస్వామ్యసిద్ధాంతవిరోధియు, హిట్లరు ముసోలినీల మిత్రవర్గములో నొకడును అగు ఫ్రాంకో నియంతగ ఉన్నంతవరకు స్పెయిన్‌తో ఎట్టి సంబంధమును పెట్టుకొనరా దని చెప్పుచు వచ్చిన అమెరికావారు అతని కిప్పుడు సుముఖులై అతని సహాయమును సంపాదించుటకు కొన్ని రహస్యసంప్రతింపులు జరుపుచున్నట్లు తెలియవచ్చుచున్నది.

## ఫ్రాన్సులోని పరిస్థితులు

దీనికి రెండు ప్రధానకారణములు గలవు. పశ్చిమయూరపులోని దేశములన్నిటిలో ఫ్రాన్సుకీలకస్థానమును వహించియున్నది. ఫ్రెంచివారి పరిపూర్ణసహాయము లేక అమెరికావారు రషియాతో యుద్ధము జరపుట సులభసాధ్యము కాదు. సైనికశిబిరములు, నౌకాశ్రయములు, విమానాశ్రయములు ఫ్రాన్సులో సంపాదించుట వారి కత్యావశ్యకము. కాని ఫ్రాన్సులో ప్రస్తుత పరిస్థితులు మిక్కిలి ప్రమాదకరములుగ నున్నవి. దీనికి కారణములు గత సంచికలో సూచింపబడెను. అక్టోబరులో ఈ పరిస్థితులు మరింత ప్రమాదకరము లయ్యెను. బొగ్గుగనులలో పనిచేయు అయిదులక్షల కార్మికులు గొప్ప సమ్మెను ప్రారంభించి ఇప్పటివరకు జరపుచున్నారు. మరికొందరు కార్మికులుకూడ వారియెడల సానుభూతి చూపు ఉద్దేశముతో సమ్మెలో చేరిరి. సమ్మెదారులు దౌర్జన్యముద్వారా కొన్ని గనులకు విపరీతనష్టమును కలిగించిరి. ఆకారణముచేత వారిపై పోలీసులను, సైనికులను ఉపయోగించవలసిన అవసరము కలిగెను. ఆఘర్షణలలో అనేకులు మరణించిరి. ఏలాగో కొన్ని గనులను ప్రభుత్వమువారు వశపరచుకొనిరి. ఇప్పుడిప్పుడు కార్మికులు కొందరు సమ్మెను మాని యథాపూర్వముగ పనిలో ప్రవేశించుచున్నారు. కాని వారు శాశ్వతముగ సమ్మెలధోరణిని మానుకొన్నవారు కారు. ధరలు పెరుగుటచేత ఎక్కువగ కూలీ కావలెనని వీరు సమ్మెలు చేయుచున్నను ఈ సమ్మెలద్వారా దేశమందు అల్లరులను లేవదీసి, ప్రజాప్రభుత్వమును తొలగించి కమ్యూనిజమును స్థాపించుటకు కమ్యూనిస్టుపక్షం వారు ప్రయత్నించుచున్నారు. ఫ్రాన్సు ఇటిస్థితిలో ఉండుటచేత అచ్చట శిబిరాదులను ఏర్పరచుకొనుట క్షేమము కాదని అమెరికావారు తలచి ఫ్రాంకోతో రాయబారములు జరపుచున్నారు.

## బర్లిన్ ప్రతిష్టంభన

బర్లిన్‌సమస్యపై రషియా, పశ్చిమరాజ్యముల మధ్య ఏర్పడిన వివాదము ఇంకను పరిష్కారము కాలేదు. భద్రతాసంఘమువారు దీనినిగురించి ఆలోచించి, ఉభయపక్షములవారి గౌరవమునకు ప్రతిష్ఠకు భంగము కాని రాజీమార్గము నొకదానిని సూచించినను రషియావారు దానికి సమ్మతించనందున, సమస్య సమస్యగానే ఉన్నది. ఈమధ్య రషియాప్రధాని స్టాలిన్ ఇందువిషయమై తన అభిప్రాయమును వ్యక్తపరచుచు, పశ్చిమరాజ్యములవారు యుద్ధమునకు కాలు ద్రవ్వుచున్నా రనియు, రషియాప్రభుత్వము శాంతి సంస్థాపనకు ఎన్ని ప్రయత్నములను చేసినను పశ్చిమరాజ్యములవారి ఆధికారకాంక్షకారణమున ఈ ప్రయత్నములు సఫలములు కాలే దనియు వారిని నిందించెను. ఈవివాదములో తప్పొప్పులు ఫలానివారి దని నిర్ణయించుట సులభము కాదు. కాని బర్లిన్‌ప్రతిష్టంభనను ప్రారంభించినవారు రషియావారు. ఎవరెన్ని చెప్పినను, ఆ ప్రతిష్టంభనలో ఎట్టి మార్పు కను

పించలేదు. అందులో రష్యావారు కొంచెము మెత్త బడినగాని శాంతి యుండజాలదు.

## అమెరికా ఎన్నికలు

బర్లిన్ ప్రతిష్టంభనయే గాక పాలెస్టైన్ లోని ప్రతిష్టంభనకూడ ఏమాత్రము అక్టోబరులో మారలేదు. దీనికి ఒక కారణము కనుపించుచున్నది. పాలెస్టైన్ విషయమై అమెరికావారు ఒక నిశ్చితాభిప్రాయమునకు ఇంకను రాకున్నారు. అగ్రాధ్యక్షుని ఎన్నికలు నవంబరు ౨వ తేదీన జరుగనున్నవి. ఈఎన్నికలలో పోటీచేయుచుండు రెండు పక్షములవారు యూదుల సహాయమును అపేక్షించువారు. అమెరికాలో సుమారు ౧౫ లక్షల యూదులు వోటర్లుగా ఉన్నారు. వారి వోటును సంపాదించుటకు రెండు పక్షములవారును ప్రయత్నించుచున్నారు. పాలెస్టైన్ గురించి ఏ అభిప్రాయమును వ్యక్తపరచినను, ఏదో ఒక ఇబ్బంది కలుగు ననే భయముచే ఎన్నికలు పూర్తియగువరకు ఈ విషయమై తమ అభిప్రాయమును తెలుపుటకు అమెరికనులు జంకుచున్నారు. అందుచేత పేరునకు పాలెస్టైన్ లో యుద్ధవిరమణ ఉన్నను రెండుపక్షములవారు యుద్దము చేయుచునే ఉన్నారు. ఈ యుద్ధములో యూదులదే పైచెయ్యి. దేశములో కొన్ని ప్రాంతములను వారు ఈమధ్య వశపరచుకొనిరి.

## చైనాలో విషమపరిస్థితులు

గత మాసములో జరిగిన విషయములలో ఎక్కువగ విచారించదగినది చైనాలోని అంతర్యుద్ధము యొక్క విషమపరిణామము. చైనాలోని ఐశ్వర్యవంతములగు రాష్ట్రములలో మంచూరియా మిక్కిలి ప్రధానమైనది. దీనిని వశపరచుకొనుటకు మూడు సంవత్సరములుగ కమ్యూనిస్టులు పోరాడుచుండిరి. జాతీయప్రభుత్వనాయకుడైన చియాంగ్ కై షెక్ వారిని కొంతవరకు ఎదిరించగలవాడయ్యెను గాని, క్రమక్రమముగ వారిబలమే అభివృద్ధిగాంచి తుదకు కొన్ని రోజులక్రిందట మంచూరియా ప్రధాన పట్టణముకూడ వారి స్వాధీనమయ్యెను. దీనితో మంచూరియాకు కమ్యూనిస్టులు పరిపాలకు లగుటయే కాక, ఉత్తరచైనాలోని మరికొన్ని ప్రాంతములు కూడ వారికి చిక్కు పరిస్థితులు సంప్రాప్తించెను. చియాంగ్ కై షెక్‌యొక్క నాయకత్వముగాని అధికారముగాని మరి నిలబడునట్లు లేదు. అతని జాతీయప్రభుత్వము యొక్క దౌర్బల్యము కొన్ని సంవత్సరముల క్రిందటనే స్పష్టమయ్యెను. ప్రజల ఆమోదమును తాను, తన ప్రభుత్వము కోల్పోవుచుండుటను గుర్తెరిగినను దానికి కారణములైన తన అనుచరుల స్వలాభపరత్వము, లంచగొండితనము మొదలైన లోపములను అతడు రూపుమాపలేకపోయెను. జాతీయప్రభుత్వమునకు ఫలితముగ జమీందారీలయు, సాహుకార్లయు దుండగములు నశించి తమ ఆర్థికస్థితి బాగుపడు నని కర్షకులు, కార్మికులు ఎంతో కుతూహలపడియుండిరి. కాని, వారు కోరిన సంస్కరణములను వేనిని చియాంగ్ చేయలేకపోయెను. అతని పతనమునకై విషాదము చెందువారెవ్వరు ప్రజాసామాన్యములో కనుపించుటలేదు. జపాన్ వారి దురాక్రమణమునుండి దేశమును రక్షించిన మహామహు డను ప్రఖ్యాతిగాంచినవాడు స్వరాజ్యరథమును న్యాయమార్గమున నడుపని కారణమున ఇట్టి అధోగతికి రావలసివచ్చెను. కమ్యూనిస్టుల విజృంభణము దేశమందంతట వ్యాపించుటకు పూర్వమే వారితో రాజీ చేసికొని అవసరమైనయెడల వారితో కలిసి మిశ్రమప్రభుత్వము నొకదానిని స్థాపించి, అంతర్యుద్ధమును మాన్పుటకు మితపక్షనాయకు లనేకులు ప్రయత్నించుచున్నారు. ౪౦ కోట్ల జనము కలిగి, ఆర్థిక సదుపాయములన్నిటిని కలదై, సమస్తభోగభాగ్యములతో తులతూగుచు తూర్పు ఏషియాకంతకు నాయకమణియగు నని ప్రపంచమంతయు అనుకొన్న చైనా దేశము ప్రస్తుతము ఇట్టి పరిస్థితిలోనికి వచ్చుట విషాదకరమైన విషయమే. కమ్యూనిస్టుపక్షమువారు ఇచ్చట ఇంతటి అఖండమైన విజయమును సంపాదించిన కారణమున ఏషియాలోని ఇతరదేశములందుండు కమ్యూనిస్టు పక్షమువారు మరింత ఉత్సాహముతోను, పట్టుదలతోను పనిచేయగల రని చెప్పవచ్చును.

కమ్యూనిస్టువిధానమును అరికట్టు ఉద్దేశముతో తమ రాజ్యాంగనీతి నంతను నడుపుచున్న అమెరికావారు చైనావిషయమై ఇకమీదట ఏమి చేయుదురో చెప్పుట కష్టసాధ్యము. మంచూరియా, ఉత్తర చైనాలయందే కాక కొరియాలో కూడ కమ్యూనిస్టు పక్షమువారు ముందుకు వచ్చుచున్నారు. పశ్చిమ యూరపుదేశములలోని కమ్యూనిస్టుపక్షముల నణచుట అమెరికన్లకు సులభము కావచ్చును. కాని, చైనా, కొరియాలలో అట్టి పని చేయుట కష్టసాధ్య మని తోచుచున్నది.

## కాంగ్రెసు అధ్యక్షుని ఎన్నిక

గతమాసమున భరతఖండమములో కాంగ్రెసు అధ్యక్షపదవికి శ్రీయుతులు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారికిని, పురుషోత్తమదాస్ టాండన్‌గారికిని పోటీజరిగి శ్రీ పట్టాభిసీతారామయ్యగారు విజయము గాంచిరి. సుమారు నలభై సంవత్సరములనుండి దేశోద్ధరణమునకును, స్వరాజ్యసంపాదనమునకును సమస్త త్యాగములు జేసిన శ్రీ సీతారామయ్యగారు కాంగ్రెసు అధ్యక్షు లగుట భారతీయు లందరికి గర్వించదగిన విషయము. ఇన్నాళ్లకు ఆంధ్రనాయకు డొకడు అధ్యక్షు డగుటకు ఆంధ్రులకు ప్రత్యేకముదావహము. పోటీలేకయే వారు అధ్యక్షు లైయుండిన బాగుండెడిది అని అనేకుల అభిప్రాయము. కాని అట్లు జరగలే దని విచారించవలసిన జరూరు లేదు. ప్రజాస్వామ్యవిధానములో పోటీలేని ఎన్నిక లుండుట అసహజము, అసాధ్యముకూడను. పోటీ లేకపోవుట వాంఛనీయముకూడ కాదు. పోటీ ఉన్నప్పుడే ఎన్నికలు రాణించగలవు. నిరంకుశవిధానమునకే పోటీ లేకపోవుట లక్షణము. మహాత్మాగాంధీగారి నిరంకుశత్వము (ప్రజల ఆమోదమును పొందిన నిరంకుశత్వము కావచ్చును) మూలముననే ఇదివరకు పోటీలేక అధ్యక్షుని ఎన్నికలు జరిగినవి. అట్టి ఆమోదమును పొందిన నాయకుడు దేశమునకు లభించజాలడు. ప్రస్తుతపరిస్థితులలో పోటీలో గెలిచి శ్రీ పట్టాభిగారు అధ్యక్షులగుట ప్రశంసింపదగినదే.

## ప్రభుత్వమునకును అధ్యక్షునకును సంబంధము

అయితే దేశము ఇప్పుడు ఎదుర్కొనవలసిన గడ్డుసమస్య అధ్యక్షుని ఎన్నికలో పోటీ ఉండవలెనా, కూడదా అన్నది కాదు. కాంగ్రెసు పక్షమునకును నెహ్రూ, పటేల్‌గార్లతో కూడిన ప్రభుత్వమునకును ఎట్టి సంబంధ ముండవలె ననుటయే ప్రధాన మైన సమస్య. కాంగ్రెసు అధ్యక్షుడును అతని కార్యనిర్వాహకవర్గమును చెప్పినట్లు కాంగ్రెసుప్రభుత్వము సాగవలెనా? లేక ప్రభుత్వము చెప్పినట్లు అధ్యక్షుడును, అతని కార్యనిర్వాహకవర్గమును నడుచుకొనవలెనా? తాను చెప్పినట్లు ప్రభుత్వమువారు నడుచుకొనుట లే దను కారణముచేతనేగదా శ్రీ కృపలానీగారు అధ్యక్షపదవికి రాజీనామా ఇవ్వవలసివచ్చినది. శ్రీ పట్టాభిగారు అధ్యక్షులగుటమూలమున భాషాప్రయుక్త రాష్ట్రముల నిర్మాణము వెంటనే జరుగునని అనేకులు అభిప్రాయపడియున్నారు. ఇప్పటివరకు అట్టి నిర్మాణము జరగకుండుటకు నెహ్రూ, పటేల్‌గార్ల విముఖత్వము కారణము గదా? ఇట్టి సందర్భములో శ్రీ పట్టాభిగారు వారిని కాదని భాషాప్రయుక్తరాష్ట్రములను సాధించగలరా? పరిస్థితులను మనము చక్కగా గమనించినయెడల అట్టిది వీరు సాధింపజాల రనియే చెప్పవలసియున్నది. కాంగ్రెసు అధ్యక్షుడు ప్రభుత్వవర్గమును అనుసరించి వెళ్లవలసినవాడే గాని అతనిని అనుసరించి ప్రభుత్వము నడుచుట జరగనట్లు కనుపించుచున్నది.

## అధ్యక్షుని కర్తవ్యము

ఇట్టి స్థితిలో శ్రీ పట్టాభివంటి సమర్థుడు కాంగ్రెసుఅధ్యక్షుడై సాధించవలసిన పను లేమైన ఉన్నవా? అను సంశయము కలుగక తప్పదు. చేయవలసిన పను లనేకము లున్నవి. వాటిలో ప్రధానమైనది కాంగ్రెసు పేరుప్రతిష్ఠలను దేశమందు పునరుద్ధరించుట. గత రెండుసంవత్సరములమధ్య ఇవి చాలవరకు తగ్గిపోయినవి. కొందరు తెలిసియు, కొందరు తెలియకయు కాంగ్రెసుప్రభుత్వములను తీవ్రముగ విమర్శించి ఖండించుట మామూ లైనది. కాంగ్రెసువిరోధుల ప్రాబల్యము అనేకప్రదేశములలో వృద్ధిగాంచుచున్నది. ఈ విరోధులలో ప్రజాస్వామ్యసిద్ధాంతముల నంగీకరించని దౌర్జన్యవాదు లనేకు లున్నారు. వారిప్రాబల్యము అధికమైనయెడల దేశములో అల్లరులు ఎక్కువై అరాచకము సంప్రాప్తించును. ప్రజాస్వామ్యమందు విశ్వాసముగల సోషలిస్టులు మొదలగువారుకూడ వారి పక్షమును బలపరచుకొనుటకు తీవ్రకృషి చేయుచున్నారు. కాంగ్రెసుయొక్క ఆదర్శములు, పరిపాలనవిధానము తక్కిన పక్షములవారి ఆదర్శములకంటె ఉత్తమములైన వని ప్రజలకు తెలుపవలసిన అవసరము ఎక్కువగ నున్నది. ఒక సంవత్సరములో క్రొత్త ఎన్నికలు రానున్నవి. అప్పటికి వివిధరాజకీయ పక్షముల మతములలోని గుణాగుణములు ప్రజాసామాన్యమునకు స్పష్టముకావలెను. అట్టి పని చేయుటకు గొప్ప వక్తయు, నాయకుడును అగు శ్రీ పట్టాభి తగినవాడు. వారు చేయవలసిన పనులలో ఈ ప్రచారమే ముఖ్యము. కాంగ్రెసుప్రభుత్వమువారి పరిపాలనమును ప్రజల యెదుట సమర్థించవలసిన అవసర మేర్పడియున్నది. ఆ అవసరమును వారు తీర్చవలెను. ప్రస్తుతము కాంగ్రెసు

నాయకులకు ప్రజాసామాన్యముతో గల సంబంధము చాలవరకు తగ్గిపోయినది. అట్టి సంబంధమును తిరిగి స్థాపించుటకు వారు ప్రయత్నించవలెను. ఇదిగాక కాంగ్రెసులో అనేకచీలికలు బయలుదేరిఉన్నవి. అధికారవ్యామోహము వృద్ధిగాంచియున్నది. స్వలాభపరత్వము ప్రబలియున్నది. ఇట్టి లోపముల నన్నిటిని పోగొట్టి కాంగ్రెసుపక్షమును బలపరచుటయే అధ్యక్షుడు చేయవలసిన పని.

## ధరలు తగ్గించుటకు సూచనలు

ధరలు విపరీతముగ పెరుగుచుండుటచేత సామాన్యప్రజలయందు అసంతృప్తి దినదినాభివృద్ధిగాంచుచున్నదనియు, దానిమూలమున శాంతిభద్రతలకు ప్రమాదము సంభవించు ననియు గ్రహించి ధరలు తగ్గించుటకై కొన్ని సాధనములను ప్రయోగించు ఉద్దేశమును తెలుపుచు గతమాసప్రారంభమున ప్రభుత్వమువారొక ప్రకటనను గావించిరి. ధరలు పెరుగుటకు రెండే ప్రధానకారణములు. దేశములో ఉత్పత్తి తగ్గుట మొదటి కారణము. చెలామణీద్రవ్యము అత్యధికముగ వృద్ధియగుట రెండవ కారణము. ధరలు తగ్గవలయు ననిన ఉత్పత్తియగు ఆహారాదిపదార్థములు అధికము కావలెను; చెలామణీద్రవ్యము తగ్గిపోవలెను. చెలామణీద్రవ్యమును హెచ్చుచేయుటకును, తగ్గించుటకును ప్రభుత్వమువారికే అధికారమున్నది. వారు చేయు ఖర్చులకు కావలసిన ధనమును పన్నులమూలమునను, ఋణములమూలమునను ప్రజలనుండి వసూలుచేయుటకు ఇష్టపడక, క్రొత్తనోట్లను అచ్చువేసి వాటిని ఉపయోగించుటచేత చెలామణీ ఎక్కువగుట సంభవించినది. ఇదంతయు ఎక్కువ జీతములు పుచ్చుకొన్న ఉద్యోగస్థులు, గవర్నమెంటుకంట్రాక్టర్లు, గవర్నమెంటుకు వస్తువులను అమ్మిన వర్తకులు మొదలగువారివద్ద చేరియున్నది. ఇప్పుడు ధరలు తగ్గవలయు ననిన ధనికులవద్ద నుండు ఈ చెలామణీద్రవ్యములో చాలభాగమును గవర్నమెంటువారు స్వాధీనముచేసికొనవలెను. అనగా అధికపన్నులను విధించవలెను. ఆవిషయమునే గవర్నమెంటుప్రకటనలో అధికారులు సూచించిరి. ఇదిగాక, ప్రభుత్వమువారు వారుచేయు ఖర్చులను తగ్గించుకొనవలెను. తగ్గించుకొనుటకు ఇష్టములేనిపక్షమున ఖర్చులకు కావలసిన ద్రవ్యమును పన్నులమూలమున సంపాదించవలెనేగాని, క్రొత్తనోట్లను అచ్చువేసియు, ఇదివరకు దాచిఉంచుకొన్న ద్రవ్యమును ఉపయోగించియు క్రొత్త ఉద్యమములను ప్రారంభించరాదు. మొత్తముమీద తేలిన దేమనగా: ధనికులనుండి పన్నుల మూలమున ఎక్కువ ద్రవ్యమును రాబట్టినగాని వెంటనే ధరలను తగ్గించుటకు వీలులేదనుట.

కాని ధనికులపై ఎక్కువ పన్నులు విధించుటకు కేంద్రప్రభుత్వముగాని, రాష్ట్రప్రభుత్వములుగాని ఇంకను సిద్ధపడియుండలేదు. ఇట్టి సందర్భములో ఎంతవరకు ధరలు తగ్గునో చూడవలసియున్నది. ఇందుకై ఎంతటి తీవ్రచర్య తీసికొనవలెనో అంతటి తీవ్రచర్యను ఏ ప్రభుత్వమువారును తీసికొనుట లేదు. ప్రస్తుతప్రభుత్వవిధానములో ఉండు లోపము ఇదియే.

## జమీందారీల రద్దు

ఇట్టి పరిస్థితులలో రాష్ట్రప్రభుత్వమువారు జమీందారీలను రద్దుచేయు చట్టమును గావించిరి. కాని జమీందారుల కియ్యవలసిన పరిహారద్రవ్యము 12½ కోట్లను ద్రవ్యరూపముగ వెంటనే ఇచ్చినయెడల దేశములోని చెలామణీ మరింత పెరిగి ధరలు మరింత హెచ్చు ప్రమాదమున్నది. ప్రజలపై పన్నులను విధించి ఈ 12½ కోట్ల ద్రవ్యమును సంపాదించుటకు రాష్ట్రప్రభుత్వమునకు ధైర్యము చాలదు. కేంద్రప్రభుత్వమువారు ఇంతటి ద్రవ్యమును ఉచితముగగాని, ఋణముగగాని రాష్ట్రమున కిచ్చుటకు అంగీకరించలేదు. ఇట్టి సందర్భములో జమీందారీచట్టము నొకదానిని చేసినామనిమాత్రమే మద్రాసుమంత్రివర్గమువారు చెప్పుకొను స్థితిలో ఉన్నారుగాని, దానిని అమలులో నుంచుటకు సమర్థులు కాకున్నారు. ప్రజలు ఈ విషయమును గమనించవలెను. నష్టపరిహారమీయక జమీందారీలను రద్దుచేయుట చట్టవిరుద్ధమనియు, ఆకారణముచేత జమీందారీచట్టము న్యాయసమ్మతము కాదని ఫెడరల్‌కోర్టులో వాదించుట కవకాశమున్నదనియు కొందరు బెదిరించుచున్నారు. [2-11-48]

# పట్టాభి

సూరుల్ శూరులు నీదు సర్వాతరతన్ సూచింప నెవ్వారు నీ
పేరే పల్క మహాసభాపతివిగా వేంచేసి పట్టాభి సీ
తారామా! నడిపింపుమా అల స్వతంత్రజ్యోతికిన్ జ్యోతివై
సారావారహిమాద్రిదీపితము యావద్భారతద్వీపమున్.

జాతిన్ జాతిని మేలుకొల్పగల భైషజ్యంబు నీ చేతిలో
చాతుర్యం బని పిన్నపెద్ద లెచటన్ శంఖంబు పూరించి నీ
నేతృత్వంబున నగ్నికుండమున నేనిన్ దూక సంసిద్ధులో
సీతారామ! సుధైకభాండమునకుం జేకొంచుబా మ్మిందరన్.

ముక్తిన్ భుక్తినిగూడ నీగల మహాపూజ్యన్ స్వరాట్పూరుషున్
భక్తిన్ భారతసింహపీఠికపయిం బట్టాభిషేకక్రియా
యుక్తుం జేయుచు విశ్వమంగళమహాసూక్తంబులన్ నీదు సద్
వక్తృత్వంబున వెల్లడింపు మిక సీతారామమంత్రీశ్వరా!

విశ్వ మెచ్చట నొక్క వేశ్మంబుగా దోచు బురుషు డెచ్చట విశ్వపురుషు గలియు
చుక్కలు దేనిపై శుభదృష్టి పరగించు, దిక్కాలములు దేని తేరిచూచు
దేనితో నల త్యాగదేవిక-సంగాత మగ్ని దేవునితోడ నాట యెచట
విశ్వమానవుని పెన్వెత యెందు వాణినై-రాల్ గోసికొంచు సంద్రములు దాటు
ఎచ్చటను హాస్యరసము దా రచ్చదీర్చు-నచ్చటను బొల్చు నీగద్దె, యందునుండి
తూర్పుపడమరలకును సేతువు నొనర్ప-దివురగదవయ్య పట్టాభి! తెలుగుమీఱ.

—వేలూరి శివరామశాస్త్రి



# కలగూరగంప

## నీరాజనం

మొదట్లో ఆశ్చర్యం వేసింది. తరువాత ఓ నాలుగురోజులు కంగారు పడకపోనూలేదు. చివరకి మహదానందం లభించింది. అవును. పట్టాభిని 'మన పట్టాభి' అని దేశం అంతా అనుకోవడం, అలాగ క్రోడీకృతమయిన అభిప్రాయాన్ని సమీకరించి, వారినే కాంగ్రెస్సుకి అధ్యక్షులుగా యెన్నుకోవడం-యింతకన్నా సంతోషవార్త వుంటుందా?

శ్రీ సీతారామయ్య పంతులుగారు చెప్పినట్టు, యెన్నాళ్లు వైద్యం ప్రాక్టీసుచేసేరో లెక్కకి రాదు కాని, వారు ప్రాక్టీసుచేసిన త్యాగం, చూపిన సేవానురక్తి, కలిగించిన జాతీయతా ప్రతీభారతీయుడి రక్తనాళాల్లోకి యెక్కిపోయింది, యింజక్షన్ మందులాగ. లోగడ ఓసారి మహాత్ములే వాపోయేరు—"పట్టాభి వోటమి నా వోటమి" అని. ఆమాటే ఆ రోజుల్లో ఒక నెల్లాళ్లు ముందుగా వెలువడివుంటే పరిస్థితులు యెలాగ ఉండేవో? జాతికి జీవగర్ర అయిన బాపూజీ హృదయంలో ఒక ఉన్నతస్థానాన్ని భోగరాజువారు ఆక్రమించుకొన్నా రన్న సంగతి విస్మరించరానిది, విస్మరించలేనిదిన్నీ.

* * *

గాంధీజీ గతించేరు. బాపూజీ యిక లేరు. మహాత్ములు మరి రారు. కాంగ్రెసుసంస్థ అనే పేరుతో జాతికి చైతన్యం కలిగించి, స్వాతంత్ర్యం సముపార్జించి, దేశానికీ, ప్రజకీ ఒక అంతస్తు ఏర్పరిచిన ఆ ప్రాణి పరోక్షంలోనే వుండిపోయింది. వారి ఉపదేశాన్ని ఆదేశంగా గ్రహించి స్వతంత్రభారతిని ప్రగతిమార్గాలలో చిరస్థాయిగా నెలకొల్పే భారం మనమీదా, మన సంస్థలమీదా, మన నాయకులమీదా ఆధారపడివుంది. సంస్థలన్నిటిలోకీ ఆదినుంచీ దేశాభ్యుదయానికి బద్ధకంకణమయినది కాంగ్రెసు. దానినే అంటిపెట్టుకుని, ఆ మహాదాదర్శాల వరవళ్లలోనే నడుచుకుపోతూ, కలలోనైనా కదం తప్పని ఆశ్వికుడు పట్టాభి. మేరుపర్వతంలాగ అగుపించిన అడ్డంకులన్నీ బూరుగదూదిలాగ తేలికఅయి గాలికి ఎగిరిపోగా, పుంజీభూతమయిన తేజోరాశి అయి నిలిచేడు ఆయన. ఆ వర్చస్సు అంతా కాంగ్రెసు అధినేతగా దేశానికి వినియోగిస్తాడు అంటే మహదానందమే కలిగింది.

భారతరాజకీయ వాఙ్మయంలో అత్యుత్తమస్థానం ఆక్రమించుకున్నవి రెండే రెండు గ్రంథాలు— ఒకటి *Discovery of India*; రెండోది కాంగ్రెసు చరిత్రాను. ఈ రెండూ చదివి జీర్ణంచేసుకో గలిగితే భారతీయ ఔన్నత్యాన్ని తెలుసుకున్నవాళ్లే అవుతాం. వీటికి ఒకేసాటి. ఒకటి సూర్యుడూ, రెండోది చంద్రుడున్నూ. మొదటిది జీవసంచలనాన్ని కలిగిస్తుంది; రెండోది ఆ సంచలనజీవితంలో శాంతి భద్రతలనీ, శ్రేయస్సౌభాగ్యాలనీ చేకూరుస్తుంది. కాంగ్రెసుసంస్థగురించి అమూలాగ్రంగా తెలుసుకోవాలిఅంటే నాటికీ, నేటికీ, ఏనాటికీకూడా పట్టాభిగారు రచించిన చరిత్రే మూలాధారం.

భలోక్తికి యీయన పెట్టినది పేరు. నిదర్శనం కావాలంటే వారి "*Feathers and stones*" అన్న పుస్తకం చూడండి. "మెటానమీ," "సినక్డకీలులు" (*Metanomy*) (*Synecdochil*) వెదడుని కలవరపరిచే రోజుల్లో 'మెటక్డకీ' (*Metacdoche*) అని ఒక కొత్తపదం సృష్టించి, యీ రెండిటిపోరూ పోదుల్చుకున్నట్టు!

పట్టాభి రచయితమాత్రమే కాడు. వక్త; ప్రతివాది భయంకరుడు.

ఈయన గొప్ప ఆర్థికశాస్త్ర వేత్తకూడాను. ఆంధ్రాబ్యాంకు మొదలయిన సంస్థలని నెలకొల్పి ఆర్థికపరిస్థితులకి క్రమయోగం కల్పించేడు. చాణుక్యుడి రక్తం పంచుకుపుట్టినవాడు కాడూ!

అంతేనా? అమాత్యపుంగవులకి ఉండవలసిన కార్యదక్షతా, శూరత్వమూ, పరిశీలనాచాతుర్యమూ,

వివేచనజ్ఞానమూ నిశితంగా వున్నాయి ఆయనలో. ఆ త్యాగమూర్తి ముఖంలో బ్రహ్మవర్చస్సు ఉట్టిపడుతుంది. సత్యాసత్యాలని అన్వేషించి, ఆవేశానికీ ఉద్వేశానికీ తావు యివ్వక, ఊహాతీతమయిన శక్తులు కనపరిచేడు—మంత్రి యుగంధరుడి మాతృభూమిలో వెలిగిన యీ మహనీయుడు.

ఆయన మేధావి. వారికి ఉన్న జ్ఞాపకశక్తి వివిధవిషయాల్లోనూ వారు సేకరించి సప్రమాణంగా ఋజువుచేసే వివరాలూ (*Statistics*) దిగ్భ్రమగొలుపుతాయి. ఇటువంటిశక్తియుతుడు కాంగ్రెస్సుకి నేడు ఎంతో అవసరం. కాంగ్రెసునే నమ్ముకుని, దాని ఆశయాలే పరమావధిగా పెట్టుకుని వర్తించి మన అందరి ఆమోదంతోనూ పదవులని అలంకరించిన మంత్రి వర్గానికి తనకీ రుచులు సరిపోలేదని వనుక కృపాలినీ రాజీనామా యిచ్చేరు. ఆ సంగతి జ్ఞాపకం వుంచుకుంటే కాంగ్రెసుకీ ప్రభుత్వానికీ సమైక్యతాభావం కుదర్చవలసిన అవసరం యెంతైనా వుంది అని తెలుస్తుంది. కాగా, కాంగ్రెసుపక్షకంలోనే యింకా యెన్నో మార్పులు, సవరణలు రావలసివున్నాయి. వాని దృక్పథం సునిశితంగా కేంద్రీకరించాలి. ప్రభుత్వానికీ ప్రజకీ సామరస్యం, సన్నిహితత్వం కుదర్చగలిగింది ఒక్క కాంగ్రెసు సంస్థ.

దేశంలో వున్న చిన్న రాష్ట్రాలు అన్నీ ఇంకా ఐక్యంకాలేదు. స్టేటుసపుల్సు కాన్ఫరెన్సుకి అధ్యక్షులుగా వుండి అమోఘసేవ చేసిన పట్టాభిగారివల్లనే యీ సమస్యంతకూ అంతా తీరవలసివుంది. ఇట్టి పరిస్థితుల్లో వారు అస్వస్థులుకావడం. కాంగ్రెసుకేకాక అఖిల భారతానికీ శ్రేయస్కరం అని వేరే చెప్పాలా? పట్టాభిది ఎన్నో ఢక్కామొక్కలు తిని పండిపోయిన బుర్ర. యువకులకన్నా కొంచెం అధికంగావుండే ఉత్సాహమున్నూ, ఆ అనుభవాన్నీ యీ శక్తినీ దేశానికి వినియోగించడానికి వీలుగా పరమాత్ముడు వారిని చిరంజీవులని చెయ్యాలనీ, యితోధికమయిన ద్రఢిమా పటిమా కైసేయాలనీ మన అందరి కోరికా, ప్రార్థనాను. యావద్భారతం వారికి జేజేలు అర్పిస్తోంది.

క్రొవ్విడి లక్ష్మన్న

# కొన్ని ప్రాచీన విషయములు

దక్షిణాఫ్రికాలో నీమధ్య స్టెర్క్‌ఫాంటైన్ వానరుని (ape-man) గర్భాశయ మొకటి లభించినది. ఈ వానరుడు మనుష్యాకృతిని బోలిన కోతులలోనివాడని ఇంతవరకు విజ్ఞులభిప్రాయపడుచుండెడివారు. డాక్టర్ బ్రూంకు దొరకిన ఈ వానరుని ఎముకలద్వారా— "ఈతడు మానవుల కతిసన్నిహితుడని చెప్ప వీలున్నది. ఈ గర్భాశయము చాలవరకు మనుష్యునిదిగానే కన్పడుచున్న" దని అనినాడు. వెన్నుపూస అడుగుభాగమున ఉండు త్రికోణాకారమగు ఎముక మొదలైనవిగూడ దీనితో కలిసియున్నవి. దీనితోపాటు అస్థిపంజరములో ననేకభాగములు దొరకిన వట. ఉత్తర ట్రాన్సువాల్‌లో మకపన్ గుహలవద్దనీ ఆదిమనివాసులనుగురించి పరిశోధించువారనేకులిప్పు డున్నారు. గార్డ్నర్, కిచింగ్ మొదలగువారు దాదాపు ఐదులక్షలక్రితమున్న జనుల గృహములు మొదలగువానిని దక్షిణాఫ్రికాలో శోధించుచున్నారు.

సర్ ఆర్థర్ కీత్ ఆదిమమానవులు ఆఫ్రికాలోనివారని చెప్పుచున్నాడు. క్రోధము, అసూయ, ద్వేషము అనునవి మానవుల అభివృద్ధికి చాల తోడ్పడినవని ఈతని అభిప్రాయము. ఆదిమవాసులలో ననేక తెగలు, వర్గములు ఉన్నవి. ప్రతివ్యక్తికి తన వర్గముపై అమితఅభిమానము, ఆదరము, గౌరవము కలవు. ఎవరైనా ఒక వ్యక్తికి కీడుసల్పినచో ఆ కూటమికే అది పరాభవముగా కన్పించుటచే అందరును కలిసి ప్రతీకారము చూపుదురు. అనగా నీ వాదముప్రకారము అంతర్జాతీయత కుదురదు. సర్వదేశములలోని మానవులనేకత్ర చేర్చవలెనని యెంచిన సంస్థలన్నియు కూలిపోయినవి. మున్ముందు దేశీయతయే బలవత్తరము కాగలదని కీత్ యొక్క అభిప్రాయము. దీనితో మన మంగీకరించినను, లేకున్నను, ఆఫ్రికాఖండమున మానవసృష్టి ప్రప్రథమమున జరిగిన దని స్పష్టము.

కొన్ని వేలయేండ్లక్రిందట ఆఫ్రికా ఖండము వింధ్యకు దక్షిణమున నున్న భారతదేశము, ఆస్ట్రేలియాలు కలిసియుండెడివి. గుజరాత్ ప్రాంతములోని అగ్నిపర్వతములు పైకి పొంగుటచే నీ ఖండములు విడిబడినవి. కాగా దక్షిణహిందూదేశముననే మానవోత్పత్తి జరిగిన దని చెప్పవీలున్నది. సింధులోయలో కన్పించు నాగరకత దక్షిణదేశములోని నదీముఖద్వారము లన్నింటిలోను కన్పించగలదు. మానవనాగరకత దక్షిణదేశముననే జరిగిన దని చెప్పుటకు అనేక ఉపపత్తులు గలవు.

ధర్మశాస్త్రమున ప్రాచీనులు చాలా అభివృద్ధి నందినారు. మనుస్మృతికి తుల్యములనవి చాలచోట్ల కన్పించుచున్నవి. మనుశాసనము చాల ప్రాచీనము. బాబిలోనియాలోని నిప్పూర్ ప్రాంతమున కొన్ని ముఖ్యమగు పత్రములు, శాసనములు దొరికినవి. దాదాపు క్రీ. పూ. ౧౫౦౦ లో పాలించిన హమ్మురాబి యను బాబిలోనియారాజే ప్రథమధర్మశాస్త్రకర్త యని నేటి వరకు విజ్ఞుల యభిప్రాయము. కాని ఇతనికంటె ౧౫౦ సంవత్సరములు ప్రాచీనుడైన లిపిట్ ఇష్టర్ రాజే ప్రథమ మానవధర్మశాస్త్రకర్త యని ప్రస్తుతము లభించిన శాసనాదికములవలన తెలియుచున్నది. క్యూనిఫారమ్ లిపిలో, సుమేరియన్ భాషలో నివి యున్నవి. ఈ ధర్మవిధులకు సుమేరియన్ ఆచారవ్యవహారములే మూలము.

ఏదేని తప్పును చేసిన వ్యక్తి శిక్షింపబడవలెను. ఈ శిక్షకు తప్పుకు అవినాభావసంబంధ ముండితీరవలెను. తప్పుకు శిక్ష చక్కగా సరిపోయియుండవలెనని చాలకాలము క్రిందటనే సుమేరియనులు గ్రహించినారు. ‘ఇతరుని తోటలో నున్న చెట్టు నొకడు నరకివేసినచో నతడు ‘మీనా’ యను వెండినాణెములో సగము చెల్లింపవలెను’ అను సుమేరియను శాసనము హమ్మురాబిశాసనములలో కూడ కలదు. కాని “ఆతోట యజమానుని అనుజ్ఞ గైకొనక నరకినచో” అను విశేషవిధియొకటి జేర్చబడినది. “ఇతరుని ఎద్దును బాడుగకు తెచ్చి దాని కంటికి దెబ్బ కలుగజేసిన దాని ప్రస్తుతపు ఖరీదులో సగ మీయవలెను” అని సుమేరియనులు. “ఆ యెద్దుయొక్క యజమానున కీయవలె”నని విశేషణముతో హమ్మురాబిలో కలదు. ఈ విధముగా సుమేరియనుల శాసనకలాపము చాలవరకు హమ్మురాబీలోనికి వచ్చినది. కాని సుమేరియనులలోని కొన్ని విధులు తర్వాతిశాస్త్రమున జేరలేదు.

“అన్యుని తోటలోని కనజ్ఞలేక పళ్ళుగా, నెవడైన పట్టుకొనబడినచో, దొంగతనముక్రింద పది వెండి నాణెములు చెల్లించవలె”నని సుమేరియనులు. ఈ న్యాయవిధుల నిచ్చినతర్వాత నీ క్రిందివాక్యమున్నది. “ఉతు (=ఆదిత్యుడు) యొక్క క్రమబద్ధమగు న్యాయమువలన, సుమేర్, అక్కడ్ (=బాబిలోనియా)లలో ఒడుదుడుకులు లేని న్యాయ ముండునట్లు చేసితిని. ఎన్లిల్ (=సుమేరులోని ప్రధానదేవత) యొక్క అజ్ఞచే, ఎన్లిల్ యొక్క పుత్రుడు, లిపిట్ ఇష్టర్ అను నేను శత్రుత్వమును, హింసను పోగొట్టగలిగితిని.”

ఈవిధముగా అనాదికాలమునుండి న్యాయశాస్త్రమర్యాద, నైతికప్రవర్తన అన్నిచోట్ల కాపాడబడినది. ఈ ప్రవర్తన చక్కగా భారతదేశమే క్రీ. పూ. 3000 నాటికే విరచించి గీతా రూపమున ఆవిష్కరించినది. ఈ పవిత్రతుల్యమైన గీతాశాస్త్రమును మించిన గ్రంథము ఇంతవరకును రాలేదనుటలో అతిశయోక్తి లేదు.

ఇక సాంఘికవ్యవస్థను గమనింతము. చలితో నీరు, శరీరము కరడుగట్టిపోవు ఆర్కిటిక్ ప్రాంతమున, చాలా శతాబ్దములక్రిందటనే మార్క్సు బోధించిన కమ్యూనిజము అవలంబింపబడినది. ఎస్కిమోల సాంఘికవ్యవస్థకు క్రొపోట్కిన్, ట్రాట్స్కీలు చెప్పినదానికిని పోలిక చాల కలదు. సంఘములో నెవరివద్ద నున్నను ముడిపదార్థములపై నందరకును సమానహక్కున్నది. కాని వానినుంచి తయారగు పదార్థముల కీ స్వభావము లేదు. వానికి వ్యక్తియే అధికారి, హక్కుదారుడుకూడ. కారిబౌ ఎస్కిమోల ఆచారవ్యవహారములు, అతిప్రాచీనములు, ఆదిమనివాసులవికూడ. వీరి యిండ్లు చర్మములతో చేయబడినవి. వీనికి వెచ్చదనము కలుగజేయు మార్గము లేవియు వీరికి తెలియవు. సముద్రతీరస్థులగు ఎస్కిమోలకు నిప్పు చేయు పద్ధతులు బాగుగా తెలియును. కారిబౌలు చర్మమునే ధరింతురు. వీరందరు ఆక్రమించిన స్థలవైశాల్యము ౨,౫౦,౦౦౦ చదరపుమైళ్లు. వీరి జనాభా ౨,౫౦౦. బల్లెము, విల్లు మొదలగువానితోనే వీరు వేటాడుదురు. గ్రీన్‌లాండునుంచి అలాస్కావరకు వీరి భాష ఒక్కటే. కనీసము పదివేల మాటలను ప్రతి ఎస్కిమో నేర్చుకొనకతప్పదు. ఇది అతిక్లిష్టమగు భాష యని విజ్ఞుల అభిప్రాయము. ఈ సాంఘికవ్యవస్థ ఆదిమనివాసులందరిలోను కన్పించుచున్నది.



# విమర్శనము



## ప్రజావిరోధి

హెన్రిక్ ఇబ్సెన్ అనే సుప్రసిద్ధ నాటక రచయిత వ్రాసిన ఒక సుప్రసిద్ధనాటకానికి ఇది తెనుగుసేత. అనువాదకుడు: విద్వాన్ విశ్వంగారు. ప్రకాశకులు: నవ్యసాహిత్యమాల, అనంతపురము. వల ౧ రూ.

"ఒక పట్టణాన్ని సమాజప్రతికృతిగా తీసుకొని, అందులో అవకాశవాదుల స్వార్థపరత్వం, మొండిఘటాల కనుమెలకువ, మాటలలో మహాదాశయాలు చెబుతూ కన్నకూటికి ఆశించేవారి కక్కూర్తి, సత్యదీక్షగలవారు పడవలసిన పాట్లు" మొదలైన సమాజంలోని కొంత కుళ్లు కుళ్లగించి కడిగివేశాడు—మహానుభావుడు ఇబ్సెన్ ఇందులో. ఇటువంటి సంఘసంస్కరణకావ్యకళాపాల్లో అతడు అందెవేసిన చేయి. ఇందులో అతడు చిత్రించినది పరాయిసంఘం కాగా దానికి తెలుగుసంఘంతో సమన్వయం కల్పించి, తెలుగువాతావరణం తెచ్చి, తెలుగుదనం సమకూర్చి, మూలంలోని బిగిసీ, బిగిసీ వీలైనంతమట్టుకు సాధించి తెచ్చి విద్వాన్ విశ్వంగారు ఈ తెలుగుపరివర్తనంలో కూడా తమ శేముషీవిశేషాన్ని చక్కగా చూపెట్టారు. ఇది అందరూ చదివి తప్పకుండా మననం చేయవలసిన నాటక మనడానికి సందేహంలేదు. కొన్ని కొన్ని సవరణలతో ఇది ప్రదర్శనయోగ్య మవుతుం దని కూడా చెప్పవచ్చు.

*   *   *   *

## లీలాసుందరి

చిన్నపిల్లల చిత్తాలకు హత్తుకొని, వారి నుత్సాహితులూపించే కట్టుకథలాంటి కల్పనాకథ. కథకులు: చింతాదీక్షితులుగారు. ప్రకాశకులు: త్రివేణీ పబ్లిషర్సు, మచిలీపట్టణము. వెల తెలియదు. అచ్చు కూర్పు, పుస్తకము తీరూ ముచ్చటగా ఉండి పిల్లలనిట్టే ఆకర్షింపగలిగేవిగా ఉన్నాయి. దీక్షితులుగారు మనపాలిటి బాలవాఙ్మయోద్ధారకు లనవచ్చు. పసిపిల్లల మనస్తత్త్వం చక్కగా కనిపెట్టినవారు వారు. అందుకు ఈ చిన్నరచనే తార్కాణం. ఇటువంటి రచనలను వారింకా ఇంకా సాగించి బాలవాఙ్మయశాఖను చక్కని తీరుతో వృద్ధికి తీసుకొని వస్తారని ఆశిస్తున్నాము.

## ఆశ్వినమాహాత్మ్యము

రచయిత: చెట్టి లక్ష్మీనరసింహశాస్త్రిగారు, ప్రకాశకులు: సాధనగ్రంథమండలి, తెనాలి. వెల రూ. ౧.

ఆశ్వయుజమాసమాహాత్మ్యమును, శ్రీ దేవీనవరాత్రవ్రతమహిమను సక్రమముగా, పురాణోక్తులతో నిరూపించు అయిదాశ్వాసముల పద్యకావ్య మిది. కవిత సులక్షణమై, సాంప్రదాయకమై నడచుచున్నది.

---

# గ్రంథ స్వీకారము

## అభిషేకనాటకము

భాసకృతికి అనువాదము. అనువాదకుడు: బులుసు వెంకటరమణయ్యగారు. ప్రకాశకులు: ఆర్. వెంకటేశ్వర్ అండు కో., లాక్ స్ట్రీటు, మద్రాసు. వెల రూ. ౧-౪-౦.

## ప్రాచీన యోగులు

రచయిత: కొడాలి లక్ష్మీనారాయణగారు, బి. ఏ., మోపర్రు, తెనాలితాలూకా. వెల ౮ అ.

## అజాతశత్రు

నాటకము. రచయిత: శ్రీ చంద్రశేఖర కవిశ్రీ. ప్రకాశకులు: వి. వి. నాయుడు అండ్ సన్సు, నెల్లూరు. వెల ౧౨ అ.

## బాపూజీ నిర్యాణము

పద్యకవిత. రచయిత: పోలూరి హనుమజ్జానకి రామశర్మగారు, బి. ఎ. (ఆనర్సు)., వి. ఆర్. కాలేజి, నెల్లూరు. వెల ౮ అ.

---

**Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., G. T., Madras. Editor—S. Sambhu Prasad.**




# లిప్టన్స

## అంటే అర్థం
## మంచి టీ

"టీ అంటే వారికి ఇష్టమే, కాని మంచి టీ అంటే ఏమిటో వారికి తెలియదు. వారు ఎల్లా తెలుసుకోగలరు? ఎందుచేతనంటే టీ పాత్రలో ఉండేటప్పుడే వారు దానిలో పాలుపోసి, దానిని కప్పులలో పోయకుండానే పాడుచేస్తున్నారు.

మంచి టీ కావలెనంటే పాలను కప్పులలో ముందు టీ పోసిన తరువాత వాటిలో మాత్రమే పోయవలెను. కాని, టీ పాత్రలో టీ ఉండగా ఆ పాత్రలో పాలను పోయకూడదు."

ఆనందం కోసరమున్నూ ఉత్సాహము కోసరమున్నూ లక్షలకొలది జనులు టీని కోరతారు. కాని టీ త్రాగే అంతమంది జనులు, మంచి టీ అంటే ఏమిటో తెలియకుండా ఉండడము ఎంత విచారకరమైన విషయం! మంచి టీకి ఖర్చు ఎక్కువ యేమీ కాదు. సులభమైన అయిదు సూత్రాలను పాటిస్తే, మంచి టీ లభిస్తుంది. మీ సొమ్ముకు పూరా విలువ కావలెనంటే, మీ టీ సంపూర్ణమైన సువాసనతో ఉండాలంటే ఈ సూత్రాలను కంఠోపాఠం చేసి, మీ మీ యిండ్లలో ఇవి అనుసరింపబడేటట్లు చూడండి.

## అయిదు సులభ సూత్రాలు

1. [illegible] 2. [illegible] 3. [illegible] 4. [illegible] 5. [illegible]

'టీని గురించి చిట్కాలు' అనే చిన్న పుస్తకం [illegible] 101, [illegible] 2.72, [illegible]

బాగుగా తయారు చేయబడిన టీ

అంత మంచిది ఇంకొకటి యేదీ లేదు.